**లక్ష్మీ గ్రంథ మండలి: ౧**

సంపాదకుఁడు: పిల్లలమఱ్ఱి లక్ష్మీ నారాయణ

# సంస్కృత న్యాయములు

# సంస్కృత న్యాయములు

౧. ౨. భాగములు

వ్యాఖ్యాతలు:
కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి
ఘట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి

లక్ష్మీ గ్రంథ మండలి
△ తెనాలి △

# అభిప్రాయములు

మహామహోపాధ్యాయులు, కవిసార్వభౌములు,
శ్రీకృష్ణభారత గ్రంథకర్తలు నగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి
శాస్త్రిగారు, రాజమహేంద్రవరము.

శ్రీయుత కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి సోదరులు వ్రాసి ముద్రించిన సంస్కృతన్యాయములు, అను గ్రంథము నేను జదివి మిక్కిలి యానందించితి. ఈన్యాయము 'లకారాది క్షకారాంత' మక్షరానుక్రమణికగా సంగ్రహింపఁబడినవి. సామాన్యముగా నీన్యాయములు, న్యాయాభిప్రాయములును బెక్కుమంది యెఱుంగరనియే నాయభిప్రాయము. కాకతాలీయన్యాయము, కర్కటీగర్భన్యాయము, అజగరన్యాయము, ఇత్యాదులు కొన్నిమాత్రమే లోకసామాన్యమునకుఁ దెలిసినవై యున్నవి. వీరీ న్యాయసంగ్రహమం దెంతయేని శ్రమ చేసిరని చెప్పుట సత్యోక్తియే. పీలుపత్రఫలన్యాయము, ఉష్ట్రలగుడన్యాయము ఇత్యాదులు చాలమందికిఁ దెలియనివే యగుచున్నవి. ఇట్టి న్యాయములు సమగ్రముగా సంగ్రహించి ముద్రించి వీరు లోకమునకు మహోపకృతిం జేసియుండిరని చెప్పుచున్నాను.

ఈ న్యాయగ్రంథము ప్రతి కవిహస్తము నలంకరించి యుండఁదగు. కావునఁ గవులును, పౌరాణికులును, పండితులును, ఉపాధ్యాయులును, విద్యార్థులును ఈ న్యాయగ్రంథమును స్వీకరింతురుగాక యని మనవి చేయుచున్నాను.

(Sd.) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

వై యాకరణులును, కొల్లూరు సంస్కృతపాఠశాలా
సాహిత్య వ్యాకరణశాస్త్రాధ్యాపకులును నగు బ్రహ్మశ్రీ
ప్రతాప హనుమచ్ఛాస్త్రిగారు

కొల్లూరు,
సంస్కృతపాఠశాల,
౧౬—౧౧—౩౮.

దృష్టా మయా సావధానేన "సంస్కృతన్యాయాః" శ్రీ ప్రభాకర, నరసింహాసుధీభ్యాం సమ్యగ్వివృతాః. తత్తద్గ్రన్థేషు తత్రతత్ర సందర్భానుసారేణ ప్రయుక్తానా మేకత్ర క్రోడీకారే, తదర్థవివరణేచ, శ్లాఘనీయోఽయ మనల్పధియో రనయో ర్గ్రన్థరచనాపరిశ్రమః. విరచయ్య చాఽనితరసాధారణ మిమం గ్రన్థరాజ మసాధారణకారణసామగ్రీసమ్పాదనేన మహోపకారః కృత స్సంస్కృతభాషా పరిచయాభిలాషి విద్యార్థినిచయస్య, పండితలోకస్య చేతి నాతిశయోక్తిః. ఏతత్ప్రకాశకరణానుమితామితభాషాపోషణాభినివేశయో రేనయో స్తరుణేన్దుశేఖరానుగ్రహబలా దేతాదృశ గ్రన్థగ్రథనానుకూలాన్తఃకరణప్రవృత్తి ర్వరీవృధీత్వి త్యాశాసే.

(Sd.) ప్రతాప హనుమచ్ఛాస్త్రీ.

శ్రీ రామకథాఽమృత గ్రంథకర్తలు, శతావధానులు నగు బ్రహ్మశ్రీ
తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారి కుమారులు,
శతావధానులు, రామకథాఽమృతోత్తరకాండ రచయితలు నవు
బ్రహ్మశ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు.

చందవ్రోలు,

20—11—39

"సంస్కృతన్యాయములు" అనుపేర భవన్ముద్ర్యమాణ గ్రంథమును యథావకాశముగఁ బరికించితి. ఇది "పరిభాషేందు శేఖరము" వలె నచ్చటచ్చటి న్యాయములన్నియు నొక్కచో సమకూర్చి వివరింపఁబడుట బహు శ్రమసాధ్యమైనపని. వివరించెడు పట్లఁ దెలుఁగుబాసయు సర్వజనసుబోధమై హృదయంగమమై యున్నది. పండితులకుసైత మొకప్పుడు మిక్కిలి సహాయ మొనర్చు నిప్పొత్తము విద్యార్థిజనుల కత్యావశ్యకమని వేఱె చెప్పనక్కఱలేదు. అందును లౌకిక న్యాయముల నెట్లో తెలిసికొననగుఁగాని యేతద్ద్వితీయ భాగమునందలి శాస్త్రీయన్యాయసమర్థనము నండఁగొనక యిప్పటి విద్యార్థులు భాషాసముద్రము నీదఁజాలరు. విద్యార్థులే యననేల, యిప్పటి విద్యాపూర్ణులును మునుపటివలె పుస్తకాపేక్షలేని వారు నాకు ననుభవమున నెవ్వరు గన్పట్టుటలేదు. అట్టిచో నిట్టి పొత్తమునకు విద్వద్విద్యార్థి జనసమీహితముల స్థాన

మీకతప్పదని నా యభిప్రాయము. గ్రథయితల సమీ
హితము లెల్ల నిట్లె సంపూర్ణము లయ్యెడుఁగాతమని మానస
మున నాశాసించుచుఁ దక్కు విషయములకు గ్రంథమె
తార్కాణము కాఁగలదని యింతతో విరమించుచున్నాను.

(Sd.) తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి.

సాహిత్యవిద్యాప్రవీణులు, వైయాకరణులు, శంకరవిద్యాలయ ప్రధానాధ్యాపకులు బ్రహ్మశ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారు

రేపల్లె,

17—11—39.

తమరు పంపిన "సంస్కృతన్యాయములు" అను గ్రంథము నామూలాగ్రముగ జదివితిని. అమందానందము నొందితిని. ఈ న్యాయవిజ్ఞానము విజ్ఞలోకములో మాటలాడు ప్రతి ప్రాజ్ఞునకు లోకజ్ఞానసూచకమై నుడికారపుటందము సంపాదించును. ప్రతిచ్ఛాత్రునకు తానుచదివెడు ప్రతి శాస్త్రము నందలి సిద్ధాంతముల న్యాయపూర్వకముగా నెఱుగుట కవకాశ మిడును. ఈ న్యాయములందు తెలుగు సామెతల ననువదించునవి కొన్ని యున్నను చాలవరకు సంస్కృభాషా దుగ్ధోదధి మథించి వెలికి తీసిన నవనీతఘుటికలె. వైదిక, లౌకిక శాస్త్రీయ వాఙ్మయమునందు ఆయా ప్రకరణములకు తత్తుల్య లౌకిక వ్యవహారములకు నుపయుక్తములగు న్యాయముల నన్నిటిని ఆయా శాస్త్రమర్యాదల నతిక్రమించని చక్కని శైలితో వ్యాఖ్యానముజేసి ఆంధ్రలోకమునకు ఆంధ్రభాషాయోషకు అమూల్యోపకార మొనర్చిన యీ సోదరకవుల కృతి నెంతయు నభినందించుచున్నాను.

(Sd.) ముళ్లపూడి నారాయణశాస్త్రి

సాహితీసమితి సభాపతులు, నవ్యసాహిత్యాచార్యులు,
సుప్రసిద్ధకవులు నవ శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు

శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారు, వారిసోదరులు శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు తెలుగులో వివరించిన సంస్కృతన్యాయములు అనే గ్రంథము స్థాలీపులాకన్యాయ రీత్యా తిరగవేశాను. వివరణము బాగున్నది. న్యాయమనేది విశేష విషయానికి సూత్రప్రాయమైన పంక్తి. న్యాయాలు షడ్దర్శనాలలోనూ, కావ్యనాటకాది సాహిత్యగ్రంథాలలోనూ తరుచుగా కనబడుతూ ఉంటవి. అవి బాగా గ్రహించడము అవసరము. ఈ పుస్తకము విద్యార్థులకూ, ఉపాధ్యాయులకూ, గ్రంథకర్తలకూ, కవులకూ ఉపకరిస్తుంది.

సాహితీ సమితి, తెనాలి.
భాద్రపద బహుళ షష్ఠి

(Sd.) తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

# లక్ష్మీగ్రంథమండలి, తెనాలి

## పోషకులు

**తంగిరాల వెంకటేశ్వర్లుగారు, తెనాలి.**

**తాయి వెంకటేశ్వర్లునాయుడుగారు,** B. A. BE.,
అసిస్టెంటు యింజనీరు, P. W. D.,
రామచంద్రపురము.

## అభిమానులు

మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ, కళాప్రపూర్ణ
**శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమండ్రి.**

మధురకవి:
**నాళం కృష్ణరావుగారు, రాజమండ్రి.**

ఆధునికకవి:
**చేకుమళ్ల కామేశ్వరరావుగారు,** B. A., B. Ed.
స్కూళ్ళ జూనియర్ డిప్యూటీ ఇన్స్పెక్టరు.
రేపల్లె.

# విన్నపము

మిత్రుల ప్రోత్సాహముచే "లక్ష్మీగ్రంథమండలి" యను నొండు గ్రంథమండలి స్థాపించితిని. కేవల మీయది వృత్తిగాఁ బెట్టుకొని గ్రంథముల మూలమున ధన మార్జించ వలయునని తలంపుగాదు. లోకోత్తరపురుషులచే వ్రాయఁ బడి జీర్ణములైయున్న గ్రంథములను, సర్వజనోపయోగ ములగు పుస్తకములను బ్రకటించి, నా నేర్చినంత, ఆంధ్ర భాషామతల్లికి సేవచేయవలయునను సంకల్పమే నన్నీకార్య మునకు బురికొల్పినది.

కొన్ని సంవత్సరములనుండి "సంస్కృతన్యాయములు, సంస్కృత లోకోక్తులు, తెలుఁగు జాతీయములు, తెలుగు సామెతలు" పుస్తకరూపముగాఁ బ్రకటించవలయునని యత్నిం చుచు, అందులకు వలయు కొంత సామగ్రిని సంపాదించి, నా మిత్రులగు, విద్వాంసుల కెఱింగించితిని. వారును సంత సించి కొంతవఱకుఁ దోడ్పడిరి. అందు ముఖ్యులు శ్రీ కూచి భొట్ల ప్రభాకరశాస్త్రి సోదరులు.

గ్రంథమండలియం దాదరముంచి సుప్రసిద్ధులు, మధురకవులునగు శ్రీ నాళం కృష్ణరావుగారు. వా రెన్నియో సంవత్సరములనుండి సేకరించుచున్న, కొన్ని సంస్కృతన్యాయ ములు, తెలుఁగు జాతీయములు, తెలుఁగు సామెతలు మాకుఁ బ్రసాదించియుండిరి.

ఆధునికకవులు, శ్రీ శేకుమళ్ల కామేశ్వరరావుగారు బి. ఏ., బి. యిడి. (Deputy Inspector of schools) నా యందభిమానముంచి, కొన్ని సామెతలు, జాతీయములు నిచ్చియుండిరి. వీ రిరువురకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ప్రప్రథమమున "లోకోక్తిముక్తావళి" యను పేరుతో తెలుఁగు సామెతలు ప్రకటింతుమని వెల్లడిజేసితిని. కాని పండితులు "సంస్కృతన్యాయములు" ప్రకటించవలసినదని నుడువఁగా నీయది ప్రకటించితిని. అచిరకాలమున తెలుఁగు జాతీయములు, సామెతలు ప్రకటింపఁబడును.

నాయందాదరభావము వహించి సంస్కృతన్యాయములు, జాతీయములు, సామెతలు కూర్చి వ్యాఖ్యానములు వ్రాసి యిచ్చుచుండిన, శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, వారి సోదరులు ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగార్లకు నా ధన్యవాదములు.

ఆంధ్రమహాశయు లెల్లఱు మా గ్రంథమండలియం దాదరభావము వహించి, చందాదారులుగాఁ జేరి ప్రోత్సహింపఁ బ్రార్థితులు.

లక్ష్మీ గ్రంథమండలి,
తెనాలి.
24-11-39

విధేయుఁడు,
పి. యల్. నారాయణ,
సంపాదకుఁడు.

# తొలి పలుకు

రత్నాకరమువలె నతిగంభీరమైన గీర్వాణభాషయందు సుందరతరములవు శ్లోకములను సరములఁ గొలికిపూస లనఁ జను న్యాయము లెన్ని యున్నవో యెఱింగికొనుట కడుం గడు దుర్ఘటము. అవ్వానివిలువ విజ్ఞులకుమాత్రమే విదితము.

కొందఱు సుమనసు లతి శ్రమ కోర్చి చాలవఱకు న్యాయములను తగు వ్యాఖ్యానములతోఁ బ్రకటించి దేశోప కార మొనరించియుండిరి. అందగ్రిస్థానము వహింపఁగల గ్రంథములును లేకపోలేదు. అట్టివి చాలవఱకు సంస్కృతాది భాషలలో నున్నవి. వానియందును న్యాయజాల మంతయు సమగ్రముగ నున్నట్లు కన్పట్టదు. తత్కృతికర్తలు తామిడు కొనిన సరణి కనువవువానిని మాత్రము గ్రహించియుండిరి.

ఎన్నియో సంవత్సరములనుండి లౌకిక, వైదిక న్యాయము లొకచోఁ గూర్చి తగువ్యాఖ్యానములతో నాంధ్రి మున సహృదయులమ్రోల నిడవలయు ననుకుతూహలమునఁ దత్ప్రియత్న మొనర్చుచుంటిమి. ఈ యుద్యమమున మాకుఁ దోడ్పడినమామిత్రులు మధురకవులు శ్రీ నాళం కృష్ణరావు గారి కెంతయుఁ గృతజ్ఞులము.

దైవానుగ్రిహమున నేఁటికి మాప్రయత్న మొకింత ఫలించినది. తప్పొప్పు లటుండ నిండు, పుస్తకరూపముగ సుమారు పండ్రెండువందలు న్యాయకుసుములు పాఠక మహాశయుల కరములయం దిడుచున్నాము. ఇయ్యది రెండు భాగములు. మొదటిభాగమున వైదిక, లౌకిక న్యాయములు

గూర్పఁబడినవి. వేదాంతవ్యాకరణాది పరిభాషలనుండియు, లోకోక్తులనుండియు వెలువడినవియు, కేవలము పరిభాషా స్వరూపముగనే యుండునవియు, నవ్యన్యాయములు ద్వితీయ భాగముగఁ గూర్చితిమి. అట్లు విడివిడిగ నుండు టాయా విషయములఁ గృషిసేయువారల కెంతయు లాభము గలిగించు నని మా యాశయము. మొత్తము రెండుభాగములును గలిపి యొకే సంపుటముగఁ జేసితిమి.

ప్రయత్నము మాత్రము చాలకాలమునుండి జరుగు చున్నను, ముద్రణముమాత్ర మవ్యవధిగ జరుగుటచే వ్రాఁత ప్రతిని తిరిగి సరిగ వ్రాయకయే ముద్రింపించితిమి. అందు వలనప్రమాదము లటనట సంభవించినవి. అవన్నియు త్వరలో రానున్న ద్వితీయముద్రణమున సవరించువారము.

శ్రీమయన కందందు సోదాహరణముగ న్యాయచయ స్వరూపప్రయోగములను వివరించిన మహనీయుల కెంతయుఁ గృతజ్ఞులము.

ప్రమాదవశమున సంభవించిన ప్రమాదములను, మా సాహసమును బుధులు మన్నింతురుగాక.

మాయందనుగ్రహముంచి, తమ యభిప్రాయముల నొసంగిన మహాపురుషులకు మా ధన్యవాదములు.

ఆదరమున మా పుస్తకమును బ్రకటింపఁ బూనుకొనిన లక్ష్మీగ్రంథమండలి వారెంతయు బ్రశంసనీయులు.

కొల్లూరు,
౨౦—౧౧—౩౯.

విధేయులు,
శాస్త్రి సోదరులు,
వ్యాఖ్యాతలు.

ఓమ్

# సంస్కృత న్యాయములు

అంకుశన్యాయము

గొప్పయేనుఁగు చిన్న అంకుశమునకు లోఁబడినట్లు.

అంకోలబీజన్యాయము

ఊడుగచెట్టుగింజలు క్రింద రాలి యురును వచ్చినతోడనే మరల ప్రమాని నంటుకొనును.

అండవిస్రంభన్యాయము

బుడ్డను నమ్మి యేటఁ బడినట్లు.

"ఎంతయు బుడ్డనమ్ముకొని యేటనుబడ్డవిధంబు కాదొకో"

శ్రవణానందము.

అంతర్దీపికాన్యాయము

కుండలోనున్న దీపము పైకి ప్రకాశింపక లోపలనే వెలుగును.

అంధకరదీపికాన్యాయము

గ్రుడ్డివానిచేతిలోని దీపము వానికేమియు నుపయోగింపదు.

అంధకవర్తకీయన్యాయము

పిచ్చుకదగ్గఱ చప్పట్లు కొట్టిన అది చేతిలోనికి వచ్చునా? అసంభవమని భావము.

అంధకూపన్యాయము

కొందఱు గ్రుడ్డివాండ్రు ఒకరివెనుక నొకరు పోవుచు, మొదటివాఁడు నూతిలోఁ బడఁ దక్కినవా రందఱు వాని త్రోవనే యనుసరించి నూతిలోఁ బడిరి.

అంధగజన్యాయము

నలుగురు గ్రుడ్డివాండ్రు ఏనుఁ గెట్లుండునో పరీక్షింపఁగోరి యొక యేనుఁగువద్దకుఁ బోయి నలుగురు నాలు గవయవములను తడవి చూచి పరీక్షించిరి. కాలు తడవినవాఁడు యేనుఁగు రోలువలె నుండుననియు, తోఁక తడవినవాఁడు చీపురువలె నుండుననియు, చెవులు తడవినవాఁడు చేటవలె నుండుననియు, తొండము తడవినవాఁడు రోకలివలె నుండుననియు వారు వాదింపఁజొచ్చిరి.

అంధగోక్షేత్రన్యాయము

గ్రుడ్డియెద్దు చేనిలోఁబడి తన నోటికందినదెల్ల తినును.

అంధగోలాంగూలన్యాయము

గ్రుడ్డివాఁడు ఆవుతోఁక బట్టుకొని నడచినట్లు.

అంధదర్పణన్యాయము

గ్రుడ్డివాని కద్దము చూపినట్లు.

అంధదీపికాన్యాయము

గ్రుడ్డివానికి దీప మున్నను లేకున్నను నొక్కటే.

అంధపంగున్యాయము

గ్రుడ్డివానిభుజమున కుంటివాఁడు కూర్చుండి మార్గము దెలుపుచుండ నిరువురును అన్యోన్యసాహాయ్యమునఁ దమ గమ్యస్థానము చేరుట.

అంధపరంపరాన్యాయము

ఒక గ్రుడ్డివాఁ డేదైన తెలివితక్కువపని చేసినయెడల తక్కినగ్రుడ్డివా రందఱు నదియే చేయుదురు.

(కొందఱు గ్రుడ్డివాండ్రు కలసి వెళ్ళుచు నందు మొదటి వాఁడు నూతిలోఁబడ, తక్కినవా రందఱు వరుసగ నూతిలోఁ బడినట్లు.)

అందాంజనన్యాయము

గ్రుడ్డివానికంటికి కాటుక పెట్టినట్లు.

అంధాంధన్యాయము

గ్రుడ్డివానికి గ్రుడ్డివాఁడు త్రోవ చూపినట్లు.

అంధాశ్వపౌళిన్యాయము

గుఱ్ఱము గ్రుడ్డిదైనను గుగ్గిళ్ళు తినుటలో పెద్ద.

"గ్రుడ్డిగుఱ్ఱపుతట్టు గుగ్గిళ్ళు తినఁ బెద్ద." వేణుగోపాలశ. 17

అంధాక్షిమీలనన్యాయము

గ్రుడ్డికన్ను మూసినను తెఱచినను ఒకటే.

"గ్రుడ్డికన్ను దా మూయకయున్న నేమి మఱి మూసిన నేమి?"

—కాసాంత్వనం 3-18.

అగ్నివల్మీన్యాయము

నిప్పునకు చెదలు పట్టునా ?

అగ్నివహ్నిన్యాయము

అగ్నిని అగ్ని తగులఁబెట్టఁగలదా ?

అచలచలన్యాయము

నడచుచున్న యోడమొదలగువానిపై నెక్కి పోవునపుడు కదలక నిలచియున్న తీరము వృక్షములు మున్నగునవి నడచుచున్నట్లును, నడచుచున్నయోడ నిలిచినట్లును కన్పించును.

అజగరన్యాయము

కొండచిలువ నిద్రబోవుచున్నట్లే పడియుండి తన్ను సమీపించిన జంతువును ఆకస్మికముగఁ బట్టి మ్రింగివేయును.

అజాకృపాణీయన్యాయము

కత్తి లేనికారణమున దన్ను జంపఁజాలక యుపాయ మరయుచున్న యొకపురుషునిపై మేక యొకటి మదమున గాలు ద్రవ్వెను. అట్లు త్రవ్వినమట్టిలో నొకకృపాణము బయటపడెను. వాఁ డది గైకొని దానిం దెగటార్చెను.

అజాగళస్తనన్యాయము

మేక మెడక్రింది చన్నులు నిష్ప్రయోజనములు. కళా.1-7

అణుకులాచలన్యాయము

అణువునకు పర్వతమునకుఁ గల తారతమ్యము.

## అతిపరిచయన్యాయము

అతిపరిచయముచే నవజ్ఞ గలుగును.

'అతిపరిచయా దవజ్ఞా.' కు. చే. 1-105.

## అపరాహ్ణచ్ఛాయాన్యాయము

అపరాహ్ణము దాఁటినతరువాత మనుష్యునినీడ క్రమక్రమముగ నుత్తరోత్తర మభివృద్ధి నొందుచుఁ జిరకాలవ్యాపిని యవును. అట్లే ఉత్తరోత్తరాభివృద్ధి, చిరకాలవ్యాపకతల యం దీన్యాయ ముపయోగింపఁబడును.

## అపృచ్ఛోత్తరన్యాయము

అడుగకుండఁగనే ప్రత్యుత్తరము చెప్పుట.

## అప్రసక్తనిషేధన్యాయము

వెనుకటిగ్రంథమువలన జెప్పఁబడినధర్మము సంబంధము లేని స్థలమందుఁగూడఁ బ్రసక్తించినపుడు దానిని నిషేధించవలయునుగాని ప్రసక్తించనిది నిషేధించఁగూడదు.

ఎట్లనిన:—'ప్రాతఃకాలమునఁ బువ్వులు వికసించును.' అను వాక్యముచే సకలపుష్పములు వికసించుట చెప్పఁగాఁ గలువపువ్వులకుఁగూడ వికాసము ప్రసక్తించినది. కావునఁ గలువలు వికసించవని నిషేధించవలయును. ఇది ప్రసక్తనిషేధము అనఁబడును.

'చీఁకటి తెల్లఁగ నుండదు' ఇది యప్రసక్తనిషేధము.

అభావవిరక్తిన్యాయము

ఒకవిషయమై ప్రయత్నించి అది లభించనియప్పుడు 'దానితో మనకేమి ప్రయోజనము' అని విరక్తిజెందినయట్లభినయించుట.

'లోతున పడిపోయిన కాని గంగార్పణం.

అభ్రమయూరన్యాయము

మేఘమును జూచినచో నెమలికి సంతోషము.

అయస్కాంతసూచీన్యాయము

సూదంటురాయి సూదిని చటుక్కున నాకర్షించును.

అరణ్యరుదితన్యాయము

అడవిలో నేడ్చుచున్నవాని నాదరించి యోదార్చువారు లేరు.

అరణ్యరోదనము జైమినీ. 6-77.

అర్ధజరతీన్యాయము

శరీరమునందు కొంతభాగము వార్ధకమును, కొంతభాగము యౌవనమును గలిగియుండుట యసంభవము.

(ముఖలావణ్యమున యువతియు, స్తనపతనమున జరతియు ననుట యుపపన్నము గాదు.)

అర్థత్యాగసుఖన్యాయము

ధనము వ్యాపారముచేసిన సుఖము గలదనుట.

అలంకృతిశిరశ్ఛేదన్యాయము

ఒడలంతయు నలంకరించి తల తెగవేయుట.

అలాతపిశాచన్యాయము

కొఱవిని చూచి దయ్య మనుకొనునట్లు.

అలాబూపాషాణన్యాయము

రాతిలోఁ బుట్టిన సొరకాయ రాతినెరియ యెట్లుండునో యట్లె పెరుగును.

అవినాభావసంబంధన్యాయము

ఒకదానికొకటి సంబంధించి యుండుట.

(కుండయు, మట్టివలె; పూవు, తావివలె)

అవ్యాపారవ్యాపారన్యాయము

పనిలేనివాఁడు పనిగల్గినవానిని చెఱచుట.

(కూసేగాడిద మేసేగాడిదను చెఱచె నన్నట్లు)

అహికుండలన్యాయము

కుండలాకారముగా చుట్టలు చుట్టుకొనుట సర్పమునకు స్వాభావికధర్మ మయినట్లే మనుష్యునకుఁగల స్వాభావిక గుణము తదనుగుణముగ నవశ్యము ప్రవర్తించును.

అశ్మలోష్ఠన్యాయము

మంటిబెడ్డ దూదికంటె కఠినమే యైనను పాషాణము కంటె మెత్తనిదే.

అశ్వత్థపత్రన్యాయము

గాలి యున్నను లేకున్నను, రావియాకు కదలుచునే యుండును.

అక్ష్యండభేషజన్యాయము

కంటికి రాయు మందు బుడ్డకు రాచినట్లు.

ఆకాశభేదనన్యాయము

ఆకాశమును బ్రద్దలుచేయుటకు సాధన మేమియు లేదు.

ఆకాశముష్టిహననన్యాయము

ఆకాశమును పిడికిలితో గ్రుద్దుటకు వీలులేదు.

ఆదర్శన్యాయము

అద్దమువలె నిర్మలముగ నుండుట.

ఆదర్శగజన్యాయము

పెద్ద యేనుఁగు చిన్న యద్దములోఁ గానవచ్చును.

ఆదర్శమలిన్యాయము

అద్దమునకు మకిలి పట్టిన పోగొట్టుట సులభమే.

ఆమ్రవనన్యాయము

అనేక వృక్షజాతులుఁగల తోటలో కొన్ని మామిడిచెట్లున్నచో దానిని మామిడితోట యనునట్లు.

ఆమ్రసేకపితృతర్పణన్యాయము

మామిడిచెట్టు మొదటనే పితృతర్పణము చేసినచో చెట్టునకు నీళ్ళుపోసినట్లును, పితృతర్పణము చేసినట్లును అగును.

ఇక్షువికారన్యాయము

చెఱకుగడను గానుగలో నొక్కుటవలన రసమును, ఆరసమును సరియగు పాకమున వండుటవలన బెల్లము, ఆ బెల్లముద్వారా తదితర ఉత్తమోత్తమ మధురపదార్థములు తయారగును. అట్లే ఉత్తరోత్తర ముత్తమోత్తమ లాభప్రాప్తి నీన్యాయము సూచించును.

ఇక్షురసన్యాయము

మఱలలో పెట్టి గట్టిగ నొక్కినఁగాని చెఱకుగడనుండి రసము వెలికిరాదు.

(రోకళ్ళతో శక్తికొలఁది దంపినగాని బియ్యమురావుగదా!)

ఇషువేగక్షయన్యాయము

ధనుస్సునుండి విడువఁబడిన బాణముయొక్క వేగము లక్ష్యమువఱకు పోయిగాని క్షీణింపదు.

"ఇచ్ఛేష్యమాణసమభివ్యాహారే" అను న్యాయము

ఏదేని యొకయిచ్ఛ జనించుటకు ఆయిచ్ఛను కలిగించు వస్తువే కారణ మగును.

హేతు హేతుమద్భావప్రసక్తి నీన్యాయము సూచించును.

ఉత్ఖాతదంష్ట్రిభుజగన్యాయము

కోఱలుతీసినపాము పైకి భయంకరముగఁ గాన్పించుటయే కాని కఱువఁజాలదు.

ఉలూఖలమర్దలన్యాయము

ఱోలు వెళ్లి మద్దెలతో నన్ను అందఱును కొట్టెదరని మొఱ్ఱపెట్టుకొనగా నిన్నొకవైపుననే కొట్టెదరు; నన్ను రెండువైపులను కొట్టెదరని మద్దెల చెప్పినదట.

ఉలూఖలశేషన్యాయము

మొగమోటముగల యల్లుఁడు అత్తగారు పెట్టిన చలిమిడి తినక ఱోటిలో తల దూర్చి అందు మిగిలినది నాకినట్లు.

ఉష్ట్రకంటకభక్షణన్యాయము

లొట్టిపిట్ట ముండ్లకొమ్మలను నోటికి గ్రుచ్చుకొనకుండ భక్షించును.

ఉష్ట్రలగుడన్యాయము

ఒంటె తనచే మోయఁబడు కట్టెలచేతనే తాను దెబ్బలు తినును. మూర్ఖత నీన్యాయము సూచించును.

ఉష్ట్రశూలన్యాయము

ఒంటెకుఁ గలశూల రోకళ్ళతోఁగాని చక్కఁబడదు.
"చక్కఁగాదు లొట్టిపిటశూల రోకండ్లఁగాని"
నిరం. 2.133.

ఊషరబీజన్యాయము

చవిటినేలలో విత్తనములు చల్లినట్లు.

ఊషరవృష్టిన్యాయము

చవిటినేలను వర్షము కురిసినట్లు.

"ఋజుమార్గేణ సిధ్యతి" అను న్యాయము

తేలికగానగు పనిని కష్టముచేసికొనుట.

ఏకదేశవికృతన్యాయము

ఒకభాగమందు వికారము గలిగినను, అది మఱియొకటి కా దనునట్లు.

ఏకనాళఫలబాహుళ్యన్యాయము

ఒకేకాడను పెక్కుపండ్లు వ్రేలునట్లు.

కంటకన్యాయము

ముల్లుతీసికొనుటకు ముల్లే కావలయును.

"ఛలం ఛలేన వంచయేత్"

కంబళభోజనన్యాయము

గొంగళిలో భోజనముచేయుచు వెండ్రుక లేరినట్లు.

కజ్జలజలజన్యాయము

కాటుకయు నీళ్లును గలిసిన నీళ్లు నల్లబడవు, కాటుక కఱగదు.

కణజమూషకన్యాయము

గాదెక్రింది పందికొక్కు గాదెలోనే జీవించును.

కతకరేణున్యాయము

చిల్లగింజ అరుగఁదీసి బురదనీటిలోఁ గలిపిన ఆగంధము నీటిని బురదనుండి వేఱుపఱచి తా నదృశ్యమవును.

కదళీకంటకన్యాయము

ముల్లు అరటియాకుమీఁదఁ బడినను, అరటియాకు ముల్లు మీఁదఁ బడినను అరటియాకునకే మోసము.

కదళీకాకన్యాయము

కదళీవంధ్య, కాకవంధ్య.

ఒకమాఱుమాత్రమే ప్రసవించి మఱల గర్భములేని స్త్రీ 'కదళీవంధ్య' అనఁబడును.

కాకులు గ్రుడ్లుపెట్టుచునేయుండును. కాని కోయిల ఆ గ్రుడ్లను త్రోసివేసి తాను ఆగూటిలో గ్రుడ్లుపెట్టును. కాకిపెట్టినగ్రుడ్లు కాకికి మాత్రము దక్కక వెంటనే నశించిపోవును. అట్లే శిశువులు పుట్టుట, వెంటనే పోవుట కల ఆడుది 'కాకవంధ్య' అని చెప్పఁబడును.

కదంబముకుళన్యాయము

కడిమిచెట్టుపువ్వు లోకదానిలోనుండి మఱొకటి వరుసగ దండవలె నుండును.

కఫోణిగుడన్యాయము

వంచకులు మోచేతికి బెల్లము రాచికొని మాధుర్యాలోభమునఁ జవిగొనవచ్చిన యమాయకుల నొప్పింతురు.

కమఠీదుగ్ధపానన్యాయము

ఆఁడుకప్పను గుర్తించుట కష్టసాధ్యము. దానికి పాల

తిత్తులు, పాలు ఉండుట అసంభవము. ఆపాలు త్రాగుట అంతకన్న అసంభవము.

కరటదంతన్యాయము

కాకుల దంతములను పరీక్షింపఁ బూనుకొన్నట్లు.

'కాకదంతపరీక్ష' కళా. 3. 272.

కరతలామలకన్యాయము

చేతిలోని యుసిరికాయవలె (స్పష్టముగ) నున్నదన్నట్లు.

కరదీపికాన్యాయము

తన చేతిలోని దీపము తన కుపయోగించక యితరుల కుపయోగించునట్లు.

కరబదరన్యాయము

చేతిలోని రేగుపండువలె (తేలికగా) నున్న దన్నట్లు.

కరభదోహనన్యాయము

ఆవుండగా గాడిదను పాలు పితికినట్లు.

కరికపిత్థన్యాయము

ఏనుఁగు మింగిన వెలగపండు పైకి పండువలె నున్నను లోపలిగుంజంతయు హరించును.

హరివంశము. పూర్వ. 3 ఆ. 123 పే.

కరిణీప్రసవన్యాయము

సూకరసంతానము వంతున.

(పందికి పదిపిల్లలు పుట్టినను లాభము లేదు; ఏనుఁగ కొక పిల్ల పుట్టినను చాలును.)

కర్కటీగర్భన్యాయము

పీత పిల్లలు పుట్టినతోడనే చచ్చును.

భార. విరా. 1 ఆ. 322.

కాకతాళీయన్యాయము

కాకి వాలగానే అప్రయత్నముగా తాటిపండు పడినట్లు.

విక్ర. 4.61

కాకత్రోటిబింబన్యాయము

కాకిముక్కున దొండపండు గట్టినట్లు.

రుక్మి. 1.132.

కాకపికన్యాయము

కోవెల కాకులచేఁ బెంచఁబడినను కాకి కాకియే, కోవెల కోవెలయే.

(కాకః కాకః పికః పికః.)

కాకాక్షిగోలకన్యాయము

ఒంటికంటిచూపు గల కాకికి రెండు కన్నులు ఉండియేమి ప్రయోజనము ?

కాకరుతన్యాయము

పగలు కాకికూత విని జడిసి కాంతుని కౌఁగిలించుకొన్న కాంత రాత్రి నర్మదానదిని దాఁటి వెళ్లినదట.

"దివా కాకరుతా ద్భీతా రాత్రౌ తరతి నర్మదామ్"
భోజచరితమ్.

కాకాక్షిన్యాయము

కాకి యేప్రక్క చూచిన ఆప్రక్కనున్న కన్నే కనఁబడును గాని, ఒకసారిగ రెండు కన్నులును కనఁబడవు.

కాకదంతపరీక్షాన్యాయము

కాకికి దంతము లుండవు. కావున కాకికి దంతము లెన్ని యని పరీక్షింపఁబోవుట నగుబాటు.

కాచకుంభదీపన్యాయము

గాజుకుప్పెలోని దీపము ఎంతగాలివీచినను కదలదు. (వేమనశతకము)

కార్యకారణన్యాయము

కార్యమునుబట్టి కారణమును నిర్ధారణ చేసినట్లు.

కార్యార్థిన్యాయము

కార్యసిద్ధిఁ గోరువాఁడు గర్వపడరాదు.

కాశకుశావలంబనన్యాయము

దర్భ దొరకనిచో రెల్లే దర్భగా నుపయోగించుకొన్నట్లు. (ఏటఁబడి కొట్టుకొనిపోవువాఁడు దర్భపుడక దొరకినను పట్టుకొనును.)

కుంభదీపికాన్యాయము

కుండలోఁ బెట్టినదీపము పైకిఁ గాన్పించకున్నను లోపల వెలుగుచునే యుండును.

కులాలకీటన్యాయము

కుమ్మరిపురుగు మట్టిలో పొరలాడుచున్నను దానికి మట్టి యంటుకొనదు.

కుక్షిస్థమక్షికాన్యాయము

ఈఁగ చిన్నదైనను కడుపులోఁ జొచ్చి తిన్న యన్నమంతయు వెడలఁగ్రక్కించును.

'ఈఁగ కడుపుఁ జొచ్చి యిట్లు సేయదా'

వేమన.

కూపకూర్మన్యాయము

నూతిలో నున్న తాఁబేలు ఆనూయియే సమస్తప్రపంచమని భావించును.

కూపఖననన్యాయము

కొంప లంటుకొన్నతరువాత నూయి త్రవ్వ నారంభించినట్లు.

కూపమండూకన్యాయము

నూతిలోనున్న కప్ప ఆనూయియే సమస్తప్రపంచమని భావించును.

భీమే. I.13.

కూపయంత్రఘటికాన్యాయము

నూతిలోని నీరు చేదునపుడు యంత్రమునందలి ఘటిక మొకప్పు డూర్ధ్వగతియు నొకప్పు డధోగతియు నొందుచుండును.

కూర్మకిశోరన్యాయము

తాఁబేఁ లొకచో గ్రుడ్లుపెట్టి అటనుండి వెడలిపోవును. దానికి ఆగ్రుడ్లసంగతియే జ్ఞాపకములో నుండదు. ఆగ్రుడ్లును చెడిపోక అట్లే యుండును. హఠాత్తుగ ఎన్నఁడో దానికి గ్రుడ్లవిషయము స్ఫురణకు వచ్చును. వెంటనే ఆగ్రుడ్లు పిల్ల లగును.

ఈన్యాయము చాలవఱకు గురుశిష్యన్యాయమునకు సన్నిహితముగ నుండును.

కూర్మాంగన్యాయము

తాఁబేలు తన తల కాళ్లు చేతులు మున్నగు నవయవము లన్నియు తనకడుపులోనికి లాగికొని జాగ్రతపెట్టుకొనును.

కూశ్మాండస్తేయన్యాయము

గుమ్మడికాయలదొంగ లెవరనిన భుజములు తడవి చూచుకొన్నట్లు.

కృపణధనన్యాయము

లోభివానిధనము లోకులపాలు.

కేకరాక్షన్యాయము

మెల్లకంటివాఁ డొకవైపు చూచుచుండ వేఱొకవైపు చూచుచున్నట్లు కాన్పించును.

కేతకీకుః క్షున్యాయము

మొ(గ)పూవు సువాసనగలది యైనను, ముండ్లు గలిగి యుండుటచే కోసికొనుటకు శక్యముగాకుండును,

ఖండితశాఖాన్యాయము

కొమ్మ తెగగొట్టినను మరల చిగిర్చుచుండును.

ఖడ్గకోశన్యాయము

ఒఱచూచి కత్తి కలదని భయపడి పాఱిపోయినట్లు.

ఖరాశ్వన్యాయము

చూడగా చూడగా గుఱ్ఱము గాడిదయైనట్లు.

ఖర్వాపేక్షితఫలన్యాయము

పొట్టివాఁడు అందని ఫలములకు చేయి జాపినట్లు.

ఖలేకపోతన్యాయము

కళ్ళములోఁ బావురములు వ్రాలి గింజలు తినుచుండ, వానిని బట్టుకొనుటకై యొఱుకవాఁడు వలవేయఁగా అవ న్నియు నొక్కసారిగా లేచి వల యెత్తుకొని పోయినవి.

ఖల్వాటబిల్వీయన్యాయము

బట్టతలవాఁడు ఎండవేడిమికి తాళఁజాలక నీడకై మారేడు చెట్టుక్రిందికి రాఁగా కాయ తలపైఁబడి గాయము పడెను.

గగనకుసుమన్యాయము

ఆకాశమున పుష్పములు పూచినట్లు.

గగనరోమంథన్యాయము

ఆకాశమున ఆవులు నెమరవేసిన నురుగున్నట్లు.—

అసంభవమని తాత్పర్యము.

గజస్నానన్యాయము

ఏనుఁగు తాను మునుఁగుటకు వీలగునంత లోతుగల నదులు మున్నగువానిలోఁగాని స్నానముచేయును. కాని నదిలో నుండి యీవలకు వచ్చిన మఱునిముసముననే త్రోవలోని చెత్త, క్రుళ్ళుడు తొండెముతో పైన వైచికొనును. దుమ్ము పోసికొనును.

అట్లే ఏదేనికార్యము "చేసియు వ్యర్థమే" అనుట నీ న్యాయము తెలుపును.

భాస్కర. యుద్ధ. 138

గడ్డురికాన్యాయము

గడ్డులికా ప్రవాహన్యాయము

గొఱ్ఱెలమందలో నొకటి ప్రమాదముననైనఁ బ్రవాహమునఁ బడినచో, తక్కినవన్నియు నెంతవారించినను, ఆగక ఆ ప్రవాహములో దుముకును.

గతజల సతుబంధనన్యాయము

నీరు పోయినపిదప కట్ట వేసినట్లు.

భార. భీష్మ. 3. 84

గర్తజంబుకన్యాయము

గుంటనక్క చేష్టలు.

గర్ధభచందనన్యాయము

గాడిద గంధపుపొడి మోసినను, దానికి సువాసన తెలియును.

వేమన.

గర్ధభరోమగణనన్యాయము

గాడిదబొచ్చు లెక్కపెట్టుటవలన ప్రయోజనమేమి?

గలేపాదుకాన్యాయము

ఎవ్వరైన మెడలో చెప్పు కట్టుకొనునా ?
అసంబద్ధవర్ణనమని తాత్పర్యము.

గుంజాగ్నిన్యాయము

గురువిందను జూచి నిప్పు అనుకొనినట్లు.

గుడజిహ్వికాన్యాయము

బెల్లము నాలుకపై నున్నంతసేపే తీపి.

గుడోపలన్యాయము

బెల్లముగొట్టిన ఱాయివలె.

గురుశిష్యన్యాయము

యథార్థపుగురుశిష్యులు ఒకరినొకరు బాసియుండజాలరు. విధివశమున దూరంగతులైనను వారిమనస్సులుమాత్ర మత్యంతసన్నికృష్టములై యుండును.

గృహదీపికాన్యాయము

ఇంటిలో నొకచోట నున్నను దీప మిల్లంతయు ప్రకాశింపఁ జేయును.

గృహబద్ధకుమారీన్యాయము

ఇంటిలోఁ గట్టిపెట్టఁబడిన కలబంద పెరుగనూ పెరుగదు, చావనూ చావదు.

గృహమార్జాలన్యాయము

పిల్లి యింటిని కనిపెట్టుకొని యుండినను దానికి గౌరవము లేదు.

ఏనుఁగు బయటనున్నను దానికి గౌరవము కలదు.

గేహేశూరన్యాయము

ఇంటఁ గూర్చుండి డంబములు పలుకువాఁ డెంపులకును కొఱగాడు. (ఉత్తర కుమారప్రజ్ఞలు.)

గోపుచ్ఛన్యాయము

ఆవుతోక మొదట లావుగ నుండి క్రమముగ సన్నగిలి తుదను మొనదేలి యుండును.

గోబలీవర్దన్యాయము

గోశబ్దమునకు, ఆవులు ఎద్దులు గూడ నర్థము బలీవర్దశబ్దమున కెద్దు లర్థము. గోబలీవర్ద మనునపుడు బలీవర్దశబ్దముచ్చరించున గోశబ్దమునకు ఆవులే యర్థము చెప్పవలయు ననుట.

గోమయపాయసీయన్యాయము

పేడ పరమాన్నమగునా? గోవువలన గలిగినదగుటఁ బాయసమును గోమయమన నవునా?

గోమహిష్యాదిన్యాయము

ఆవులూ పాలిచ్చును; బఱ్ఱెలు, గొఱ్ఱెలూ పాలిచ్చును.

గోముఖవ్యాఘ్రన్యాయము

ఆవుముఖముగల పులిని ఆవు అనుకొని యితరమృగములు చెంతకురాఁగా పులి వానిని మ్రింగివేయును.
కళా. 6.267.

గోవత్సన్యాయము

ఆవు నమ్మినప్పుడు దూడకు వేఱే వెల లేదు.

గోక్షీరన్యాయము

గేదెపాలైనను ఆవుపాలు కొంచెము కలిసినచో పవిత్ర మగును.

గ్రామదూరన్యాయము

ఈయూరి కాయూరు ఎంత దూరమో ఆయూరి కీయూరు నంతే దూరము.

ఘటీయంత్రన్యాయము

ఏతము తనపని యగునంతవఱకును వంగియుండి కాఁగానే మీఁదికి నిక్కును.

ఘట్టకుటీప్రభాతన్యాయము

ఒకవర్తకుఁ డొకపట్టణము చేరి తనవ్యవహారము చేసికొని పోవునప్పుడు ఆపట్టణములో ఘాటీపాకదగ్గఱనుండి పోయినచో సుంక మీయవలసివచ్చునని యర్ధరాత్రివేళ మాఱుత్రోవను బోవలయు నను తలంపుతో నాపట్టణము లోని సందు గొందులు తిరిగి త్రోవగానక తుదకు ఘాటీ

పాకకడకు వచ్చుసరికి తెల్లవారెను. అతని కాయాస పడుటయు, సుంక మీయకుండ తప్పించుకొనలేకుండు టయుఁగూడ సంభవించెను.

కళా 6.248. చంద్రికా. 4.107. నైష. 4.75.

ఘరట్టన్యాయము

తిరుగలిదిమ్మలలో నొకటి తిరుగునది, ఒకటి తిరుగనిదియు. రెండు నుండు టవసరమే. కేవల మొక తిరుగుదానితోనే లేక తిరుగనిదానితోనే పని నెఱవేఱదు.

ఘుణాక్షరన్యాయము

ఒకపురుగు ఒకకట్టను దొలువఁగాఁ దొలువఁగా నది యొకానొకప్పుడు అక్షరాకారముగ నేర్పడవచ్చును. అది యప్రయత్నముగ నేర్పడినదికాని పురుగుయొక్క ప్రయత్న ముచేఁ గాదనుట.

విక్ర. 1.17.

ఘృతకోశాతకీన్యాయము

నేతిబీరకాయ యని పేరేగాని యందు నేయి యుండదు సరికదా చప్పగగూడ నుండును.

పాండు. 2.13.

(ఇంటిపేరు కస్తూరివారు; ఇంటిలో గబ్బిలాలకంపు.)

ఘోటకబ్రహ్మచర్యన్యాయము

సాధారణముగ గుఱ్ఱములను యజమానులు ఆడుగుఱ్ఱము లతోఁ గలియనీయరు. పైపెచ్చు వాని అవయవములను

త్రాటితో బిగించియుంతురు. కాని అవి తెలుచుగ తమ అవయవములను త్రేలవైచియే యుండును. ప్రమాదవశమున త్రాడు త్రెంపుకొని యీవలంబడినచో నవి ఆడు గాడిదలనుకూడ రూపులేకుండ చేయును. అట్టిది ఈబ్రహ్మచర్యము.

చండాలబ్రాహ్మణన్యాయము

స్వధర్మభ్రష్టుఁడయిన బ్రాహ్మణుడు చండాలునితో సమానుఁ డగును. కాని చండాలుడుమాత్రము కాఁడు. చండాలుఁ డెట్టి స్థితియందును బ్రాహ్మణుఁడు కాడు; బ్రాహ్మణ సమానుఁడు కాఁడు.

చంద్రచకోరన్యాయము

చంద్రునిరాఁకకు చకోరాలు వేచియున్నట్లు.

చంద్రచంద్రికాన్యాయము

చంద్రునితో బాటు వెన్నెల.
అవినాభావసంబంధము.

చక్రభ్రమిన్యాయము

చక్రము తిరుగుచున్నప్పుడు మీఁదియంచు క్రిందికి, క్రింది యంచు మీఁదికి వచ్చుచుండును.

చక్షుశ్శ్రవణన్యాయము

పామునకు వినుచున్నపుడు చూచుటయు, చూచుచున్న పుడు వినుటయు నుండదు.

చర్వితచర్వణన్యాయము

నమలినదే మఱల నమలినట్లు.

చాతకీజీమూతన్యాయము

ఎల్లెడ జలము లభించినను చాతకపక్షికి దప్పి మేఘము నుండిపడిన నీటిబిందువులచేఁగాని తీరదు.

ఇతరసుఖము లెన్నియున్నను తనకోర్కె నెఱవేర్చుదానితో సాటికావు.

చాలనీన్యాయము

జల్లెడలోఁ బోసి జల్లించినట్లు.

చిత్రపటన్యాయము

ముందు రేఖలు గీచి పిదప బొమ్మను వ్రాసినట్లు.

చిత్రాంగనాన్యాయము

చిత్రపటములోని అందకత్తెను జూచి సంతసించినను కౌఁగి లించుకొనరు.

(జ్ఞాని నిషిద్ధక్రియాచరణమునకుఁ గడంగినను తత్ఫలభోగి మాత్రము కాఁడు.)

చిత్రానలన్యాయము

బొమ్మలేని నిప్పువలె.

పేరునకుమాత్ర మగ్నియే యైనను దాహకత్వాదిగుణ శూన్యమవుటచే నయ్యది నిరర్థకము.

చిత్రామృతన్యాయము

బొమ్మలోని అమృతమువలె.

అనుభవింప యోగ్యముకానిది అని భావము.

చోరాపహార్యన్యాయము

దొంగయు, దొంగిలింపబడినవాఁడును పరస్పరముభిన్నులు.

ఉదా:— జీవేశ్వరులు.

చిత్రితాంగజంబుకన్యాయము

పులిని జూచి నక్క వాతలు పెట్టుకొన్నట్లు.

ఛత్రిన్యాయము

ఒకమనుష్యుని యానవాలు చెప్పుటకు దుస్తులు మున్నగునవి యనేకములుండఁగా గొడుగు పట్టుకొనివెళ్ళువాఁడు అని చెప్పినట్లు.

ఛాగపశున్యాయము

సామాన్యముగ పశుశబ్దమునకు వృషభాదులు అని యర్థమున్నను వేదమం దొకానొకచో మేక యని యర్థము కాన వచ్చుటచే యజ్ఞములయందు పశుశబ్దమునకు మేక యనునర్థమే వర్తించుచున్నది.

ఛురికాకూశ్మాండన్యాయము

కడవెడు గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ.

జంబుకారగ్వధన్యాయము

నక్క రేలకాయలు తిని కడుపునొప్పి యెత్తినందున, ఇంక నెన్నడు రేలకాయలఁ దినరా దనుకొని కడుపునొప్పి పోఁగానే మఱల రేలకాయలఁ దినుటకై వెళ్ళినదఁట.

జతుకాష్ఠన్యాయము

లక్కపుల్ల యొక్కడ విఱిచిన నక్కడ విఱిగి, మఱల నతికిన నతుకుకొని విఱిచిన విఱుగునట్లు.

జపాస్ఫటికన్యాయము

మంకెనపువ్వు స్ఫటికముచెంత నుంచిన స్ఫటికమంతయు నెఱ్ఱబడిపోవును.

జలచంద్రన్యాయము

చంద్రుఁ డొకఁడే అయ్యు వేలువేలుపాత్రలలో ప్రతిబింబించి అనేకచంద్రులుగ భాసించును.
ఆత్మపదార్థ మొక్కటియే. కాని అది శరీరశతాంతర్వర్తియై అనేకత్వమున భాసించును.

జలతరంగన్యాయము

నీరూ, కెరటములవలె.
గాలివలన నీరే కెరటములుగ మాఱును. కెరటములకును మాధుర్యత్వాదిజలధర్మము లన్నియు నుండును.
అట్లే అవ్యక్తనిర్గుణపరబ్రహ్మము ప్రపంచరూపమునఁ బరిణమించినను ప్రపంచమునకు బ్రహ్మగుణధర్మములు సంక్రమించును.

జలతాడనన్యాయము

నీటిని కఱ్ఱతోఁ గొట్టినను దెబ్బతగులదు; లొట్టపడదు. ఊషరవృష్టివలె నిష్ప్రయోజనము అనిభావము.

జలతుంబికాన్యాయము

సొరకాయబుఱ్ఱను మట్టితో నింపి జలమున వైచిన అది మునిఁగిపోవును. ఆమట్టి నీటఁ గఱగిపోయిన సొరకాయ బుఱ్ఱ పైకి తేలును.

(దేహసంబంధ మున్నంతవఱకు జీవాత్మ భూలోకమున నుండును; దేహసంబంధము నశించినయపు డాకాశమున కుఁ బోవును.)

జలతైలబిందున్యాయము

నీటిపై వేసిన నూనెచుక్క నీరంతటను వ్యాపించును. కాని దానికి నీరు అంటదు.

జలబిందునిపాతన్యాయము

ఒక్కొక్కనీటిబొట్టు పడి క్రమముగ కుండ అంతయునిండును.

జలమథనన్యాయము

నీటిని తఱచినట్లు.

పాలు మథించిన వెన్నవచ్చును. నీటిని మథించిన వచ్చునది నడుమునొప్పియే. గొడ్డురాలివద్ద పాలు గుడిచినట్లు వ్యర్థమని భావము.

జలమౌక్తికన్యాయము

ముత్యపుచిప్పలోనినీరు ఒకప్పుడు ముత్యము లవును. సమయము వచ్చిన అల్పుడుగూడ దొడ్డవాఁ డవును.

జలాగ్నిన్యాయము

అగ్నియు జలమును కలియునప్పుడు వానిలో నేది తక్కువ యైన నది హరించిపోవును.

జలానయనన్యాయము

నీరు తెమ్మనిన, పాత్రలోఁ బోసికొని తెమ్ము అని వేఱె చెప్పవలెనా ?

జలేతరంగబుద్బుదన్యాయము

తరంగములు, బుడగలు నీటిలోనే పుట్టి నీటిలోనే లీన మైనట్లు.

జలూకాన్యాయము

జలగను స్త్రీ స్తనములపై వైచిన అది పాలను మాని రక్తమే పీల్చును.

మక్షికాన్యాయమును చూడుము.

జలౌష్ణ్యన్యాయము

జలము స్వభావముగా శీతలమే అయినను కాఁగబెట్టినచో వేడినీరు అని వ్యవహరింపఁబడును.

(దొంగతో దిరిగిన ధొరకూడా దొంగగా భావించఁబడును)

### జహత్స్వార్థావృత్తిన్యాయము

శబ్దము స్వార్థమును విడచి అన్యార్థమును బోధించుట. (గంగలో గొల్లపల్లె అనిన గంగఒడ్డున గొల్లపల్లె అని అర్థము.)

### జహదజహత్స్వార్థావృత్తిన్యాయము

తొలుత శబ్దమునకు వచింపఁబడిన అన్యార్థము, స్వాభావికముగ ఆశబ్దమునకుఁ గలయర్థము ఒకటియే అనిచెప్పుట. "వాఁడే వీఁడు" మాదిరి.

### జాలమత్స్యన్యాయము

వలలోఁ జిక్కిన చేప వలలోనుండి సర్వముం జూచుచుండును. కాని, బయటికి రానేలదు.

### టిట్టిభన్యాయము

సముద్రపుటొడ్డున పెట్టిన తనగ్రుడ్లను సముద్రుఁడు తరంగముల ద్వారా అపహరించుటచే కోపించి ఒకతిత్తిరిపక్షి ఱెక్కలు తడిపి ఆనీటిని వెలుపల విదలించియు, త్రాగివేసియు సముద్రము నింకింపసాగెను. అందులకు సముద్రుడు భయపడి ఆపక్షిగ్రుడ్లను బహుమానపురస్సరముగ మఱల సమర్పించి ధన్యుఁడయ్యెను.

### తండులభక్షణన్యాయము

వండలోలేక బియ్యమే బొక్కినట్లు.

తంతున్యాయము

నూలుపోగులు అన్నీ ఒకచోటఁజేరి వస్త్రముగాఁ దయారయినట్లు.

తత్ప్రిఖ్యాన్యాయము

"అగ్నిహోత్రమును వేల్చవలెను" అనిన "ఏమి వేల్చవలెను" అను ప్రశ్న రాఁగా "హవిస్సును" అని అగ్నిహోత్రశబ్దమువలననే తెలియుచున్నది.

తటాకపరివాహన్యాయము

చెఱువునీరు తూముగుండా కొంచెము విడువనియెడల గట్టు తెగి నీరంతయు పోవును.

తప్తతైలాంబున్యాయము

కాగిననూనెపై నీళ్ళు చల్లిన భగ్గున మండును.

తప్తపరశుగ్రహణన్యాయము

క్రమక్రమముగ వేడివస్తువులను పట్టుకొనుట అలవాటు చేసిన చివఱకు కాలుచూఉన్న ఇనుపగొడ్డలినికూడ పట్టుకొనవచ్చును. (అభ్యాసం కూసువిద్య)

తప్తభ్రాష్ట్రతిలన్యాయము

కాలినమూకుడులో నువ్వులు వేసినట్లు.

ఆనూవులు వెంటనే వ్రేలి పై కెగురును.

దుఃఖము ఆపుకోలేనివారును ఇంతే.

తప్తమాషికోద్ధరణన్యాయము

కాగేనూనెలో పడి చచ్చిన ఈఁగను నేర్పుగా వ్రేలితో తీసివేయవచ్చును.

(అభ్యాసమువలన కలుగు ఫలితములు.)

తప్తాయఃపిండన్యాయము

కాలిన ఇనుపగుండునకు పొగ యుండదుగాని, తక్కిన యగ్నిలక్షణము లన్నియు నుండును.

తప్తాయసపత్రబిందున్యాయము

కాలిన ఇనుపరేకుపై జలబిందువు పడినయెడల నామరూపములు లేక నశించును.

తమోదీపన్యాయము

దీప మున్నచోఁ జీఁకటి యుండదు.

తమఃప్రకాశన్యాయము

చీఁకటిని వెలుతురు అణచివేయును.

తరక్షుధాకినీన్యాయము

పెద్దపులి నెక్కి మహాకాళి వచ్చినట్లు.

తరంగన్యాయము

అలలు ఒకదానివెనుక నొకటి విడువక వచ్చుచుండును.

తరంగప్రతిబింబన్యాయము

తరంగములయందు ప్రతిబింబించు సూర్యుఁ డొక్కఁడే యైనను వానియందు పెక్కులై కానిపించును.

తక్రకౌండిన్యన్యాయము

"బ్రాహ్మణుల కందఱకుఁ బెరుగు వడ్డింపుఁడు. కౌండిన్యునకుమాత్రము చల్లపోయుఁడు" అని చెప్పినప్పుడు కౌండిన్యుఁడును బ్రాహ్మణుఁడే యగుటచే పెరుగు పోయవలసి యున్నను ప్రత్యేకముగా పేర్కొనఁబడుటచే నాతనికి మజ్జిగయే వడ్డింతురు. అట్లే—
విశేషవిధులు సామాన్యవిధులను బాధించును.

తాలసర్పన్యాయము

తాడిచెట్టుపై ప్రాఁకుపాము ఇతరులు చంపవలసిన అవసరము లేకయే ఒడలు చీరుకుపోయి తనంతనతానే చచ్చును.

తాళాధిరోహణన్యాయము

తాడిచెట్టెక్కువాని నెందాక నెగఁద్రోయుదురు ?

తిలతండులన్యాయము

నువ్వులు బియ్యము కలిసిన విడదీయుట సులభము.
నువ్వులు, బియ్యము కలిసిన నడుమ నడుమ నల్లగాను, తెల్లగాను నుండును.

"పుడమి తిలతండులన్యాయమున వెలుంగ."

మనుచరిత్రము 2. 7.

తీరబకన్యాయము

ఒడ్డున కొంగ జపముచేయుచున్నట్లే ఉండి చేప చేరువకు రాఁగానే మ్రింగును.

తీర్థకాకన్యాయము

కాకి తీర్థములలో మునిఁగినను ఫలము గాంచనేఱదు.

తుంబీవికలవీణాన్యాయము

తుంబకాయబుఱ్ఱ లేనిదే వీణ పాడదు.

తులాదండన్యాయము

త్రాసుయొక్క దండము బరువుగా నున్నవైపు క్రిందికిని, తేలికగానున్నవైపు మీఁదికిని బోవును.

తులోన్నమనన్యాయము

ఒకవైపున వ్రేలితో ఎత్తిన త్రాసు అప్రయత్నముగ ఒక వైపు పైకిని, మఱొకవైపు క్రిందికిని పోవును.

తుల్యబలప్రేషణన్యాయము

సమానమైనబలముగలవా రొకరి నొకరు తమపనులయందు నియోగించుకొందురు.

తుల్యాయవ్యయన్యాయము

ఆయమునకుఁ దగిన వ్యయము.

తుషాఘాతన్యాయము

ఊకదంపుడు.

దీనినే 'తుషఖండనన్యాయము' అనియు నందురు.

తుష్యతు దుర్జనన్యాయము

తనకార్యములచే దుష్టుఁడు ప్రస్తుతము సంతోషము నొందుఁగాక; అదనునఁ దత్ఫల మనుభవింపకపోఁడు.

తృణజలూకాన్యాయము

గడ్డిపురుగునకు ముూఁడు ప్రక్కను రెండు కాళ్ళును, వెనుక ప్రక్క రెండుకాళ్ళు నుండును. అవి వెనుకకాళ్ళతో నిలఁబడి ముందు నిలుచుట కాధారము చూచుకొని ముందటికాళ్ళ నక్కడఁ బెట్టి పిదప వెనుకకాళ్ళు తీయును

తృణరజ్జున్యాయము

గడ్డిపోచలు వెంటిగా నేర్పడి మదగజమునైన బంధించును

తృణాగ్నిన్యాయము

చితుకులనిప్పు (క్షణములో నశించును.)

తృణారణిమణిన్యాయము

గడ్డివలనఁ గలిగిన నిప్పు గడ్డినిప్పు అవును; అరణియందు మథింపఁబడిననిప్పు పవిత్రమయిన హోమాగ్ని అవును సూర్యకాంతమణియందుఁ బుట్టినజ్వాల మణిజ్వాల అవును

తేజస్తిమిరన్యాయము

వెలుతురున్నచోట చీఁకటి యుండదు.

దండచక్రన్యాయము

కుమ్మరిచేసే కుండకు వానిచేతిలోనికఱ్ఱ, సారె, నీళ్లు మొదలగునవి కారణము లవును.

దండసర్పమారణన్యాయము

సర్పమును చంపుటకు కఱ్ఱ చాలి ఉండఁగా గొడ్డలితో బయలుదేరినట్లు.

దండాపూపన్యాయము

బూరెలమూట కట్టిన కఱ్ఱను ఎలుక కొఱికినదన; బూరెలు కూడా కొఱికి తినినదని వేఱె చెప్పవలెనా?

(ఇది ఇంచుమించు కైముత్యన్యాయమును బోలును.)

దండాభావన్యాయము

కఱ్ఱలేనివానిగొఱ్ఱె కఱచినరీతి.

దగ్ధపటన్యాయము

మడతబెట్టిన బట్ట కాలిపోయినపుడు మడతలు మడతలుగాను, పోగులయల్లిక యల్లికగాను కాన్పించును. కాని చేతులతో ముట్టిన విడిపోవును.

(యథార్థము నెఱింగినవెనువెంటన భ్రాన్తి దూరమవును.) చెన్న బ. 3.391.

దగ్ధపదమార్జాలన్యాయము

నలుగురు దూదివర్తకులు ఒకపిల్లిని తెచ్చి దానినాలుగు కాళ్ళకు నలుగురును గజ్జెలుకట్టి పెంచుచుండ దాని యొక కాలికి దెబ్బ తగిలెను. ఆకాలుగలవాఁడు ఆగాయమును మాన్పుటకై చమురుగుడ్డ లాకాలికి చుట్టెను. అది దీపము తగిలి యంటుకొనెను. అంతట నాపిల్లి బాధకుఁ దాళఁజాలక దూదిమూటలపైఁ బరుగెత్తెను. దూదియంతయుఁ దగులఁబడెను. తక్కిన ముగ్గురు వర్తకులు ఆదూది దండుగ పిల్లికాలికి గుడ్డచుట్టినవాఁ డీయవలసినదని ధర్మాధి

కాలితోఁ జెప్పుకొనిరి. గాయము తగిలిన కాలితో పిల్లి నడువలేక తక్కిన మూఁడు కాళ్ళతోనే నడచినందున ఆమూఁడుకాళ్ళుగలవారును ఆనష్టము నాలవవానికి సీయ వలసినదని ధర్మాధికారి తీర్పుచెప్పెను.

దగ్ధపత్రన్యాయము

ఆకును కాల్చిన నది మసియగును. కాని, తన ఆకారమును మాత్రము విడువదు (రూపాయలనోటును కాల్చినట్లు. అది కాలినను దాని ఆకారము, అక్షరములు, నంబరు ఉన్నట్లే యుండును.) దానిని చూచిన యథార్థపుటాకు కాదని మాత్రము మనము తెలిసికొందుము. (స్వప్నస్త్రీ అని తెలిసికొనినమీఁదట కామము పొందనట్లు.)

దగ్ధబీజన్యాయము

విత్తు కాలిన మొలకెత్తదు.
(రాగము నశించిన సంసారబంధమే లేదు.)

దగ్ధరశనాన్యాయము

ముప్పిరిగా పేనఁబడి కాల్చఁబడినత్రాఁడువలె.
(పైన్యాయములట్లే.)

దగ్ధేంధనవహ్నిన్యాయము

వంటకట్టెలు వంటచేయుటకు తోడ్పడి తాముమాత్రము కాలిపోవును.
(తమనష్టముసైతము పాటింపక సజ్జనులు ఇతరులకు సాయ పడుదురు.)

దత్తతిలాంజలిన్యాయము

నువ్వులూ, నీళ్ళూ విడచుట. (ఆశవదలుకొనుట)

దధివ్రీహిన్యాయము

పెరుగూ, వడ్లు కలిసినట్లు.

జైమిని. 8. 213.

దర్పణప్రతిబింబన్యాయము

అద్దములోని ప్రతిబింబమువలె.

దర్పణముఖావలోకనన్యాయము

ముఖ మెటు లుండునో అట్లే అద్దములోనూ కాన్పించును. (ఉన్నదున్నట్లుచెప్పుట.)

దర్వీహోమన్యాయము

తెడ్డుతో చేసిన హోమమువలె.

దర్వీపాకరసన్యాయము

గరిటె పచనపదార్థము లన్నిటిలో మెలఁగుచున్నను వాని రుచి గ్రహింపఁజాలదు.

"తెడ్డునకు వచ్చునె పాకగుణాగుణావళుల్" పాండు.

"అడ్డావిడ్డముతిరిగే తెడ్డెఱుఁగునె పాలతీపి".

వేమన.

దశానామేకదశన్యాయము

పదిలో పదునొకండు.

ఏదైన కొంతధనము వ్యయము చేయవలసివచ్చినప్పుడు ఇంకొకకొంచెము వ్యయమునకు వెనుదీయరాదు.

దామవ్యాలకటన్యాయము

ఒకప్పుడు తనకు చేదోడుగా నుండుటకై శంబరాసురుఁడు దాముఁడు, వ్యాలుఁడు, కటుఁడు అను ముగ్గురురాక్షసులను తనమాయచే సృజించెను. వారు ఒకే గ్రుద్దుకు పదికొండలు పిండిచేయఁగల బలము గలిగియుండెడువారు. కాని, ఆబలమును ఉపయోగించుట తెలియక వారు రానురాను బలహీనులై చివరకు దోమలై పుట్టిరి.

(అజ్ఞునికి ఉచ్చదశ వచ్చినా అధోగతికే మూల మవును.)

దారుపురుషన్యాయము

కఱ్ఱబొమ్మను జూచి మనుష్యుఁడని భ్రమించినట్లు.

దాహకదాహన్యాయము

మంటలేనిఅగ్ని కట్టెలతోఁ గలిసి తానుకూడా ఆకట్టెల ఆకారమునే పొందును.

దివాతనచంద్రన్యాయము

పగటిచంద్రునివలె.

శోభ తఱిగి యుండుట అనిభావము.

దివాంధన్యాయము

అందఱకు నిష్టముగనుండు పగలు గ్రుడ్లగూబకు అనిష్ట ముగ నుండును.

దీపకలికాన్యాయము

చిన్నదీపము చీఁకటి అంతయు మ్రింగివైచినట్లు.

దుర్జనగర్దభన్యాయము

దుర్జనునకు గాడిదకు భేదము లేదు.

గాడిద ఎంతకొట్టినను తనస్వభావమును విడువదు; మంచి చోటును దొర్లి పాడుచేయును. దుర్జనుఁడును అంతే. సజ్జనుల యశమును పాడుచేయును.

దుర్జనమశకన్యాయము

దుర్జనుఁడు దోమను బోలినవాఁడు.

"కానరాక డాగ; రానీక చెంతకుఁ
దోలి తోలి కొట్టఁ; గూలనడఁచ
సందు లెమకి యెటులో సాధించు బాధించు
దోమ యార! తులువ రామకృష్ణ!"

వ్యాఖ్యాతల రామకృష్ణశతకమునుండి.

దూరగిరిన్యాయము

దూరపుకొండలు నునుపు. దగ్గఱకుఁ బోయినఁ జెట్లుగుట్టలును.

దూర్వామూలన్యాయము

గరికవేరు భూమిలో నుండీ యుండి చినుకు పడగానే చిగుర్చును. కాని యెన్నటికిని జావదు.

దృష్టిసృష్టిన్యాయము

బ్రహ్మ జాగ్రదవస్థలో ప్రపంచమును సృష్టించును; సుషుప్త్యవస్థలో తనచే సృజింపఁబడిన ప్రపంచమును తన యందు లీనము చేసికొనును.

దేవతాధికరణన్యాయము

ఏదేని ప్రతిమయం దిష్టదైవము నావాహనముచేసి పూజించి అభీష్టములను పొందుట.

దేవదత్తపుత్రన్యాయము

దేవదత్తునిపుత్త్రుఁడు దేవదత్తునిభార్యకును బుత్త్రుఁడే.

దేవదత్తహంతృహతన్యాయము

దేవదత్తుని జంపినవానిఁ జంపిన దేవదత్తుఁడు బ్రతుకునా ?

దేవదత్తహననోద్యతహతన్యాయము

దేవదత్తునిఁ జంపఁ బ్రయత్నించినవాఁడు చనిపోయిన దేవదత్తుఁడు బ్రతికియేయుండునుగదా।

దేహకేశన్యాయము

దేహమునుండియే వెండ్రుకలు పుట్టును.

దేహళీదీపన్యాయము

గడపమీఁద దీపము పెట్టిన నింటిలోను బైటనూ గూడ నుపయోగించును.

“ ఏకా క్రియా ద్వ్యర్థకరీ ”

దేహాధోముఖత్వన్యాయము

పాంచభౌతికమవు దేహము నాశ్రయించి ఆత్మ అధోముఖ గతిని పొందును; దేహసంబంధము పోయినయంతన ఊర్ధ్వముఖగతి నొందును.

ద్రవిడప్రాణాయామన్యాయము

ద్రవిడులు ప్రాణాయామము చేయునపుడు చేతితో తల చుట్టి ముక్కు పట్టుకొందురంట.

అనగా తేలికపనిని కష్టతరముగా చేసికొనుట.

ధనంజయన్యాయము

కౌరవకులనాశమునకు మూలము కృష్ణుడే అయినా, ఆపేరు అర్జునునికి వచ్చినట్లు.

ధనుర్గుణన్యాయము

విల్లు వంకరగానుండునదియైనను విలుకాండ్రు దానికే అల్లెత్రాడు దగిలించి బాణప్రయోగ మొనర్తురు.

ధర్మాధర్మాత్మకన్యాయము

ప్రపంచములో ధర్మాధర్మములు రెండు నుండును.

ధాన్యపలాలన్యాయము

కళ్ళమునుండి మొట్టమొదట ధాన్యమే జాగ్రత్తగ ఇంటికిం జేర్చి దంపి బియ్యమును గ్రహించి ఊక మొదలగునవి త్యజించివైచునట్లు.

నటాంగనాన్యాయము

ఆశువేషము వేసినస్త్రీ ఆయాసహచరుల కందఱికిని భార్య అయినట్లు

(ఆకాశముమీద నెగురు విమానము ఎవరిమట్టుకు వారి నెత్తికి సూటిగనే ఉన్నట్లు కన్పడును.)

నదీసముద్రన్యాయము

నదులన్నియు సముద్రములోనే కలియును

"నదీనాం సాగరో గతిః" అనునట్లు.

నదులన్నియు సముద్రములో కలిసి సముద్రరూపమేయైనను నదియు సముద్రమును పరస్పరము భిన్నములే.

ఉదా:—జీవేశ్వరులు.

నదులు సముద్రములో కలిసి తమనామరూపములే లేకుండ పోవును

ఉదా:—అఖండపరబ్రహ్మమందు జీవేశ్వరులట్లు.

నద్యంబువేగన్యాయము

నదులు తీవ్రగతితో ప్రవహించి సముద్రములో కలిసి పోవునట్లు.

నష్టాశ్వదగ్ధరథన్యాయము

యుద్ధములో నొకనికి గుఱ్ఱము చచ్చెను. ఇంకొకనికి రథము కాలిపోయెను. ఇరువురును గలిసినచో రథికులయ్యెద రనునట్లు.

నసిప్రోతబలీవర్దన్యాయము

ఎద్దుకు ముకుద్రాళ్ళు కట్టినట్లు.

నాంతరీయకన్యాయము

వలసినయంతవఱకే అర్థము గ్రహింపవలెను.
(వడ్లు దంపి తినుటకు బియ్యమే గ్రహించినట్లు.)

నానావృక్షరసన్యాయము

అనేకవృక్షములలో నుండు రస మావృక్షములకంటె భిన్నమైయుండును.

నారికేళతృణన్యాయము

కొబ్బరిచెట్టు నొంపుల కెక్కుదవనిన దూడ గడ్డికొఱకు అనినట్లు.

నారికేళాంబున్యాయము

కొబ్బరికాయలోనికి నీ రెట్లు వచ్చినదో ఎవరికినీ దెలియదు.
"సిరితా వచ్చిన వచ్చును
సరభసముగ నారికేళ సలిలముభంగిన్"

సుమతిశతకము

నాసికాంగుళీన్యాయము

ఎవరిముక్కురంధ్రములో వారివ్రే ళ్లైనఁ బట్టును.

నాసిప్రోతోష్ట్రిన్యాయము

ముకుద్రాడువైచిన ఒంటె మాదిరి.
నసిప్రోతబలీవర్దన్యాయము మాదిరి.

నిమ్నగాప్రవాహన్యాయము

పటిలో కొట్టుకొనిపోవు చీమలు మొదలగునవి ఒకసుడిలో నుండి తప్పించుకొనినను వెంటనే వేఱొకసుడిలో పడును.

నిర్ధనమనోరథన్యాయము

దరిద్రునకు కోరిక లెక్కువ.

"ఉత్పద్యన్తే విలీయన్తే దరిద్రాణాం మనోరథాః
బాలవైధవ్యదగ్ధానాం కులస్త్రీణాం కుచావివ".

నిర్వ్యాపారాంబష్టన్యాయము

పనిలేనిమంగలి పిల్లితల గొఱిగి నట్లు.

నివాతస్థదీపన్యాయము

గాలిలేనిచోట (అచంచలముగ) నున్న దీపమువలె.

" నివాతస్థో యథా దీపః " భగవద్గీత.

నిషాదస్థపతిన్యాయము

నిషాదుని రాజుగా నియమించినట్లు.

నీరనీరన్యాయము

నీరును నీరును గలిసిన విడఁదీయుట అసంభవము.

నీరక్షీరన్యాయము

నీరు, పాలు కలిసిన గుర్తించుట కష్టతరము.

నీలేందీవరన్యాయము

ఇందీవరమన నల్లకలువ. అయినను నీలేందీవర మందురు.

అపుసును నల్లకలువ అనియే అర్థము.

(దారిమార్గము, కిరసనాయిఁగునూనె, మున్నగునవివలె.)

నృపనాపితపుత్రన్యాయము

రాజు, మంగలివానికొడుకు వలె.

క్షౌరము చేయించికొనుచు ఒకరాజు మంగలివానితో 'ఒరీ! ఊరిలో తిరిగి ఎచటనైన ఒక చక్కని పిల్లవానిని చూచి తీసికొనిరమ్ము' అనెను. అట్లే మంగలి ఊరంతయుఁ దిరిగెను. కాని చక్కని పిల్లవాఁడు కనఁబడలేదు. విసివి తుదకు వాఁడు అష్టావక్రునివలె నున్నను తన కుమారుని చూచి 'ఆహా! వీఁడెంతఅందగాఁడు!' అని మురియుచు రాజువద్దకుఁ గొనిపోయి "రాజా! చూడుము, చాలకష్టపడి కొనివచ్చితిని" అనెను. ఆపిల్లవానిని చూడఁగనే మంగలి తనను ఎగతాళిచేయుచున్నాఁడని రాజున కొడలు తెలియని కోపము వచ్చెను. 'ఒరీ! వీఁడెవఁడురా?' అని రాజు ప్రశ్నించెను. 'వీఁడా!' నాకొడుకేనండీ' అని మంగలి చెప్పెను. రాజు 'ఎవరి కొడుకులు వారికి అంత అందముగా కనిపించుట లోక ధర్మము' అని శాంతి వహించి వానిని పంపివేసెను.

(అద్దములోఁ దనముఖ మెంతసేపు చూచుకొనినను కురూపికిసయితము తనివి యుండదు. ఎవనిభార్యముఖము వానికి పూర్ణచంద్రుఁడుకదా!)

నౌనావికాన్యాయము

నావికుఁడు లేకుండ నావ నడువదు; నావ లేకున్న నావికుఁడనవసరము.

నౌశకటన్యాయము

ఓడలు బండ్లు కావచ్చు; బండ్లోడలు కావచ్చు.

ప్రభ. 1.94.

న్యగ్రోధబీజన్యాయము

మఱ్ఱిచెట్టువిత్తనము చిన్నదైనను దానినుండి పుట్టిన వృక్షము విపరీతముగ విస్తరించును.

“విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత ?”

వేమన.

(పిట్ట కొంచెం; కూత ఘనం.)

పంకప్రక్షాళనన్యాయము

అడుసు త్రొక్కనేల ? కాలు కడుగనేల ?

పంకమగ్నగజన్యాయము

ఊఁబిలోఁ బడిన యేనుఁగు నేనుఁగే లేవనెత్తవలెను.

“ఏనుఁగు పల్లంబడిన నేలికకుఁ గా వశమే వహింపఁగఁ గా”

విక్ర. 5.132.

పంచకోశావతరణన్యాయము

వరుసగ ఆనందమయకోశము మొదలు అన్నమయకోశము వఱకును గల పంచకోశములను బొంది తుదకు జీవాత్మ దేహి యవును.

(అట్లే ఉన్నతపదచ్యుతుఁడయినవాఁడు.)

వృక్షాగ్రమునుండి జారిన పండు క్రమముగ కొమ్మలను దాఁటి నేలపైఁ బడినట్లు.

పంజరచాలనన్యాయము

పంజరముననున్న పక్షులన్నియు నొకమాటగ ముక్కులతోఁ బొడిచిన పంజరము పగిలి పక్షు లన్నియు లేచి పోఁగలవు.

పంజరబకన్యాయము

పంజరములో పెట్టి పోషించినను కొంగ చిలుకవలె మాటాడదు.

బకబంధనన్యాయమువలె.

పంజరముక్తవిహంగోడ్డీనన్యాయము

పంజరమునుండి పక్షిని వదలిన నది ఆకసమున కెగురును. దీనినే పంజరముక్తపక్షిచాలనన్యాయము అనియు నందురు.

పంజరస్థసింహన్యాయము

పంజరములో (బాధింపఁబడి) నున్న సింహమువలె.

పటకుటీరన్యాయము

డేరా వలసినతావున నిల్లుగా నేర్పడును.

పటతంతున్యాయము

వస్త్రమంతయు నూలుతో నిండియుండును. వస్త్రము నేయకపూర్వము నూలే; నేసినవస్త్రమును విడదీసినపుడును

నూలే మిగులునది. నూలే వస్త్రముగాఁ దయారయి నదియు.

పతంగదీపన్యాయము

ఒడలు కాల్చివేయును అని తెలిసియు తనకు ప్రీతిపాత్రమైన దీపముమీఁదికే పోయి మిడుత నశించును.

ఒడలు కాల్చివేయును అనియెఱిఁగియు మిడుత దీపము మీఁదికే పదేపదే పోయి పడి నశించును.

ఆహారము అను భ్రాంతిచే మిడుత దీపముపైఁ బడి కాలి చనిపోవును.

తీసి ఆవల పాఱవైచినను పోక మిడుత పదేపదే దీపము మీఁదికే పోయి పడి ఒడలు కాలి నశించును.

పతింవరాన్యాయము

స్వయంవరమునఁ గన్యక అల్పులను త్రోసిరాజని తనకు నీడుజోడవు శ్రేష్ఠపురుషునే వరించును.

గుణాగుణవిచార మటుండ స్వయంవరమునఁ గన్యక మును తా వలచియున్నకోడెగానినే వరించును.

ఉంకువలతో నుండు స్వయంవరములయందు నెగ్గిన రాకుమారుఁ డెట్టిడవుంగాక, కన్యక వానినే పతిగాఁ జేపట్టవలయును.

పదాతిన్యాయము

చతురంగములో బంటుకు ఋజుగతియే గాని, వెనుకకు

ప్రక్కలకు వక్రగమన ముండదు. కాని, చంపునపుడు మాత్ర మైమూలాలగా వక్రగతి పట్టును.

(దుష్టుడు దౌష్ట్యమునకు దిగక నడచుచూ, సాధువువలెఁ గన్పించినను, తలవనితలంపుగ దుర్మార్గమునకు దిగును.)

పద్మినీపత్రజలబిందున్యాయము

తామరాకులోని నీరు ఆకు నంటియుండదు.

పయోముఖవిషకుంభన్యాయము

లోపల విషము, పైని పాలును గల కుండవలె.

పరాహ్ణచ్ఛాయాన్యాయము

మధ్యాహ్నముతరువాత నీడ మొదట కొంచెముకొంచెముగానుండి క్రమక్రమముగ దీర్ఘ మగును.

(కోడికూఁతవలె.)

పరిణామిన్యాయము

కాలమునుబట్టి ప్రతివస్తువునకు మార్పు కలుగుచుండును.

పరిశేషన్యాయము

రెండుసంఖ్యలు గలిసిన మొత్తములో నొకసంఖ్య చెప్పినచో తక్కినసంఖ్య చెప్పనక్కఱలేకయే తెలియును. ('స్త్రీలును బురుషులును గలిసి పదిమంది. అందుఁ బురుషులు నలుగురు' అనిన మిగిలినయాఱుగురు స్త్రీలని చెప్పవలయునా?)

పర్జన్యన్యాయము

మేఘుఁడు మంచినేలను చవిటినేలనుగూడ వర్షించును. మంచినేలను గురిసినది ఫలించును. చవిటినేలను గురిసినది వ్యర్థమగును. ఆ లాభాలాభములతో మేఘమునకు సంబంధము లేదు. కురియుట దానిస్వభావము.

పర్వతాధిత్యకాన్యాయము

అధిత్యకా అనిన పర్వతోపరిభాగము అని అర్థము. అటులయ్యు "పర్వతాధిత్యక" యందురు. అపుడును మొత్తమునకు పర్వతోపరిభాగము అనియే అర్థము. అట్టి ప్రయోగమున అధిత్యకాశబ్దము ఉపరిభాగము అని మాత్రమే అర్థమును స్ఫురింపఁజేయును.

(కరకంకణము, నీలేందీవరము చంద్రునివెన్నెల వలె.)

పర్వతోపత్యకాన్యాయము

ఉపత్యకా అనిన కొండయొక్క అడుగుభాగము. (తక్కిన దంతయుఁ బూర్వన్యాయమువలె.)

పలితాపలితకేశన్యాయము

ఒకనితల నెరిసీనెరియన ట్లుండెను. వాని కిరువురు భార్యలు. ఒకతె వయసుది, మఱొకతె వయసుమీఱినది. వయసుది తెల్లవెండ్రుకలను, రెండవది నల్లవెండ్రుకలను లాగివైచి వానిని బోడిని జేసిరఁట.

భిన్నభిన్నధర్మములుగల పదార్థము లనేకము లొకచో నిముడనేఱవు.

పవనతాడనన్యాయము

గాలిని కొట్టినట్లు.
(ఆకాశముష్టిహననమువలె.)

పశుసోమాధికరణన్యాయము

సోమయాగమునఁ బశువును విధించినట్లు.

పక్షికులాయన్యాయము

పిల్లలు పెద్దవయినంతన పక్షి గూడు వదలిపెట్టును.
అవసరము తీరినవెనుక ఆశ్రియ మనవసరము.

పాటచ్చరయామికన్యాయము

దొంగలు దోచుకొనిపోయినతరువాత కావలివారు మేల్కొని హడావిడిపడినట్లు.

పాత్రేసమ్మితన్యాయము

భోజనసమయమునకు సిద్ధముగ నుండువారే పనికి నుపయోగించరు.

'తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు' అనినట్లు.

పారిషదన్యాయము

సభలో పనిచేయువాఁ డొకఁడే. కాని, ఆపనిని సభలోని వారందఱు చేసినట్లు తలంతురు.

పాషాణేష్టకాన్యాయము

ఇటుకఱాయి చట్రాతికన్న మృదువైనదే.

పితాపుత్రన్యాయము

ప్రస్తుతము తాను తండ్రియైనను, మున్నొకనికి కొడుకయి యున్నాఁడు.

పిపీలికాన్యాయము

చీమ పండునకై చెట్టుమొదటినుండి మెల్లగఁ జివరవఱకు ప్రాకిఁ పండునకు కన్నము వైచి లోనిరసము నానునట్లు. ఓపికపట్టి సాధించిన మెల్లగఁ బనులన్నియు సమకూరును.

పిపీలికాభిర్మంథానగిరివిలేపనన్యాయము

చీమలతో మందరపర్వతముచుట్టు పూతపూసినారఁట. నమ్మరానిమాటలు అని భావము.

పిపీలికాపన్నగన్యాయము

"చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవైనయట్లు."

సుమతీశతకము.

పిష్టపేషణన్యాయము

విసిరినపిండినే మఱలమఱల విసిరినట్లు.

ఊషరవృష్టివలె నిరర్థకము అనిభావము.

విసరిననే పిండి యనుపేరు వచ్చును. ఇఁక బిండిని విస రుటయన? అట్లే బియ్యము వండిన అన్నము అగును. అన్నమును వండుము అనిన? పిండిని అనినఁ దదుపకరణ మును, అన్నమును అనిన బియ్యము అనియు అర్థము స్ఫురించును.

అసంబద్ధభాషణమున స్వార్థత్యాగమున నీన్యాయ ముప యోగింపఁబడుదు.

పిష్టప్రమిత్యపూపన్యాయము

పిండికొలఁదిరొట్టె, విత్తముకొలఁది విభవము అనునట్లు.

పీలుపత్రఫలన్యాయము

గోలుగుచెట్టుఆకులు చేదుగా వగరుగా నుండును. పండ్లు తీయగా నుండును.

పుంవిషయన్యాయము

పురుషుఁడు విషయములకంటె భిన్నుఁడైనట్లు.

నానావృక్షరసమువలె.

పురాణవైరాగ్యన్యాయము

పురాణము వినినంతసేపు వైరాగ్యము చిలవలు పలవలు వేయుచుంటను. లేచి ముడ్డి దులిపినతోడనే ఆవైరాగ్యము పోయి తిరిగి ఎప్పటి కొంపా గోడే.

(గాటిలో పడుకున్న కుక్క-మాదిరి.)

శ్మశాన; ప్రసూతివైరాగ్య న్యాయములట్లు.

పురుషకేశలోమన్యాయము

దేహమునుండియే వెండ్రుకలు పుట్టును.

(దేహకేశన్యాయమును చూడుము.)

కేశములు అనఁగా ఊర్ధ్వకాయమునఁబుట్టిన శిరోజాదులు.

లోమములు అనఁగా అధఃకేశములు. కేశములు, లోమములు పురుషదేహమునుండి పుట్టినవే.

(శరీరములోనుండియే వచ్చినను పాలు పాలే; మూత్రము మూత్రమే.)

పుష్కరపలాశన్యాయము

తామరాకుఁ నీటిచేఁ దడియదు.

పద్మినీపత్రజలన్యాయమును జూడుము.

పుష్టలగుడన్యాయము

అఱచుచుఁ గఱువవచ్చు కుక్కలలో మొదటిదానిని కఱ్ఱతోఁ గొట్టి తక్కినకుక్కలను అదేకఱ్ఱసాయమున వెంటఁబడి తఱిమివైచినట్లు.

పుష్పవంతోపకారన్యాయము

పుష్పవంతు లనఁగా సూర్యచంద్రులు. వారు తక్కిన గ్రహములకు తమరాసులలో నిలువ నవకాశము నిచ్చియు, ప్రకాశము నిచ్చియు, నుపకారము చేయుచుందురు. సూర్యచంద్రులు క్షీణమైనను నిలువక దివారాత్రములు సంచారము చేయుచు వెలుతు రొసఁగియు సస్యాదులు ఫలింపఁ హేతువులై జగదుపకారకరు లవుచుందురు.

పూతికూశ్మాండన్యాయము

నీటిలోఁ బుట్టిన గుమ్మడికాయవలె.

చిత్రామృతమువలె అనుభవింప యోగ్యము గానిది.

పూర్ణఘటన్యాయము

నిండుకుండ తొణకదు.

పూర్వాహ్ణన్యాయము

పూర్వాహ్ణమందు మనుష్యుని నీడ దీర్ఘమయి క్రమక్రమముగ తగ్గిపోవును.

(దీనిని 'పూర్వాహ్ణచ్ఛాయాన్యాయ' మనియు నందురు.)

పూర్వాత్పరబలీయస్త్వన్యాయము

మొదటి దానికంటె రెండవది బలవత్తరము.

పృథివ్యోషధిన్యాయము

పృథివియందే ఓషధు లిమిడియున్నట్లు.

ఎంతలోతైనను త్రవ్వుడు. విత్తనములు వేయునవసరము లేకయే అచట మొలక బయలుదేరును.

పృష్టాకోటిన్యాయము

సర్వజ్ఞుఁడు కాకపోయినా అడిగినదానికి వలసినంతవఱకే సమాధానము చెప్పినఁ జాలును.

పృష్ఠఖలీన్యాయము

మూతికిఁబెట్టు కళ్ళెము ముడ్డికిఁ బెట్టినట్లు.

ప్రతిబింబన్యాయము

వస్తువు కదలిన దానినీడయుఁ గదలునట్లు.

ప్రత్యాసత్తిన్యాయము

దగ్గఱఉండుటచేనే (కావలసినపని త్వరగా నేఱవేఱుట)

ప్రదీపన్యాయము

పరస్పరవిరుద్ధము లయ్యు నూనె, ఒత్తి, అగ్ని మూఁడును గలిసి లోకోపకారము చేయును.

ప్రధానమల్లనిబర్హణన్యాయము

సేనాధిపతినిఁ గొట్టినచో సేనయంతయు లొంగునట్లు.
పేరుగల జెట్టిని గెలిచినచో తక్కినవారందఱు పరాజితులే యగుదురు.

ప్రపామేలనన్యాయము

ఎక్కడెక్కడివారో చలివేంద్రములో జలపానార్థమై వచ్చి కలిసి తిరిగి ఎవరిత్రోవన వారు పోవుచుందురు.
నదీప్రవాహమునఁ గొట్టుకొనివచ్చు పుల్లలు; సత్రాగత జనులువలె.

ఉదా:— ఋణసంబంధముచే నొకచోఁగలియు తండ్రి, తల్లి కుమారుఁడు మున్నగువారు.

ప్రమదాన్యాయము

ఇరువురు భార్యలు కలవానికి ఒక భార్యవలన సుఖము, ఆమెమూలమున రెండవభార్యవలన దుఃఖము కలుగును. ఆమె ఒక్కతెయే ఆసుఖదుఃఖములకు మూలకారణము.

ప్రవత్స్యద్భర్తృకాన్యాయము

భర్త దూరదేశమునకుఁ బ్రయాణమగుచుండ నాతని యెడ టనే భార్య యేడ్చినట్లు.

ప్రసక్తానుప్రసక్తన్యాయము

ఒకపని సాధింపఁ బూనుకొనిన మఱియొకఫలముగూడ గలిగినట్లు.

ప్రసూతివైరాగ్యన్యాయము

ప్రసవసమయమున నొప్పుల కోర్వలేక ఇఁక మగనిపొత్తు ప్రమాదముననైనఁ గోర నని వైరాగ్యమునొందిన వనిత అది తీరినవెనుక మఱల మామూలువ్యవహారమునకుఁ గడఁగినట్లు.

శ్మశాన, పురాణవైరాగ్యములవిధమున.

ప్రాసాదవాసిన్యాయము

మేడలో ఉన్నవారనిన, వారు రేయింబవళ్లు మేడమీఁదనే ఉండరు; క్రిందకూడ ఉందురు.

ప్లవంగగతిన్యాయము

కోతిగంతు లట్లు.

ఫలవత్సహకారన్యాయము

పండ్లకొఱకుఁ బెరటిలో నాటఁబడిన తీయమామిడిచెట్టు పండ్లేగాక నీడను, మంచిసువాసనను అడుగకయే ఇచ్చును.

బకబంధనన్యాయము

పంజరములోనుంచి పెంచిన కొంగ చిలుకవలె పలుకునా?

పంజరబకన్యాయమును చూడుము.

బకవృత్తిన్యాయము

నీటిబడ్డున కొంగజపమువలె.

తీరబకన్యాయమును జూడుము.

బధిరకర్ణజపన్యాయము

చెవిటివానిచెవిలో గుసగుసలు.

బధిరజాపన్యాయము

చెవిటివానిచెవిలో రహస్యము చెప్పినట్లు.

పంచతంత్ర. 336.

బధిరవీణాన్యాయము

చెవిటివానికి వీణ వినిపించినట్లు.

బధిరశంఖన్యాయము

చెవిటివానిచెవిలో శంఖూదినట్లు.

కళా. 2. 90.

"అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్"

భాగవతము.

బహుచ్ఛిద్రఘటోదరదీపన్యాయము

చాలచిల్లులు గల కుండలోఁ బెట్టఁబడిన దీపము అన్ని

చిల్లులద్వారా అన్నిరకములుగఁ బైకి ప్రసరించి వెలుపల ఆవెలుతురంతయు నేక మవును.

"నానాఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరమ్"

దక్షిణామూర్తిస్తవము.

బహుభ్యః శ్రోతవ్యబహుధాన్యాయము

పలువురు పలుతెఱంగుల నుడువుదురు.

ఒకనియందే లక్ష్య ముంచుట లెస్స.

బహురాజపురన్యాయము

పలువురురాజులు పాలకులుగాఁ గల పట్టణమువలె.

వారిలో వారికి మాట కలియక తుద కాపట్టణము ధ్వంసమవును.

అట్లే బహునాయకత్వము నాశకారణము.

బహువృకాకృష్టమృగన్యాయము

తోడేళ్ళగుంపుమధ్యఁ జిక్కిన లేడివలె. (దేనికి దొఱికిన భాగమా తోడేలు కొఱికివేయును)

బహుసపత్నీకన్యాయము

అనేకమంది భార్యలు గలవాని బ్రదుకువలె.

బాణోష్ట్రిన్యాయము

కొండచిలువ యొకయొంటెను పట్టి చంపు ప్రయత్నములో నుండెను. అది చూచి ఒంటె యజమాని కొండచిలు

వను తుపాకితోఁ గాల్చి చంపి తనబంటును రక్షించు కొనెను.

వానిలో రెండుఁ జంపఁదగనివే; రెండుఁ జావఁదగినవే. నోటిముంగలి సిద్ధాన్నమును దీసివేయుటయుఁ బాపమే. అయినను స్వార్థరక్షణమున మానవుని పాపాపాపములు బాధించవు.

బిడాలవిణ్మోచనన్యాయము

పిల్లి మలవిసర్జనము చేయునపుడు గొయ్యి త్రవ్వి యందు విడిచి పూడ్చివేయును.

బిలవర్తిగోధాన్యాయము

కన్నములో దూరిన బల్లి మొదలగువానిని చంప వీలు గానట్లు.

దీనికి 'బిలగోధాన్యాయ' మనియుఁ బేరు కలదు.

బిల్వఖల్వాటన్యాయము

ఎండవేడిమికి నిలువఁజాలక బట్టతలవాఁ డొకఁడు ప్రాంతముననున్న మారేడుచెట్టునీడకు బోయెను. దైవవశమున మారేడుపం డూడిపడి వానితల పగిలెనఁట.

"దరిద్రుని పెళ్ళికి వడగండ్లవాన" అన్నట్లు.
(దీనినే "ఖర్వాటబిల్వన్యాయ" మందురు.)

బిల్వవిభజనన్యాయము

మారేడుపండును పగులగొట్టినట్లు.

(తెలియని విషయమునఁ బ్రవర్తించుట.)

బీజవృక్షన్యాయము

బీజమున వృక్షము, వృక్షమున బీజము ఇమిడియున్నట్లు.

బీజాంకురన్యాయము

"యథా బీజ స్తథాంకురః". గింజనుబట్టి మొలక.

విత్తు ముందా, చెట్టు ముందా యనునట్లు.

చెట్టులో విత్తును, విత్తులో చెట్టు నుండును.

భాగవతము.

బ్రాహ్మణగ్రామన్యాయము

"ఇది బ్రాహ్మణ ఊరు" అని మనము సాధారణముగ ననుచుందుము. అనఁగా కేవల మీయూరు బ్రాహ్మణులదే అని కాదు. తక్కినఅన్నివర్ణములకంటె నీయూర బ్రాహ్మణు లెక్కువగ నున్నారని భావము.

ఆమ్రవణమువలె.

బ్రాహ్మణపరివ్రాజకన్యాయము

బ్రాహ్మణులకు భోజనము పెట్టవలె ననిన బ్రాహ్మణులే యవుటఁ బరివ్రాజకులకుఁగూడ భోజనమే పెట్టవలె నని కాదు.

బ్రాహ్మణవసిష్ఠన్యాయము

బ్రాహ్మణులు వచ్చినారు; వసిష్ఠుఁడును వచ్చినాఁడు అనిన వసిష్ఠుఁడు బ్రాహ్మణేతరుఁ డని అర్థము కాదు. వసిష్ఠుని యందు ప్రత్యేక మధికాభిమానమును సూచించుట.

బ్రాహ్మణశ్రమణన్యాయము

బ్రాహ్మణుఁడు స్వధర్మములను విడచి బౌద్ధభిక్షువువలె సంచరించినను బ్రాహ్మణుఁ డనియే వ్యవహరింపఁబడును.

భర్చున్యాయము

భర్చుఁడు బ్రతికియుండియే పిశాచమైనట్లు.

ఒకరాజునకు భర్చుఁడు అను మంత్రి గలఁడు. అతఁడు రాజనియుక్తుఁడై శత్రువును జయింప నితరదేశమున కేఁగెను. ఆతఁ డాతని నోడించి కొన్నిసంవత్సరము లాదేశమునందే యుండెను. విరోధు లెవరో "భర్చుని శత్రువులు చంపివైచిరి" అని రాజునకుఁ దెలిపిరి. రాజు మఱొక మంత్రిని నియమించికొనెను. కొంతకాలమునకు భర్చుఁడు స్వదేశమునకు మఱలి వచ్చి తనస్థానమున మఱొకఁడు నియమింపఁబడుటఁజూచి విరాగియై సన్యసించి అడవికి పోయెను. రాజొకనాఁ డాయడవికి వేటకరిగెను. భటులు భర్చుని చూచి బెదరి "రాజా! అదుగో, భర్చుని పిశాచము" అని కేకలు వైచిరి. అంతకుఁబూర్వమే అట్లు వినియుండుటవలన రాజు వాని యాకారాదులవలన నిజముగా భర్చుఁడు పిశాచ మయ్యెనని నిశ్చయించి కొనెను. (నలుగురూ నంది అనిన నంది; పంది అనిన పంది.)

భల్లాతకీబీజన్యాయము

జీడివిత్తులలోని పప్పులు పైబ్రద్దల కంటుకొని యుండక విడిగా నుండును.

"ఆజవంజవమునఁ గొంద అంటియుండ
రరయ భల్లాతకీబీజమట్లు ధరణి."

చెన్న. బ. 3. 386.

భల్లూకముష్టిన్యాయము

ఎలుగుబంటిపట్టిన పిడికిలి వదలింప నెవరికిని దరముగాదు.
("భల్లూకపుపట్టు" అని సామాన్యముగ వాడుదుము.)

భస్మచ్ఛన్నాగ్నిన్యాయము

నివురుగప్పిన నిప్పు పైకి లేనట్లుండియు లోపలఁ గణకణ లాడుచుండును.

శార. వి.తా. 1.322;

భాస్క. రా. యుద్ధకాండ 590.

భస్త్రీకాలపత్రన్యాయము

తోలుతిత్తిలో కొడవలిని దాఁచినట్లు.

భాండాలేఖ్యన్యాయము

కుండమీఁది గీతలవలె.

కుండమీఁద గీతలు తప్పక ఉండవలెనని నియమము లేదు. ఉన్నందువలన ప్రయోజనము లేదు; ఆ గీత లుండుట కుండకు లక్షణమును గాదు

భామతీన్యాయము

భామతి అను భామిని భర్తను సుఖపెట్టును; సవతులను దుఃఖపెట్టును.

అందఱి నెవఁడును సంతోషపఱుపనేఱఁడు; అందఱికి నెవ్వఁడు నిష్టుఁడు కాఁడు.

భారైకదేశావతరణన్యాయము

నెత్తిపైనున్న బరువులో కొంతబరువును తీసివేయుట. అనఁగా ఏపనినైనను సులభము చేసికొనుట.

భావార్థాధికరణన్యాయము

"స్వర్గకాముఁడు భావించవలెను" అనిన, దేనిని ఎట్లు, దేనిచేత, మున్నగుప్రశ్నలు వచ్చును.

భిత్తిబిడాలన్యాయము

గోడమీఁది పిల్లివలె.

ఎటువీలైన నటుతప్పించుకొనఁజూచుట.

భిల్లీచందనన్యాయము

అడవిజాతిస్త్రీ చందనపుచెట్టుకొమ్మలే నఱికి వంటకట్టెలుగా నుపయోగించును.

అతిపరిచయమువలన అవజ్ఞ, నిత్యసాన్నిధ్యముచే అనాదరము సంభవించును.

భిక్షుకపాదప్రసారణన్యాయము

భిక్షుకుఁడు గృహస్థునియింట భోజనశయనాదిలాభము నపేక్షించియు, నొక్కమాఱు తనయభీష్టమునంతయు వెలి బుచ్చినచోఁ బాదప్రసారణమును దుర్ఘటమని యెంచి మొదట నిస్పృహుఁడునుబోలెఁ బ్రవేశించి క్రమముగఁ దనకోరికలఁ బ్రకటించి కృతార్థుఁడవును.

భిక్షుభియాస్థాల్యనధిశ్రయణన్యాయము

బిచ్చగాఁడు వచ్చునను వెఱపున వంట మానినట్లు.

మృగభియా సస్యానాశ్రయణ న్యాయమువలె

భీమభాసదృఢన్యాయము

ఎగిరినవాఁడు క్రింద గూలునుగూడను.

భూమిరథికన్యాయము

రథయుద్ధము చేయుటను నేర్పు నాచార్యుఁడు శిష్యునకుఁ దొలుత నేలపై నొకరథమును గీచి ఆగీతలలో శిష్యుని నిలిపి నేర్పును. రథములో నుండియే యుద్ధముచేయుచు న్నట్లుభావించి నేర్చుకొని శిష్యుఁడు ఉత్తరత్ర యుద్ధరంగము లలోమహారథికుఁడై జయము గాంచును.

తొలుత వెదురుపుల్లలతో బాణప్రయోగమును నేర్చుకొని తదుపరి శరలాఘవమును గడించినట్లు.

శమేష్టిన్యాయమును జూడుము.

భూలింగన్యాయము



భూలింగమను నొక పక్షి గలదు. అది 'అతిసాహసము పనికిరాదు' అని అఱచుచుండును. కాని తానుమాత్రము సింహముదౌడలలోని మాంసమును పెఱికి తినును.
ఇతరులకు ఉపదేశము చేయుచు తానుమాత్ర మట్లాచరింప కుండుట.
దీనినే "భూలింగశకునిన్యాయ" మనియు నందురు.

భూశైత్యోష్ణ్యన్యాయము

భూమికిఁ జల్లదనము, వెచ్చఁదనము ఆరోపించినట్లు.
భూమికి స్వాభావికగుణము గంధవత్త్వము. (గంధవతీ పృథివీ) అయినను హిమాదులవలనఁ జల్లవడినఁ జల్లఁదనమును, ఎండవేడిమి మొదలగువాని మూలమునఁ గాలిన ఉష్ణత్వమును కలుగుచుండును.

భేకరవన్యాయము

కప్పలు అఱచినట్లు.

భేర్యాఘాతన్యాయము

నలుగురిదగ్గఱ భేరీ లున్న వారు నలుగురు తమ తమ భేరీల నొకేపర్యాయము వాయించవలయునను నియమము లేదు. వారియిష్టము. మనసైనప్పుడెల్ల వాయించుకొనుచు పోవుచుందురు.
(అనియమితముగ జరుగు విషయములందీన్యాయ ముపయోగింపఁబడును.)

## భైరవవిప్రన్యాయము

భైరవుఁడను విప్రుఁడొకఁడు రాజపురోహితుఁడుగా నుండు వాఁడు. అనుదినము రాజమందిరమునకుఁ బురోహితుఁడు పోవుచుండవలయునుఁగదా. రాజున కాతనిపై భక్తిశ్రద్ధలు మెండు. భైరవునిమాటకు రాజమందిరములో వలసినంత విలువ యుండెడిది. తక్కినవారు తమకది ప్రాణ గొడ్డమై మాయోపాయమున భైరవుని రాజమందిరమునకు రాకుండఁ జేసిరి. భైరవుఁడు చాల దిగులొంది అడవికి లేచిపోయెను. రాజునకు వారు భైరవుఁడు చనిపోయెనని చెప్పిరి. రాజు కాఁబోలు నని నమ్మెను. ఒకనాఁడు రాజు వేట కరిగెను. రాజురాఁక గమనించి భైరవుఁ డొకచెట్టుపైఁ గూర్చుండి రాజు సమీపించినంతన "రాజా! నేను భైరవుఁడను. ఇదిగో, ఇక్కడ నున్నాను. నీపరి జనులు నన్ను మోసగించిరి." అని కేకలు వైచెను. అది విని పరివారము "రాజా! భైరవుఁడు భూతమైనాఁడు. సమీపమునకుఁ బోకుము. కీడు మూడును" అని రాజు నీవలకుఁ దెచ్చిరి. రాజునయిత మాతఁడు నిజముగ భూతమే యని నమ్మి భూతోచ్చాటన సూక్తములను బఠింప మొదలిడెనఁట.

భైరవుఁడను బ్రాహ్మణుఁ డొకఁడు యజ్ఞార్థమై మేకను గొనిపోవుచుండెను. త్రోవలో ముగ్గురు దొంగలు దాని నపహరించుటకై అంచెలంచెలుగ బాటసారులవలె నుండిరి. దాపునకు వచ్చినంతన మొదటిదొంగ "అయ్యా! ఈ నల్ల

కుక్క నింత భద్రముగాఁ గొనిపోవుచున్నారేల ?" అని ప్రశ్నించెను. "కుక్క గాదు, ఇది మేక" అని భైరవుఁడు తనదారి పట్టెను. సమీపమున రెండవవాఁడు నట్లే యనెను. భైరవునకుఁ గొంచె మనుమానము కలిగెను. కాని, తలవంచి విచారించుచు పోవుచుండెను. మూఁడవవాఁడు నట్లే యనెను. భైరవున కనుమానము ప్రబలి తుదకది కుక్క యనియే విశ్వసించి మేక నచట విడిచిపోయెను. దొంగలు తమపని చూచుకొనిరి.

కావున—

నలుగు రేది పలికిన నదియే సిద్ధాంత మవును.

"పసుగురాడుమాట పాటియై ధరఁ జెల్లు"

వేమన.

భర్చున్యాయమును జూడుము.

## ఘోతవిచారన్యాయము

పిచ్చివాని ఆలోచనవలె.

పిచ్చివాఁ డొకఁడు రాజమందిరమునకుఁ బోయెను. సింహద్వారమున నొకమదపుటేనుఁగు నిలఁబడియుండెను. దానిని చూచి యాతఁ డీతీరునఁ దలపోసెను— "ఏమిది ? చీఁకటియా ? కాదు, కాదు. చీఁకటి చేటలతో బయలు దేరునా ? కాకున్న ? మేఘము కావచ్చును. ధారగా నీరు క్రుమ్మరించుచున్నది; గర్జిల్లుచున్నది. అబ్బే! అదీ కాదు. మేఘమునకు నలువైపుల నాలుగు స్తంభము

లుండఁగా నిదివఱకు చూచియుండలేదు. మఱి, రాజుగారి బంధువు కావచ్చును. "రాజద్వారే శ్మశానేచ య స్తిష్ఠతి స బాంధవః—రాజద్వారమున శ్మశానమున నుండువాఁడు బంధువుఁడగును" (పంచతంత్రము) అనిగదా పెద్దలనుడి. తప్పక రాజబంధువే కావచ్చుచు. అట్లవుచో, వీనికి చేతిలో వేత్రము (కఱ్ఱ) లేదే!" ఇట్లాతఁడు పలుపోకలు పోయెను. పరిణామ మేమన—

ఏనుఁగు, ఏనుఁగుధర్మములు పోయి అసంబద్ధవర్ణనముతో అసదృశము లవు నన్యధర్మము లా యేనుఁగున కారోపింపఁబడి తుద కవియు నిరసింపఁబడినవి. వాని ఆలోచన మాత్రము ఇంకను సాగుచునేయున్నది. ద్వారస్థవస్తు వేదియో నిరూపితము కాలేదు.

భ్రమరన్యాయము

తేనెటీఁగ పూవు నంటియున్న ముండ్లను వదలి దానిలోని మకరందమే పానముచేయును.

(బుద్ధిమంతుఁడు దుర్గుణములను వదలి సుగుణములనే గ్రహించును.)

తేనెటీఁగ మకరందపానమునకై ప్రతిపూవుదగ్గఱకుఁ బోవును. కాని సువాసన, మకరందము లేనిపూవుల దగ్గఱకు పోనేపోదు.

(మతిమంతులు గుణవంతులసాంగత్యమే చేయుదురుగాని, గుణహీనులు, అప్రయోజకులు నవువారి మొగమేనియుఁ జూడరు.)

త్రే నెటీఁగ కుట్టినచో మనదేహము దద్దురువాఱి చాల బాధ ననుభవించును. అది మొనదేఱిన తన మొగమునందలి ముంటితో నెట్టికట్టైనైనను రంధ్రము పడఁ జేయును. కాని, మకరందమును ద్రావునేకాని అతి మృదులమవు కమలమున కాముంటితో నెట్టిహానియుఁ జేయదు.

(బుద్ధిమంతుఁడు సమర్థుఁడయ్యు నేరికిని కష్టము కలిగింపఁడు.)

భ్రమరకీటన్యాయము

తుమ్మెద పురుగును దెచ్చి తన గూటనుంచి దానిచుట్టు తిరిగి ధ్వనిచేయుచు నుండఁగా నుండఁగా నాపురుగు ఆ నాదమువినుచుఁ గొంతకాలమునకు తుమ్మెదగా మాఱును.

మను. 2. 36.

కీటకముఁ దెచ్చి భ్రమరము
పాటవమున బంభ్రమింప భ్రాంతంబైత
త్కీటకము భ్రమరరూపముఁ
బాటించి వహించుఁగాదె భయయోగమునన్.

భాగ. 7 స్కంధము.

"ప్రాలేయాచలకన్యకావదన.........
.........భ్రమరకీటన్యాయరీతిం బురిన్"

కాశీఖండము.

భ్రష్టావసరన్యాయము

వేళకు లేనందువలనఁ దత్ఫలము భ్రష్టమైనట్లు.

"సమయానికి లేని భాకా చంక నాకనా?" అని సామెత.

నిష్ప్రయోజనమైనది అని త్యజింపఁబడినవస్తువే మఱొకపు డవసర మవుచుండును.

భ్వాదిన్యాయము

ధాతుపాఠమున స్వాభావికముగ భ్వాదిధాతువుల కొక యర్థము నొడువఁబడియుండును. కాని, ప్రాద్యుపసర్గలతో సంయోగము గలయపు డాధాతువు లనేకార్థబోధకము లవును.

అద్వితీయ మయ్యు బ్రహ్మ ముపాధిభేదముల ననేకత్వమున స్ఫురించును.

మంజూషాఖున్యాయము

ఆహార మున్నదను నాసచే పాములపెట్టెకు కన్నమువైచి ఎలుక లోనికిఁ బోవ లోనిపాము దానినిఁ బట్టి తిని, ఆకన్నముద్వారా వెలుపలికి వచ్చి ఎందో పోవును.

లాభము కలుగునని పోఁగా లాభప్రాప్తి అటుండ, నని ష్టము పైఁబడినట్లు.

మూషకాహిమంజూషాన్యాయమును జూడుము.

### మండూకతులాన్యాయము

కప్పలతక్కెడ

ఒకఁడొక వస్తువును తక్కెడలో నొకవైపుననుంచి దానిని తూచుటకై తనవద్ద రాళ్లు లేనందున వానికి బదులుగ రెండవవైపున కప్పలనువేసి తూచ నారంభింపఁగా కప్పలు తక్కెడలో స్థిరముగ నిలువక క్రిందికి దుముక జొచ్చెను. ఇట్లెంతసేపు తూచినను త్రాసు సమముగ నుండకుండెను.

దీనికి మండూకతోలనన్యాయము అనియుఁ బేరు.

### మండూకప్లుతిన్యాయము

కప్ప దాట్లు వేసినట్లు.

ఒకపని కొంతభాగము చేసి యది విడిచి వేఱొకపని కొంత చేయుచుండుట.

### మండూకమక్షికాన్యాయము

కప్ప, పామునోటిలో నుండియు నీఁగను మ్రింగఁబోవునట్లు.

### మజ్జనోన్మజ్జనన్యాయము

నదిలోఁ బడి మఱల గట్టు జేర నేరనివాఁడు మునుగుచు, తేలుచు, రక్షకులకొఱకై వెదకుచు, చాల బాధ నొందు చుండును.

ఉదా:—సంసారసాగరములోని జీవుఁడు.

మణికంకణన్యాయము

కంకణ మనుటతోడనే అందుఁ మణులుకూడ గలవని స్ఫురించును. అయినను మణుల మణిశబ్దప్రయోగ మొన ర్తురు.
పర్వతాధిత్యకా, పర్వతోపత్యకాన్యాయములవలె.

మణిప్రభామణిమతిన్యాయము

మణిప్రభను మణి యనియు మణిని మణిప్రభ యనియు భ్రమించి తుదకు వాస్తవము నెఱింగికొనుట. ఇయ్యదియే పరమాచార్యులచే నిట్లు వచింప బడియున్నది:—

"మణిప్రదీపప్రభయో ర్మణిబుద్ధ్యాభిధావతోః,
మిథ్యాజ్ఞానావిశేషేపి విశేషోఽర్థక్రియాం ప్రతి.
దీపోఽపవరకస్యాన్త ర్వర్తతే తత్ప్రభా బహిః,
దృశ్యతే ద్వార్యథాఽన్యత్ర తద్వ ద్దృష్టా మణేః ప్రభా.
దూరే ప్రభాద్వయం దృష్ట్వామణిబుద్ధ్యాభిధావతోః,
ప్రభాయాం మణిబుద్ధిస్తు మిథ్యాజ్ఞానం ద్వయోరపి.
నలభ్యతే మణి ర్దీపప్రభాం ప్రత్యభిధావతా,
ప్రభాయాం ధావతావశ్యం లభ్యేతైవ మణి ర్మణేః.
దీపప్రభామణిభ్రాన్తి ర్విసంవాదిభ్రమః స్మృతః,
మణిప్రభామణిభ్రాన్తిః సంవాదిభ్రమ ఉచ్యతే."

ఒకయింటిలో నొకచో దీపముఁ బెట్టిరి. దాని ప్రభ మణివలెఁ బ్రకాశించుచు గుమ్మములోఁ బడుచుండెను. ఆ ఎదుటి యింటిలోఁ బైదీపమున కెదురుగ నొక మణి యుంచఁబడెను. దాని ప్రభయు మణివలె గుమ్మమునఁ బడు చుండెను. వానినిఁజూచి యొకఁడు దీపప్రభయే మణియను భ్రాన్తితో దీపప్రభ యొద్దకుఁ బరుగెత్తెను. మఱొకఁడు మణి యను భ్రాన్తితో మణిప్రభవద్దకుఁ బరుగెత్తెను. వారిరువురును ప్రభాద్వయమును జేరి పరిశీలించి యివి మణులు కావనియు, మణిదీపప్రభ లనియు, తా మూరక భ్రమించి అట్లు పరుగిడితిమనియు, తెలిసికొనిరి. దీపప్రభను మణి అనుకొనినవానిది విసంవాది భ్రమ; మణిప్రభను మణి అనుకొనినవానిది సంవాదిభ్రమ అని చెప్పఁబడును.

మణిప్రదీపప్రభాన్యాయము

మణిప్రభామణిమతిన్యాయము, నియ్యదియు నొకటియే.

మణిమంత్రన్యాయము

అగ్నిజ్వాలల నార్పుటకు మణులు, మంత్రములు పనికిరావు. విషయకాములకు జ్ఞానోపదేశము, మ్రియమాణునకు మందుమాకులు వలె.

మణిసూత్రన్యాయము

పూసలలోఁ దారమువలె.

(అందఱితోఁ గలసిమెలసి యుండుట)

వేదాంతు లీన్యాయమును సాధారణముగ తత్త్వమున కుపయోగింతురు.

"సూత్రే మణిగణా ఇవ"

"ఎనయుం దారము రత్నహారములయం దేరీతి"

వ్యాఖ్యాతల శంకరవిజయమునుండి.

## మత్తకాశినీన్యాయము

నడివయసునన్న కులుకులాడియెమటనుండఁ బశువును మోహించినట్లు.

## మత్స్యకంటకన్యాయము

ముల్లుగల చేపను బట్టి ముల్లు తీసివైచి చేపను వండుకొని తినినట్లు.

ఒకవస్తువు కించిద్దోషయుక్త మైనను ఆదోషమును తొలగించి శిష్టవస్తువును గ్రహించుట లెస్స.

## మధుమక్షికాన్యాయము

ఈఁగలు కూర్చిన తేనె మనుష్యులయధీన మైనట్లు.

"తేనెఁగూర్చి యీఁగ తెరువరి కియ్యదా"

వేమన.

## మధుకరరాజమధుమక్షికాన్యాయము

పోతుతేనెటీఁగను తేనె సంపాదించు తక్కిన ఆడుతేనెటీఁగ లన్నియు అనుసరించి సేవించునట్లు.

మధురరసభవితామ్రబీజన్యాయము

మామిడిటెంక అంతకంతకూ ఎక్కువ తీయనిపండ్లు గలిగించుచునేయుండును.

ఉత్తరోత్తర ముత్తమోత్తమఫలితములు కనఁబడునపు డీన్యాయ ముపయోగింపఁబడును.

మధ్యదీపన్యాయము

ఇంటిమధ్య నున్న దీపము ఇంట నన్నిమూలల వెలుతు రిచ్చునట్లు.

మధ్యమమణిన్యాయము

ముత్యాలహారములో కొలికిపూసగా నుంచఁబడిన మణి తాను ప్రకాశించుచు తనప్రభచే ముత్యములనుగూడ ప్రకాశింపఁజేయును.

సంఘమునఁ దాను ప్రకాశించుచు సజ్జనుఁడు తోడివారలకుఁ గూడ తేజు నిచ్చును.

మనోరాజ్యవిజృంభణన్యాయము

కోరికలకు అంతు లేదు. ఒకదానిపై నొకటి పుట్టుచునే యుండును.

మన్దవిషన్యాయము

కొద్దివిషమువలె.

కొద్దిపాటివిషయము నణచివైచుట సుకరము.

"ఏవం హి సంశయాదినివృత్తి ర్మన్దవిషన్యాయేన సుకరా। బోధాదార్ఢ్యే ప్రతివాద్యాపాదితం తు సంశయాది తీవ్ర విషన్యాయేన దుష్పరిహారం స్యాత్। సద్యోభుక్తం విషం మన్ద మన్యథా తీవ్రమ్॥"

లౌకికన్యాయరత్నాకరము (పూర్వభాగము)

(అప్పుడే భుజింపఁబడినది మందవిషము; చాల తడవై జీర్ణించినది తీవ్రవిషము)

ఈన్యాయము 'తీవ్రవిషన్యాయము'నకు విరుద్ధము.

మరుమరీచికాన్యాయము

ఎడారిలో నెండమావులు జలమువలెఁ గానుపించి యెంత దూరము పోయినను అట్లేయుండును.

మర్కటకిశోరన్యాయము

కోతిపిల్ల తల్లి యొకచెట్టునుండి వేఱొక చెట్టునకు గంతులు వైచినను తల్లికడుపును బట్టుకొని విడువక యంటిపెట్టుక యుండును.

బలహీనుఁడు బలవంతుని అండ విడువఁడు.

మర్కటమదిరాపానాదిన్యాయము

అసలే కోతి; కల్లు త్రాగినది; దయ్యము పట్టినది; తేలు కుట్టినది. (ఇఁకెఁ నెట్లుండునో చూడుఁడు)

మలినదర్పణన్యాయము

మలినముగానున్న అద్దములో ప్రతిబింబముకూడ మలినముగానే యుండును.

మల్లగ్రామన్యాయము

ఇతరజాతులుకూడ ఉండినను, మల్లురు అధికముగాఁగల యూరికి మల్లగ్రామమనియే వ్యవహారము కలుగును.

బ్రాహ్మణగ్రామన్యాయము, ఆమ్రవణన్యాయములవలె.

మహాదర్పణముఖన్యాయము

పెద్దఅద్దములో పెద్దముఖము. (చిన్నఅద్దములో చిన్న ముఖము.)

మహానసశశన్యాయము

వంటయింటఁ జొచ్చిన కుందేలు సులభముగఁ బట్టుపడును. (భార. ఆది. 6.186)

మహామత్స్యతరన్యాయము

పెద్దచేప నదిలో ఈదరినుండి ఆదరివఱకు నెగిరిపడుచుఁ దిరుగుచుండును. కాని అది ఆఒడ్డులకంటె వేఱయి యుండి ఒడ్డులను తాకదు.

ఉదా:-జాగ్రదాద్యవస్థల నంటియుండియు నుపాధుల నంటక భిన్నముగ నుండు పరతత్త్వము.

మహార్ణవయుగచ్ఛిద్రకూర్మగ్రీవాప్రవేశన్యాయము

రెండుతరంగములమధ్య నెటు పోలేక అలలతాఁకుడున కలసి తుద కెటులో తాఁ జే లొంగ డొకతరంగమున గ్రీవా ప్రవేశ మొనరింప నేర్చినట్లు.

"చలార్ణవయుగచ్ఛిద్రకూర్మగ్రీవాప్రవేశవత్,
అనేకజన్మనా మన్తే వివేకీ జాయతే పుమాన్"

యోగవాసిష్ఠము.

చలేతి:—చలార్ణవయుగచ్ఛిద్రకూర్మగ్రీవాప్రవేశవత్। చలౌ చంచలౌ యౌ వర్ణవౌ తౌ వర్ణవౌ తరంగౌ తయోర్యుగం యుగ్మం తస్య ఛిద్రం మధ్యవర్త్యాకాశం తత్ర స్థితో యః కూర్మః కమఠ స్తస్య కచ్ఛప స్యోభయ పార్శ్వే బహుకాలం నిరన్తరం తరంగకృతతాడనేన విహ్వలత్వే గ్రీవాప్రవేశో గ్రీవా కణ్ఠ స్తదుపలక్షితతదాద్యంగప్రవేశో యథా జాయతే తద్వత్పుమాన్ పురుషార్థ్యనేకజన్మనా మనన్తజన్మమరణోపలక్షితసుఖదుఃఖానాం స్పర్శేన ఖిన్న స్తదంతఃకరణబాహ్యకరణాని స్వస్వవిషయేభ్యో వ్యావర్త్య వివేక్యాత్మానాత్మవివేకవా ఞ్జాయతే భవతి ॥

తాళప్రమాణమున నెగసిపడుచు భయంకరధ్వనులతోఁ బాఱు రెండుకెరటముల నడుమఁ జిక్కి-కొనిన తాఁబేలటు నిటు పోలేక యిరువంకలఁ గొండలంబోలిన తరంగయుగాఘాతముల నెంతయు నొచ్చి విహ్వలించి బహుకాలమట్లయ్యెడన పడియుండి తుద కెన్నఁడో సమయము దొరికినపు డల్లన మెడదూర్చి పిదప తక్కి-నయవయవములను గూడ జొప్పించుచు నొకతరంగమునఁ బ్రవేశించి యథేచ్ఛం జనును.

అట్లే పురుషార్థియవు పురుషుఁడు నిరస్తమవు సంసార చక్రమునం బడి యనేకజన్మములకావల జననమరణోపలక్షితసుఖదుఃఖస్పర్శమున ఖిన్నుఁడై బాహ్యాంతఃకరణగణమును విషయములబారిం బడక అరికట్టి వివేకియై యాత్మనాత్మవివేకముగలవాఁడు కానేర్చును.

మహావాతగజన్యాయము

మహావాయువులో నేనుఁగులె కొట్టుకొనిపోవుచుండ నింక నల్పజంతువుల లెక్కయేమి ?

“ మహాగజాః పలాయంతే మశకానాంతు కా గతిః ? ”

మహిషీప్రసవన్యాయము

బఱ్ఱె ఈనినట్లు.

(సులభ మని భావము.)

మహిషీమహిషన్యాయము

బఱ్ఱె ఈనుచుండఁగా దున్నపోతు దానిపై నెక్కఁ బ్రయత్నించినట్లు.

(మగఁడు చచ్చి ఏడ్చుచుండ అంకుమగఁడు తాళ్ళు వైచినట్లు.)

మక్షికాన్యాయము

ఈఁగ ఎంత చక్కనిశరీరముమీఁద వ్రాలినా రుచిచూచునదిమాత్రము పుండులోని చీమే.

మాత్స్యన్యాయము

పెద్దచేప చిన్నచేపను భక్షించును.

మార్జాలకబళన్యాయము

పిల్లి భోజనముచేయుచున్నవారియొద్దఁ గూర్చుండి వారెత్తు కబళములన్నియు తననిమిత్తమే యని తలఁచుచుండును.

మార్జాలకిశోరన్యాయము

పిల్లి తననోటితోఁ బల్లుతగులకుండ నతిజాగ్రతతోఁ బిల్లను తీసికొనిపోవును.

మార్జాలశీలన్యాయము

పిల్లినడత.

వైజ. 2. 19.

ఏమియు ముట్టుకొనని యట్లె యుండి కనుమాటయిన ప్రతి వస్తువులోను మూతి బెట్టి తినును.

మార్జాలదుగ్ధపానన్యాయము

పిల్లి కన్నులుమూసికొని పాలు త్రాగుచు తన్నెవ్వరును చూచుటలేదని తలంచినట్లు.

మాషరాశిప్రవిష్టమషీన్యాయము

మినుములరాశిలోఁ గలిసిన మసిమాదిరి.

మసికిని మినుములకును గల రంగు ఒకేమాదిరి నుండును. రాశిగాఁబోసిన మినుములనలుపురంగు మఱింత దట్టమవును.

అపుడు దానిలోఁ గలిసినమసి ఉన్నట్లే కనబడక మినుములలోఁ గలిసిపోవును. అట్టియెడ దానిని విడదీయుట కష్టసాధ్యము కదా !

"యథా మాషరాశౌ మషీ, యథావా నీలోత్పలవనే కాదమ్బ స్తద్భేదాగ్రహ స్తదపృథగ్భావేనాభిమన్యతే వ్యవహ్రియతే చ॥"

సర్వార్థసిద్ధి.

## ముంజాదిషీకోద్ధరణన్యాయము

ముంజగడ్డిలోనుండి తద్గర్భస్థమవు కోమలతృణముఁ జతుర తతోఁ దీసినయట్లు.

"యథా ముఞ్జా దిషీకైవ మాత్మా యుక్త్యా సముద్ధృతః।
శరీర త్రితయా ద్ధీరైః పరం బ్రహ్మైవ జాయతే॥"

ముంజాంతస్థమవు నిషీకము వలె నిపుణతతో శరీరత్రిత యమునుండి ధీరులచే సముద్ధరింపఁబడిన ఆత్మ పరబ్రహ్మమై ప్రకాశించును.

## మూర్ఖసేవనన్యాయము

మూర్ఖునిఁ గొలిచినట్లు.

ఊషరవృష్టివలె నిష్ప్రయోజనము అని భావము.

మూర్ఖునిఁ గొలిచిన ప్రయోజనము లేకపోవుటయేగాక వానిమూర్ఖతయు సంక్రమించును.

(విధవకు దండము పెట్టిన నావలె నూరేండ్లు జీవించుమని దీవించినదఁట.)

మూలక్రిమిన్యాయము

వేరులో పురుగు పుట్టిన చెట్టంతయు చచ్చిపోవును.

మూషకవిషాణన్యాయము

ఎలుకకు కొమ్ములు పుట్టినట్టు.

శశవిషాణమువలె అసంభవము.

మూషకాహిమంజూషాన్యాయము

ఎలుక పాములబుట్టను జూచి యం దేమో కలదని భ్రమించి కన్నము పెట్టి లోపలికి దూరగా, పాము దానిని బట్టి భక్షించి ఆకన్నమునుండియే యావలకుఁ బాఱి పోవును.

మంజూషాఖున్యాయము జూడుము.

మూషాసిక్తతామ్రన్యాయము

కఱఁగి మూసలోఁ బోసిన రాగియట్లు.

"చక్షురాదిద్వారా బహి ర్నిఃసృతస్యాంతకరణస్య మూషాసిక్తతామ్రన్యాయేన విషయాకారతా భవతి."

చక్షురాదులద్వారా బహిర్గతమయిన అంతఃకరణమునకు మూషాసిక్త తామ్రమునకువలె విషయాకారత్వము కలుగును."

"మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా,
రూపాదీ న్వ్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువమ్."
ఆచార్యులవారి—ఉపదేశసాహస్రి.

మూషాన్తఃసుషిరా మృత్ప్రతిమా। యథాగ్నిసంపర్కాద్ద్రవీభూతం తామ్రం మూషాయాం నిషిక్తం నిక్షిప్తం స త్తన్నిభం జాయతే తత్సమానాకృతి భవతి తథా చిత్తమపి రూపాదీన్ విషయాన్ వ్యాప్నువ త్తన్నిభం దృశ్యతే తదాకారం జాయత ఇత్యర్థః॥

రాగిచెంబులు పోతబోయువాఁడు రాగి బాగుగా కఱఁగి మూసలోఁ బోయును. వెంటనే అది ఆమూస యొక్క ఆకారమువంటి ఆకారము నొందును. అట్లే చిత్తము సయితము రూపాదివ్యాపారవ్యాప్తమై తదాకార మవును. "విద్యా దన్నమయేనైవ మూషాయాం ద్రుతతామ్రవత్, సర్వాన్ ప్రాణమయాదీం స్తాన్ రచితా న్పురుషాకృతీన్."

తైత్తిరీయవార్తికము.

మృగతృష్ణాన్యాయము

ఎండమావులను జూచి నీరని భ్రమించి పరుగిడినట్లు.

మరుమరీచికాన్యాయము జూడుము.

మృగభియాసస్యానాశ్రయణన్యాయము

పశువులు తినివేయు నేమో యనుభయమున పొలములలో పైరు వేయుటయే మానినట్లు.

భిక్షుభియా స్థాల్యనాశ్రయణన్యాయము రకమున.

మృగవాగురాన్యాయము

వాగురా అనిన మృగములను బట్టు వల అని అర్థము. మృగవాగురా అనినను అయ్యదియే అర్థము.

కరకంకణము, నీలేందీవరముల వలె.

మృగసంగీతన్యాయము

వ్యాధుఁడు అరణ్యములో లేళ్ళను బట్టుటకై వల పన్ని ఇంచుక దూరమున తానుండి ఒకవిధమగు రాగముతో సంగీతముపాడును. లేళ్ళు ఆరాగముచే మనస్సులు లాగఁబడి వరుసగా పోయి వలయున్నదను జ్ఞానమే లేక మందలు మందలుగ వలలోఁ జిక్కుకొనును.

అసార మనియు, కష్టభూయిష్ఠమనియు, నెఱుఁగక తను జాద్యాలాపలోలుప తాకిరాతగీతాపహృతమైన మానస మున నరమృగములు రాగమూలకసంసారవాగురిం దగుల్కొని నశించును.

"మ. భవకాంతారముమధ్యమందు స్వపరీవార ప్రలాపంబుపే ర్దవు వ్యాధాగ్ర్యునమానగానవిధిచే నాకృష్టచిత్తమ్మునన్ జవ మొప్పం జని రాగవాగురి విలగ్నంబై మృతిం గాంచు ది క్కెవరున్ లేమి నెచోట మర్త్యమృగ మెంతేఁ గుంది రాధాధవా!"

వ్యాఖ్యాతల రాధాధవశతకమునుండి.

మృతమారణన్యాయము

చచ్చినవానినిఁ జంపినట్లు.

మృద్ఘటన్యాయము

కుండయొక్క ఆదిమధ్యావసానముల నుండునది మృత్తికయే. కొంతకాలము మాత్రము స్వరూపము కల్పింపఁబడినది.

అట్లే జగత్తులయొక్క ఆదిమధ్యావసానముల నుండునది బ్రహ్మపదార్థమే. జగదాదికస్వరూప మాత్రబ్రహ్మవిలాసము. పటతంతున్యాయమువలె.

మేఘచాతకన్యాయము

చాతకపక్షి మేఘములోనుండి కురిసిన నీరేగాని యితర జలము నపేక్షింపదు.

జ్ఞాని పరానందమేగాని తుచ్ఛలౌకికవిషయానంద మపేక్షింపఁడు.

మేషపుచ్ఛన్యాయము

మేక ఎంత బలసినా తోక బెత్తెఁడే.

మేషయుద్ధన్యాయము

పొట్టేలు పొట్టేలు దెబ్బలాడుచుండగా నడుమ నక్కపడి చచ్చినట్లు.

యత్పరః శబ్దన్యాయము

తరువాత పుట్టినదే శబ్దము.

(ముందు తేజస్సు, తరువాత శబ్దము పుట్టును గాని ముందే శబ్దము పుట్టదు.)

అర్థవంతమైనదే శబ్దము.

### యత్ప్రాయః శ్రూయతే న్యాయము

తఱచుగా వినుచుండుదానినే నిజమని విశ్వసించుట లోక స్వభావము.

### యథాక్రతున్యాయము

క్రతువు బ్రహ్మస్వరూప మయినట్లే యజమానుఁడును బ్రహ్మస్వరూపుఁ డవును.

"అసౌ వాదిత్యో బ్రహ్మ; అన్నం బ్రహ్మ; అహం బ్రహ్మ" అను వాక్యములవలె "యజమానం బ్రహ్మే త్యుపాసీత;" "యజమానరూపో వై" ఇత్యాది వాక్యముల నెఱుంగ నగును. మీమాంసాశాస్త్రమున నీన్యాయము తఱచు వాడఁబడును.

### యథారాజన్యాయము

యథా రాజా, తథా ప్రజా.

### యథాసంఖ్యన్యాయము

సమానపదస్థములగు ప్రత్యయాదులకు విధింపఁబడిన విధులు క్రమము తప్పక ప్రవర్తించును.

అనఁగా మొదటివిధి పదమందలి నిర్దిష్టప్రత్యయములలో మొదటిదానికిని; రెండవది రెండవదానికిని; మూఁడవది మూఁడవదానికిని. ఇట్లే తక్కినవన్నియు ప్రవర్తించు చుండును.

ఈన్యాయము వ్యాకరణమందలిది. "యథాసంఖ్య మను దేశః సమానామ్" అనునది యీన్యాయమునకు మూల సూత్రము. సూత్రార్థము న్యాయముక్రిందనే వివరింపఁ బడినది. ఆ సూత్రప్రవృత్తి ఎట్లనః—

"టా జసి జసా మినా ఽఽత్ స్యాః" అని పాణినీయ సూత్రము. టా, జసి, జస్ లకు ఇన, ఆత్, స్య అనునవి ఆదేశము లగును అని సూత్రార్థము.

టా, జసి, జస్ లు తృతీయ, పంచమి, షష్ఠి విభక్తిప్రత్యయ ములు. ఇన, ఆత్, స్య ఇవి ఆప్రత్యయములకు విధింపఁ బడిన కార్యములు.

అగుచో, సూత్రమందలి నిర్దిష్టప్రత్యయములలో మొదటి దవు 'టా' కు ఆదేశవిధులలో మొదటిదవు 'ఇన' యును; రెండవప్రత్యయమవు 'జసి'కి 'ఆత్'; మూఁడవదవు 'జస్'కు 'స్య' యును క్రమము తప్పక యథాసంఖ్యముగఁ బ్రవర్తించును.

యవవరాహన్యాయము

అడవిపంది చేను మేయఁగా ఊరపంది చెవులు గోసినట్లు.

యవవరాహాధికరణన్యాయము

యవ, వరాహ శబ్దముల కధికరణమూఢ మవు నర్థమే గ్రాహ్య మైనట్లు.

యవశబ్దమునకు యవధాన్యములు, బార్లేగింజలు, గోలుగు చెట్లు మున్నగు నర్థములు గలవు. అట్లే వరాహశబ్దమునకును పంది, కృష్ణవిహంగాదు లర్థములు. కాని వీనికి శాస్త్రప్రసిద్ధము లయిన యవధాన్యము, కృష్ణవిహంగాదులే సుగ్రాహ్యములు.

"యవవరాహాధికరణన్యాయేన లోకప్రసిద్ధిః శాస్త్రసిద్ధ్యా బాధ్యా॥"

కావుననే అనార్యులచే వ్యవహరింపఁబడు బార్లే, సూకరా ద్యర్థములు అధికరణార్థమున నిరసింపఁబడినవి. పంకజమునకు నత్తగుల్లలు గాక పద్మము అను నర్థమే వ్యవహారసిద్ధ మైనట్లు.

### యవాగూగర్తప్లవనన్యాయము

గంజిగుంట దాఁటె నన్నట్లు.

### యుధ్యత్కుక్కుటన్యాయము

పోట్లాడే కోళ్ళు బాదినా వెనుదీయవు.

పోట్లాట ప్రారంభించువఱకును కోళ్ళకు వైర ముండదు. ఆతరువాతకూడ యజమానులు తెచ్చిపెట్టిన వైరమేకాని వానికి సకారణముగ కలిగినది కాదు. అట్లయ్యు కోళ్ళు ఘోరముగ పోరాడును.

మూర్ఖత్వము నీన్యాయము సూచించును.

యూకాభియా కంథానాశ్రయణన్యాయము

నల్లులు కుట్టునని బొంతపైఁ బరుండ మానినట్లు.
భిక్షుభియా స్థాల్యనధిశ్రయణ, మృగభియా సస్యా- నాశ్రయణ న్యాయముల తెఱఁగున.

యూపపశున్యాయము

యూపస్తంభమునకు గట్టిన పశువునకుఁ జావు సిద్ధము.
కొలఁదికాలములోఁ దనకుఁ జావు సంసిద్ధమై యున్నను యూపబద్ధపశువు తద్విచారముమాట యటుండ మృతి జ్ఞానమే లేక నిర్వికారముగఁ దొంటి కట్టుకొయ్యన యున్నట్లె యుండును.
సత్పురుషు లవ్వారు సుఖదుఃఖములయందును, మానావ మానములయందును నించుకేనియు వికారము నొందరు. వారి కావిచారమే తపులము.

యూపరశనాన్యాయము

యూపస్తంభమునకు రెండు త్రాఁడులు కట్టియుంచునట్లు.

రండావివాహన్యాయము

లంజెకు పెళ్ళి గిట్టనట్లు

రక్తపటన్యాయము

రంగుచీర కట్టుకొనుటచేతనే ముత్తయిదువు అని తెలియ వచ్చినట్లు.
చెప్పనక్కరలేకయే లక్షణాదులం బట్టి వాస్తవికస్థితి తెలియ వచ్చుట.

రజ్జుసర్పన్యాయము

త్రాఁడు చూచి పాము అనుకొనినట్లు.

రథకారన్యాయము

'రథకారుఁడు' అనిన వ్యుత్పత్తిసిద్ధమవు రథము చేయువాఁడు అనునర్థము గాక 'రథకారుఁడు' అను రూఢార్థమే గ్రహింపఁబడినట్లు.

"ఆధానే శ్రూయతే, వర్షాసు రథకార ఆదధీతేతి । తత్ర రథం కరోతీతి వ్యుత్పత్త్యా త్రైవర్ణికో రథకార ఇతి చేత్ । నైవమ్ సంకీర్ణజాతివిశేషే రూఢత్వాత్ । వైశ్యాయాం క్షత్రియా దుత్పన్నో మాహిష్యః । శూద్రాయాం వైశ్యా దుత్పన్నా కరణీ । తస్యాం కరణ్యాం మాహిష్యా దుత్పన్నో రథకారః । తథా చ యాజ్ఞవల్క్యః— 'మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతే' ఇతి । తస్య చ రథకార స్యాధానకాలో వర్షర్తుః॥"

వైశ్య స్త్రీ యందు క్షత్రియునివలన జనించినవాఁడు మాహిష్యుఁ డనఁబడును. శూద్ర స్త్రీ యందు వైశ్యుని వలన జనించిన స్త్రీ కరణి యనఁబడును. ఆకరణియందు మాహిష్యునివలన జనించినవాఁడు రథకారుఁడు అని చెప్పఁబడుచున్నాఁడు. ఇవన్నియు సంకీర్ణజాతులు.

'రథం కరోతీతి రథకారః' అను వ్యుత్పత్తిచే రథకారశబ్దమునకు రథము చేయువాఁడు అనియు నర్థమే. కాని రథము చేయువాఁడు అనునది గౌణార్థము; సంకీర్ణజాతిజనితుఁడు

ముఖ్యార్థము. గౌణము అనఁగా వ్యుత్పత్తిసిద్ధము; ముఖ్యము అనఁగా రూఢము. అట్టియెడ ఆధానప్రకరణమున వర్షఋతువునందు రథకారున కాధానము కావింపఁబడవలయు నని చెప్పఁబడినది.

ఇందుఁ బ్రకరణగృహీతరథకారశబ్దమునకు సంకీర్ణజాతి జనితుఁడవు రథకారుఁడా, లేక రథములు చేయువాతఁడా వాచ్యుఁడు అను శంక వొడమ—

"అవయవసిద్ధేః సముదాయసిద్ధి ర్బలీయసీ"

అవయవసిద్ధార్థముకంటె సముదాయసిద్ధార్థము అనఁగా రూఢార్థము బలవత్తరము అను పరిభాషచే పంకజమునకు అవయవసిద్ధములవు బురదలో పుట్టిన నత్త మున్నగునవి నిరాకృతములై పద్మము అను ముఖ్యార్థమే స్వీకరింపఁ బడుచున్నటుల గౌణార్థము నిరాకృతమై ముఖ్యమవు సంకీర్ణజాతివాచక రథకారుఁడే గ్రహింపఁబడవలయునని యాచార్యులచే సిద్ధాంతీకరింపఁబడినది.

ఏతావతా గౌణార్థమును వదలి ముఖ్యార్థమును బోధించు పట్ల నీ న్యాయము ప్రవర్తించును అని సారాంశము.

దీనికి 'రథకారాధికరణన్యాయము' అనియుఁ బేరు.

## రథబడబాన్యాయము

రథమును లాగు గుఱ్ఱములవలె.

రథమునకు పూన్చిన గుఱ్ఱములు లొకదాని నొకటి కలిపి కొనుచు నొకమాటగ నడచినఁగాని రథము సరిగ నడువదు. ఆలుమగ లన్యోన్యము పొరసులు లేక అనుకూలముగ నుండిన కాఁపురము రాణించును; లేనిచో జీర్ణించును.

రథ్యాదీపన్యాయము

త్రోవలో దీపము పట్టుకొని నడచునపుడు దీపపువెలుతురు దీపమున్న చోటికంటె ముందు పడును. తరువాత నచటికి దీపము వచ్చును. అపుడును దీపపు వెలుతురు ఆచోటికన్న ముందే యుండును.

రథ్యాప్రవాహన్యాయము

వీథులలోనుండి వచ్చు పిల్లకాలువ లొకటై యేఱుగా పాఱునట్లు. (లోష్టప్రస్తరన్యాయమును జూడుము.)

రశ్మితృణాదిన్యాయము

సూర్యరశ్మి గడ్డిపోరలపైఁ బడి రంగురంగులుగ చూడ ముచ్చటగఁ గాన్పించును. సూర్యకాంతమణిపైఁ బడి భగ్గున మండి చుట్టునున్న తృణాదులను తగులబెట్టించును. ఒకనికి ఒకనిమీఁద అనుగ్రహము, ఒకనిమీఁద ఆగ్రహము ఉండుట లోకస్వభావము.

రాజపుత్రవ్యాధన్యాయము

రాజపుత్రుఁడు వ్యాధుఁడైనట్లు.

తలిదండ్రులచే విడువఁబడి రాజపుత్రుఁ డొకఁడు చిన్నతనమునుండియు వ్యాధులతోఁ గలిసి పెరిగెను. వయసు వచ్చినతరువాతఁగూడ వ్యాధుఁడ ననియే ఆతనితలంపు. ఒకనాఁడు కొందఱు రాజపుత్రు లాతని గుర్తించి వాని జన్మాదికము నంతయుఁ జెప్పిరి. అపుడు వాఁడు వ్యాధత్వ బుద్ధి ద్యజించి రాజయ్యెను.

స్వస్వరూపజ్ఞానము కలిగినవెనుక వెనుకనున్న భ్రాంతు లన్నియు నశించి సంసారబంధమే తెగిపోవును.

సింహామేషన్యాయము జూడుము.

రాజపురప్రవేశన్యాయము

రాజపట్టణమున నొక్కసారిగఁ బలువురను ద్వారపాలురు ప్రవేశింపనీయరు. ఒక్కొకరివంతునమాత్రమే పోవలసి యుండును.

అదరుచు బెదరుచు నొక్కరొకరుగ రాజపురప్రవేశ మొనరించుచున్న ద్వారపాలు రట్టహాసముతో నడ్డగింతురు. అందఱు నొకసారిగ నిర్భీకులై ద్వారమునఁ బ్రవేశించిన దౌవారికులు గోడమీఁదిబొమ్మలవలెఁ జూచుచుందురే కాని కించిత్తు మాటాడరు; వారించరు.

(సంఘబలము)

రాజసేవాన్యాయము

రాజును సేవించునాతఁడు రాజునకును, రాజకుటుంబము నకును, మంత్రికిని, సలహాదారునకును, ఆశ్రితులకును,

వేయేల, రాజుగారియింటిలోనిపిల్లికినిగూడ వెఱువవలెను. లేనిచో వానికాయుద్యోగము, బ్రతుకుతెరువు నుండవు.

సేవకావృత్తిని, ఆశ్రితునకుండవలసిన నడంత నీన్యాయము సూచించును.

## రాజానుసృతవివాహప్రవృత్తభృత్యన్యాయము

పెండ్లికి పోయే రాజుగారివెంట వారిభటుఁడుకూడా పోవును.

సత్పురుషులతో బాటు వారి ననుసరించియున్నవారుకూడ గౌరవింపఁబడుదురు.

ఈశ్వరునితో బాటు శరీరమున నున్నపన్నగములును దేవతల మ్రొక్కు లందుకొనును.

## రాత్రిసత్రన్యాయము

రాత్రివేళ జేయఁబడు సోమయాగాదులకు ఫల మగతికమై ప్రతిష్ఠయే ఫలముగాఁ గల్పింపఁబడినట్లు.

"ప్రతితిష్ఠంతి హ వా య ఏతా రాత్రీ రుపయం" తీతి శ్రూయతే। తత్ర రాత్రిశబ్దే నాయుర్జ్యోతిరిత్యాదివాక్య విహితా సోమయాగవిశేషా ఉచ్యంతే। అత్ర యద్యపి ప్రతితిష్ఠంతీతి వర్తమానాపదేశాత్ సిద్ధరూపైవ ప్రతిష్ఠా ప్రతీయతే న సాధ్యరూపా । తథాపి శ్రుతాయా ఏవ ప్రతిష్ఠాయా విపరిణామేన ఫలకల్పనస్యాంతతా శ్రుతస్వర్గస్య ఫలకల్పనాపేక్షయావరత్వాత్ । యత్తదో ర్న్యనత్వాసేన

యోజనయా ప్రతితిష్ఠంతీత్యత్ర నార్థాంతరాభావేన యేచ ప్రతిష్ఠాస్సంతి తే ఏతా రాత్రీ రుపేయు రితి వాక్యవిపరిణామేన యథా రాత్రివిధిః ప్రకల్ప్యతే తథేహాపీతి "॥

మాధవీయశంకరవిజయము (8.84)

"యద్వాత్ర్పతిష్ఠాఫల......" శ్లోకవ్యాఖ్య.

విధివిధీయమానము లగు సోమయాగవిశేష రాత్రిసత్రములకు యాగఫలము లయిన స్వర్గాదికములు ప్రత్యేకముగ నుడువఁ బడకుండుటవలన విపరిణామేన సూత్రమునఁ బ్రయోగింపఁబడియున్న ప్రతితిష్ఠంతి అను పదముచేఁ బ్రతిష్ఠయే ఫలముగఁ గల్పితమవుచున్నది.

అగతికమైనపు డేదో యొక గతి కల్పించుకొనుపట్ల నీ న్యాయ ముపయుక్త మవు నని పరిణామము

రామఠకరండన్యాయము

ఇంగువపెట్టెలోని యింగువ తీసివైచినను వాసన యెన్నఁటికిని పోనట్లు.

తాత్కాలికముగ కించుదన మాపాదించినను వెనుకటివాసి పోదు.

రాసభరటితన్యాయము

గాడిదఅఱపు మొదట దీర్ఘమై పోనుపోను సన్నగిలును.

(ఆరంభశూరత్వము) దుర్జనస్నేహము నంతియే.

పరాహ్ణచ్ఛాయాన్యాయమును జూడుము.

రాసభరుతన్యాయ మనియు దీనికిఁ బేరు.

## రాహుశిరోన్యాయము

రాహుశిరఃస్వరూపనిర్ణయము లేనట్లు.

రాహువుశిరస్సు పాముఅనియు; అదొక ఛాయాగ్రహమనియు; కాదు, రాక్షసుఁడనియు ననేకు లనేకరీతులఁ జెప్పుచుందురు. కాని అందేదియో ఇంతవఱకును దేల లేదు. తేల్చువారును లేరు.

సందేహాస్పదములై వాదప్రతివాదములలో నున్న విషయములయం దీన్యాయ మనయుక్తము.

## రుమాలశునార్ఘన్యాయము

ఉప్పుకొటారులో ఉల్లిపాయధర ఎంత అన్నట్లు.

"రాజన్ రుమాయాం లశునస్య కో౽ర్ఘః? — ఒక బ్రాహ్మణుఁ డొకయింటికి మాధుకరమునకుఁ బోయెను. ఇంటియజమానురా లాయనను జూచి ఎదురేగి—రాజా! ఉప్పుకొటారులో ఉల్లిపాయధర ఎట్లున్నది? అని ప్రశ్నించెనఁట."

సంబంధములేని మాటలు అని భావము.

## రుమాక్షిప్తకాష్ఠన్యాయము

ఉప్పునేలలో పాతిపెట్టఁబడిన చెట్టువలె.

ఉప్పురసమున బెరిగి ఈలకూరవలె నదియు ఉప్పగనే ఉండును.

"యథా రుమాయాం లవణాకరేషు,
మేరౌ యథా ప్రాజ్జ్వలరుక్మభూమౌ।
యజ్జాయతే తన్మయమేవ తత్స్యా
త్తథా భవేద్వేదవిదాత్మతుష్టిః."

తంత్రవార్తికము

ఉప్పుభూములలో మొలచినచెట్లు, బంగారుతో నిండి యుండు మేరువుపైనఁ బుట్టిన తరుగుల్మలతాదులు తన్మయములు అనఁగా ఉప్పువికారములు, బంగారువికారములు అయినట్లే వేదవేత్తయొక్క ఆత్మతుష్టి తన్మయమే అవును.

## రూపసామాన్యన్యాయము

రూపసామాన్యముచే రెండు వస్తువుల నొకటిగాఁదలంచుట.

'ఆఁ. మేము కొనిన చీరెలే ఇవి'. అనఁగా—మేము కొనిన చీరెలుకూడ ఇట్లే యుండును అని భావము.

## రేఖాగవయన్యాయము

రేఖలతో నుండునదే గవయ మృగ మనుకొనినయతఁడు తుదకు గవయమును నెఱింగినయట్లు.

"కీదృశో గవయ ఇతి గ్రామీణేన పృష్టో వన్యో (గవయం) లిఖిత్వా దర్శయామాస। స చర్జుబుద్ధిత్వా ద్రేఖాగవయ మేవ గవయం మేనే। పశ్చా ద్వనే గవయం దృష్ట్వా రేఖాయాం తద్బుద్ధిం తత్యాజేతిలౌకికీగాథా। 'తద్వైషపురుష'

ఇత్యాది శ్రుతేః పూర్వోక్తానభిజ్ఞతయానాత్మాన మేవాత్మతయా జానీతే గురుశాస్త్రోపదేశేనాత్మని జ్ఞాతే తదాత్మబుద్ధి మపవదతి॥"

ఒకపల్లెటూరివాఁడు 'గవయమృగ మెట్లుండును' అని యొకయాటవికుని ప్రశ్నించెను. అతఁడు ఇట్లుండు నని నేలపై గీతలు గీచి (గవయమృగాకారమును) చూపెను. పల్లెటూరివాఁడు గీతలతో నుండునది గవయమృగము అను నిశ్చయముతో నుండెను. ఒకనాఁ డడవికిఁ బోవుట తటస్థించి జానపదుఁడు యదృచ్ఛగ నచట గవయమృగమును జూచి ప్రక్కనున్నతోడివారలవలన నది గవయమని యెఱింగికొని "గీతలతో నుండునది కాదు గవయమన; ఇదిగో, ఇట్లుండును" అని వెనుకటి రేఖాగవయబుద్ధిని త్యజించెను.

అదేవిధమున— "అయ మాత్మా పురుషః" మున్నగు శ్రుతివాక్యములచే ఆత్మ నెఱుంగని యజ్ఞాని అనాత్మయం దాత్మత్వ మారోపించుకొనియుండి గురూపదేశానంతరము యథార్థమగు నాత్మస్వరూపము నెఱింగి జ్ఞానియై వెనుకటి అనాత్మాత్మత్వబుద్ధిని వదలివైచును.

స్థూలారుంధతీ న్యాయముగ అనఁగా — మంచపుపట్టె నక్షత్రములక్రిందిభాగమున వంకరగానుండు మూఁడుపెద్ద నక్షత్రములలో మధ్యనక్షత్రముప్రక్కన మినుకు మినుకు

మనునది అరుంధతీనక్షత్రము అని చెప్పిన చూడకయే 'ఆ తెలిసినది' యని ప్రతిపెద్ద నక్షత్రము ప్రక్కను మినుకు మినుకు మను నదెల్ల నరుంధతిగా శంకించునాతఁడు ప్రత్యక్షముగ ఫలానా నక్షత్ర మరుంధతి యని చూపించిన చూచి వెనుకటి అనరుంధత్యరుంధతీత్వమతి నావలకొత్తి యాథార్థ్య జ్ఞానమున స్వస్థచిత్తుఁ డవునట్లు.

రోగిన్యాయము

రోగి నమసిన రోగము నయితము నమయును.

లతావృక్షన్యాయము

చెట్లుఅండ లేనిచో తీగ నిలఁబడఁజాలక నేలఁబడును. పురుషుఁడు లేనిచో స్త్రీ అధోగతి నొందును.

లపోరశంఖన్యాయము

శంఖముతీరున నూరక మ్రోగడమే.

క్రియమాత్రము శూన్యము అని భావము.

లవణామలకీయన్యాయము

సముద్రపుటుప్పు అడవియుసిరికాయ కలసినట్లు.

కు చే. 2.78.

" कहाँ का ईंट, कहीं का गोरा, भानमती ने कुनबा जोडा "

అని హిందీసామెత.

లశునభక్షణన్యాయము

ఆశపడి వెల్లుల్లి తినినా రోగము పోలేదఁట.

"కృతేఽపి కేశసంస్కారే భార్యాత్వం నైవ ముంచతి"
ఇష్టము లేక తల గొరిగించుకొనినను ఫలానా ఆయన భార్య అనుమాట పోలేదఁట.

లాంగూలతరణన్యాయము

కుక్కతోఁక పట్టుకొని గోదావరి నీఁదినట్లు.

'కుక్కతోఁక పట్టి గోదావరీఁదునా'

వేమన.

తెప్పతో సముద్రముదాఁట ప్రయత్నించినట్లు.

లాక్షారసావసిక్తకార్పాసబీజన్యాయము

ఎఱ్ఱరంగులో నానవేసి నాటిన ప్రత్తిగింజలనుండి ఎఱ్ఱని ప్రత్తి పుట్టును.
కర్మానుసారముగ శుభాశుభఫలములు కలుగును.

లూతాతంతున్యాయము

సాలెపురుగు తననోటినుండి తానే దారమును పుట్టించి ఆదారమును మఱల తనపొట్టలో నింపుకొనుచుండును.

పరమాత్మ స్వేచ్ఛచే ప్రపంచములను తనంతన తా సృజించి ప్రళయావసరమున తనలో లీనము చేసికొనును.

"మహా న్తూర్ణనాభి ర్యథాఽఽస్యా
త్సమస్తం సృష్ట్వాత్మమాయాసహాయః,
స్వకుక్ష్యన్త ర్లీన మేత త్కరోతి
పరం ధామైశం య దీడ్యం త దీడే."

వ్యాఖ్యాతల రామలింగేశ్వరస్తవమునుండి.

లోష్టప్రస్తారన్యాయము

(ప్రస్తారశబ్దము ప్రస్తరశబ్దరూపాంతరము. కావున శిలార్థకము)

(స్వాభావికముగ) గట్టిదే యైనను మంటిబెడ్డ శిలకంటె మెత్తనిదే.

అశ్మలోష్టన్యాయమును జూడుము.

చిన్న చిన్న మంటిబెడ్డలు చేరి సంఘాతమై యొక శిలగా తయారగును.

చిన్న చిన్న కాలువలు కలసి పెద్ద యేఱుగా ప్రవహించినట్లు. రథ్యాప్రవాహన్యాయమును జూడుము.

(లోష్ట మనఁగా బిందువు. ప్రస్తార మనఁగా ఒకచోఁ గలిపి విస్తరింపఁజేసిన పట్టిక [table])

ఒకబిందువును మధ్యనునిచి తత్పరికరముచే ఖండమేరు, మేరు, నష్టోద్దిష్టాది విధానముల ప్రస్తారము చేసినట్లు.

ఉదా:— గణప్రస్తారము, స్వరప్రస్తారము, శ్రీచక్రప్రస్తారము మున్నగునవి.

కుమ్మరి మట్టితో అనేకపాత్రలను దయారు చేసినట్లు ఈశ్వరుఁడును తనప్రపంచములో ప్రకృతిని అనేకరూపములఁ జిత్రించుచుండును.

దీనిని 'లోష్టప్రస్తరన్యాయము' అనియు నందురు.

అట్టిచో ప్రస్తరము = ప్రస్తారము అని యెఱుఁగ నగును.

### లోష్టలగుడన్యాయము

మట్టిముద్ద, కఱ్ఱమాదిరి.

కుమ్మరి మట్టిముద్దను కఱ్ఱతోఁ గొట్టి కుండలు తయారు చేయును.

బాధించువాఁడు, బాధింపఁబడునాతఁడు నొకచో వచింపఁబడు సందర్భమున నీన్యాయ ముపయుక్తము.

### లోహకపాలన్యాయము

లోహపుపాత్రలవలె.

అభేద్యములుఅని ఆశయము.

పురోడాశకపాలములకు నూతన మృత్కపాలములే విహిత ములు కాని లోహకపాలములు కావు.

"య న్నవే భాజనే కార్యం నాన్యథా కర్తు మర్హతి"

(కావున అవిహితములవుట లోహకపాలములవలె) అయోగ్యములు అగుచో నీన్యాయ ముపయుక్తము.

### లోహఘటన్యాయము

లోహపుకుండవలె. (అభేద్యము)

ఇనుపకుండకు ఉూతి తెడ్డు అన్నట్లు.

లోహచుంబకన్యాయము

అయస్కాంతము ప్రత్యేకము తనప్రభావముచూపజాలదు. ఇనుమును దగ్గఱ పెట్టిన నాకర్షించి దానినిఁగూడా అయస్కాంతముగ మార్చివైచును.

లోహాగ్నిన్యాయము

అగ్నిసాహచర్యమున లోహముకూడ అగ్నిధర్మములతోనే ఒప్పును.

“సంసర్గజా దోషగుణా భవన్తి.” అట్లే సుగుణములుగూడ.

వజ్రలేపన్యాయము

వజ్రపుపొడితోఁ బూతపూసినవస్తువువలె.

అతిదృఢముగా నున్నదని చెప్పుట.

గోడకు సిమెంటు చేసినట్లు.

వటబీజన్యాయము

విస్తారమయిన వటవృక్షమునకు విత్తన మతిస్వల్పమైనట్లు.

“ విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత ”

వేమన.

వటేయక్షన్యాయము

మఱ్ఱిచెట్టుపై యక్షుఁ డున్నాఁడు అనఁగా భూత మున్నది అని చెప్పిన నిజానిజముల విచారము లేకయే వెఱచి పఱచినట్లు.

"ఐతిహ్యాం తు న సత్య మత్ర హి వటే యక్షో స్తివా నేతివా। కిం జానాతి కదాచ కేన కలితం యక్షస్య కీదృగ్వపుః॥"

వటము నాశ్రయించి యక్షుఁ డున్నాఁ డని లోక ప్రతీతియే గాని నిజముగా ఉండెనో లేదో విచారించిన వారుగాని, వానిస్వరూపాదివిచార మొనరించినవారుగాని, చూచినవారుగాని లేరు. కేవల ప్రతీతి మాత్రమునన లోకము వెలుచుచున్నది.

కావున, అనిర్ణీతమై కేవలపురుషవచనపరంపరాగతమైన కింవదంతి ప్రమాణము గాఁజాలదు. అయథార్థమై అనిర్ణీతమై శాబ్దబోధామూలకమైన నిశ్చయము ప్రమాణము కాదు అని భావము.

కేవలప్రతీతులను నిజానిజము లరయక నమ్మి ఆయాకార్యములలోఁ బ్రవర్తించు టనుచిత మని యీన్యాయము యొక్క లౌకికాశయము.

వత్సక్షీరన్యాయము

పాలు అచేతనము లయ్యు దూడకు వృద్ధికారణమైనట్లు.

రూపకల్పన మొనరించికొని చేయఁబడిన సగుణోపాసన క్రమముగ మనస్స్థైర్యమునకు మూలమై నిర్గుణోపాసనా దార్ఢ్యము నొడగూర్చును.

## వదతోవ్యాఘాతన్యాయము

తాను చెప్పుచున్నదానికి తానే వ్యాఘాతము తెచ్చికొనినట్లు.

స్వవచనవ్యాఘాతమని తాత్పర్యము.

నే నిపుడు బ్రదికియున్నానో లేదో !

మూడుగంటలబండి ఎన్ని గంటలకు వచ్చును ?

## వధూమాషమాపనన్యాయము

కోడలిచే మాషములు (ధాన్యవిశేషము) పంచిపెట్టించినట్లు.

వచ్చినబిచ్చగాని కెల్ల బిచ్చము పెట్టుచుండుట కోర్వక లోభియవు నొకపాఱుఁడు ఒక్కొక బిచ్చగానికి పిడికెఁడు వంతున ముష్టి వేయునట్లు భార్యకు కట్టడి చేసెను. అట్లు కొన్ని దినములు జరిగినపిదప భార్యపిడికిలి పెద్దదికావున నెక్కువధాన్యము పట్టు నను నూహచే భార్యను నిషేధించి బిచ్చము పెట్టుపనికి కోడలిని నియోగించెను. ఆమె పిడికిలి చిన్నదే. కాని, ఆమె చాల అందకత్తె యవ్వుట నామెం జూచునిచ్చ నయినవారు, కానివారుకూడ బిచ్చమునకు వచ్చుటచే మామూలుకంటె నెక్కువ ధాన్యము ఖర్చు కాఁజొచ్చెను.

అధికవ్యయ మభిమతము కామి నది వారింప భార్యను నియోగించియు నిష్టావాప్తి కనుపడమిఁ గోడలిని.. బురి

కోల్పిన పాలునకు వ్యయము తగ్గకపోగా పైపెచ్చు మిక్కుటమయ్యెను.

రెండవమా ఆనరించిన ప్రయత్నముచే ఆవిప్రుని భార్యా నియోగరూపమవు మొదటిప్రయత్నము సర్వథా బాధింప బడెను. అనఁగా నిష్ప్రయోజనమయ్యెను.

అట్లే- సంప్రాప్తమయిన అనిష్టమును పోఁగొట్టుకొనుటకై వేఱొకప్రయత్నం బోవ ననిష్టనివృత్తి కలుగకపోవుటయే గాక మొదటి యనిష్టమే వెనుకటికంటె మిక్కుటమవుపట్ల నీన్యాయ ముపయోగింపఁబడును.

వధ్యఘాతకన్యాయము

వధింపఁబడువారు, వధించువారు నొకేచోట నుండరు. సహజవైరులవు పాములు, ముంగిసలు; ఎలుకలు, పిల్లులు; మున్నగునవివలె. అంతియగాక—

ఇచట పాములెక్కువగ నున్నవి అనిన ముంగిసలు లేవు అని స్ఫురించును. ముంగిసలు ఉన్నయెడల పాము లధిక ముగ నుండు టసంభవము. అట్లే ముంగిస లిచట నెక్కువగ నున్న వనిన పాములు తక్కువ అని చెప్పకయే తెలియ వచ్చును. అట్లే ఎలుక లెక్కువగ నున్నవనిన పిల్లులు తక్కువ యనియు, పిల్లు లెక్కువ యనిన ఎలుకలు తక్కువ యనియు చెప్పకయే ఆయావాక్యములచేత ఆక్షిప్తము లవుచుండును.

అర్థః— సత్త్వాది పదములవలన పరమార్థత్వాదికప్రతీతి కలిగి, ప్రతీతపరమార్థత్వాదివిరోధియగు నసత్యత్వాదికము యొక్క అభావ మర్థాక్షిప్త మగును.

విరుద్ధపదార్థము లొకేయెడ నుండవు అనిన్యాయప్రవృత్తి లక్షణము.

## వనవ్యాఘ్రన్యాయము

వనము పెద్దపులిని, పెద్దపులి వనమును రక్షించుకొనునట్లు. అన్యోన్యసంరక్షకత్వము.

వ్యాఘ్రము లేనియెడల అందఱకుఁ బ్రవేశము కలిగి వనము నాశనమగును. వనము లేనియెడల నిలువ నునువగు మఱుగు లేక వ్యాఘ్రము వ్యాధులబారింబడి నశించును.

## వనసింహన్యాయము

వనవ్యాఘ్రన్యాయమువలెనే.

"కిరాతైర్హన్తుం శక్యోఽపి సింహో మహద్వనం శరణం ప్రవిశ్య దురాధర్ష స్తేభ్యో నబిభేతి, వనంచ తత్సింహాధిష్ఠానానుగృహీతం తైర్దుష్ప్రవేశం భవతి."

కిరాతులకంటఁబడి సులభముగ జంపివేయఁబడ సిద్ధముగ నుండియు సింహము వనప్రవేశ మొనరించెనేని దురాధర్షమై వారలకు వెఱువక మహాపరాక్రమవంత మగును. వనము సయితము సింహాధిష్ఠానమున కిరాత దుష్ప్రవేశమై నెగడును.

"నస్యాద్వన మృతేవ్యాఘ్రా న్వ్యాఘ్రా నస్యు ర్ఋతేవనమ్,
వనం హిరక్ష్యతే వ్యాఘ్రై ర్వ్యాఘ్రాన్ రక్షతి కాననమ్."
ప్రహ్లాదనక్రన్యాయమును జూడుము.

వనచంద్రికాన్యాయము

అడవిఁ గాచిన వెన్నెల.

వన్ధ్యాపుత్రన్యాయము

గొడ్డురాలి కొడుకు అన్నట్టు.

గొడ్డురాలికి కొడు కెచటనుండి వచ్చును ?

శశవిషాణము, మూషకవిషాణము, గగనారవిందములవలె అసంభవమని భావము.

వరగోష్ఠీన్యాయము

నలుగురూ కలిసి వరనిశ్చయము చేసికొనినట్లు.

గోష్ఠి అనఁగా పలువు రొకచోఁ గూడి పరస్పర మొక యంశముపై మాట్లాడుట. కన్యావరనిశ్చయసమయమున బంధుగు లెల్లఱుఁ గలిసి ఎవరికిఁ దోఁచినట్లు వారుచర్చించి ఔ ననియో కాదనియో తుద కొక నిశ్చయమునకు వత్తురు. దానినిఁ బట్టి వివాహము నడచును. అట్లు ఒకనిశ్చయమునకు రాక వాదోపవాదములు అంత కంతకు మితిమీఱుచున్న వివాహప్రసక్తియే యుండదు.

చేతనేంద్రియములే ఆత్మ యని కొందఱు; చక్షురాది మనఃపర్యంతములవు చేతనేంద్రియములలో నే యొకటి శరీరమున నభావమైనను రూపాదిజ్ఞానము కలుగకుండుట

వలన వ్యస్తముగ నొకొక యింద్రియమునకుఁ జేతనత్వ మును, అహంప్రత్యయవిషయత్వమును కలుగునని యెంచి తత్సంఘాతాత్మకత్వమును మఱికొందఱు నిరసింతురు. మఱి కొందఱు మఱొకరకమున. తుదకు వారంద ఱొకనిశ్చయ మునకు వచ్చినఁగదా ఆత్మస్వరూపనిర్ధారణము ! అట్టిపట్టుల నీన్యాయ ముపయుక్తము.

వర్చోన్యాయము

అగ్ని హోత్రుని జయము నిమ్మని కోరినట్లు.

"మమాగ్నే వర్చో విహవే ష్వస్తు"

జైమిని (కరణాధికరణమంత్రము)

అనుచో—మమ విహవేషు వర్చః అస్తు అనునన్వయమున "నాకు విహవములయందు జయము అగుఁగాక" అనియు; "నాయొక్క విహవములయందు జయము అగుఁగాక" అనియు రెండువిధముల నర్థము సిద్ధించుచున్నది. మొదటి పక్షమున జయము హోమకర్తకును, రెండవపక్షమున యమద్దిష్టమై ఆహోమాదికములు ప్రవృత్తములయ్యెనో వానికిని చెందుచున్నది. అట్టియెడ నేయర్థ మనుసరణీ యము అని శంక వొడముచున్నది.

"కరణాధికరణప్రపఠితమంత్రములకుఁ గర్త్రాద్దేశమే కాని యన్యోద్దేశము కా"దను నిర్ధారణమున గర్తకే ఆజయము చెందవలెనని పైశంక వారింపఁబడుచున్నది. ఏతావతా కర్మకాండకు యజమానుఁడే ఆయాఫలముల ననుభవింప వలయు నను నుద్దేశము రూఢమగుచున్నది. కావున—

స్వార్థబుద్ధితోఁ గర్మములు ప్రవర్తించుపట్ల నీన్యాయ ముపయోగింపఁబడును.

కొందఱు అస్వార్థక్రియాకలాపమునకే ఈన్యాయము చెల్లు నందురు.

వలీముఖనారికేళన్యాయము

కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.

నడివయసుగల యొయ్యారి రసికునకైన రాణించుంగాని మూర్ఖునిఁ జేపట్టిన—

"......... రాజనిష్కాభ్యంతరనారికేళఫల మబ్బిన వానరుఁ డేమి చేసెడుఁ?"

కొక్కోకము.

వస్తుశక్తిన్యాయము

వస్తువుయొక్క బలాబలములు దానిశక్తి ననుసరించి ఏర్పడును.

క్రియమాణములవు కార్యములయొక్క ఫలాఫలములు ఆక్రియల మంచిచెడ్డలనుబట్టి కలుగును.

వహ్నిన్యాయము

ఒకవహ్నియే అనేకరకముల పనులు చేసినట్లు.

ఒకప్పు డది వంట చేసికొనుట కుపయోగించును; ఒకపుడు వెలుతురు నిచ్చును; ఒకపుడు పురగ్రామాదులను దహించును.

భామతి న్యాయమును జూడుము.

వహ్నిధూమన్యాయము

పొగను జూచి నిప్పున్నదని తెలిసికొనుట.

"వహ్నిమాన్ పర్వతః" "ధూమవత్త్వాత్" పొగ వచ్చుచున్నది గావున కొండపై అగ్ని పుట్టినది అనిగురుతించుట. పొగ వచ్చుచున్నదే, వహ్ని యున్నదా ఏమి? అని తొలుత అనుమానము; పిదప, వహ్నిలేనిదే పొగ యుండదు కావున తప్పక వహ్నియున్నది అని నిర్ధారణము.

కారణముచే ననుమానించి కార్యము నూహించుట యని న్యాయతాత్పర్యము.

వహ్నివిస్ఫులింగన్యాయము

అగ్నినుండి అగ్నికణములు బయలుదేరినట్లు.

అగ్నినుండి బయలువెడలిన విస్ఫులింగములు తదగ్న్యంశములేకాని అగ్నిభిన్నములు కావు.

అట్లే పరమాత్మనుండి రకరకముల సృష్టులు బయలుదేరుచున్నవి. అవన్నియు నాతని కళామాత్రములేగాని తద్భిన్నములు గావు.

( "సోఽకామయత, బహు స్యాం ప్రజాయేయేతి" ఆ పరమాత్మయే "నేను అనేకరూపములు గలవాఁడ నయ్యెదను" అని కోరి వివిధరూపములుగ తనను విభజించికొనినట్లు శ్రుతులు నొడువుచున్నవి. కావున తదభేదము సర్వథా సుసిద్ధము.)

నీటినుండి చిందిన నీటిబిందువులు నీరే అయినట్లు.

వాక్యార్థప్రతిపత్తిన్యాయము

వాక్యార్థము స్పష్టమై యున్నట్లు.

వాఙ్నియమన్యాయము

వాక్కులు నియమితములై యున్నట్లు.

(ఈ రెండును అలౌకిక న్యాయములు)

వాజిమందురాన్యాయము

మందురా అనగ గుఱ్ఱములుండుశాల.

అయినను వాజిమందురా అని అదియే అర్థమున నుపయో గింపఁబడుచున్నది.

కరకంకణ, నీలేందీవర, మృగవాగురాన్యాయములట్లు.

వాతప్రదీపన్యాయము

గాలిలోని దీపమువలె.

నివాతస్థదీపన్యాయమున కియ్యది విరుద్ధము.

వాతాదిన్యాయము

వాత, పిత్త, శ్లేష్మములవలె.

వాతపిత్తశ్లేష్మములు పరస్పరవిరుద్ధము లయ్యు సమాన ముగ కలిసియుండి శరీరమును రక్షించుచుండును. దేనిలో హెచ్చుతగ్గులు కలిగినను శరీరమునకు భంగము కలుగుట తప్పదు.

సజ్జను లెన్నఁడు నెట్టి హానియుఁ గలుగనీక పరులశ్రేయస్సు నకే పాటుపడుచుందురు.

**వాయుభక్షణన్యాయము**

వాయువుమాత్రమే భక్షించినట్లు.

"వాలఖిల్యాదులు వాయుభక్షణ చేసి అనేకవేల సంవత్సరములు తపస్సుచేసిరి" అనిన గాలి శరీరములోనికి తీసికొనని ప్రాణియే లేదు. అట్లు గాలిని తీసికొనుటను గాలి పీల్చుట అందురు భక్షించుట అనగ శరీరపోషణమునకవసరమగు నాహారమును భుజించుట అనియర్థము. కావున వాలఖిల్యాదులు తక్కిన ప్రాణులవలెగాక యితరపదార్థాసక్తి త్యజించి కేవల వాయుభక్షణమాత్రముచేత దేహము నిలుపుకొనుచు తపస్సు చేసిరి అనిభావము.

బాహ్మణగ్రామ, ఆమ్రవణ, మున్నగు న్యాయముల కీన్యాయము విరుద్ధము. స్వార్థమే తక్క అన్యవస్తువు నుద్బోధించదు.

అబ్భక్షణము, పర్ణభక్షణము మున్నగునవి జూడుడు.

**వాయుశైత్యోష్ణ్యన్యాయము**

వాయువునకు చల్లదనము, వేడి, ఆరోపించినట్లు.

వాయువునకు గుణము స్పర్శము. అయినను ఆయాసమయములందు జల్లదనము, వేడి సంక్రమించుచుండును.

జలౌష్ణ్య, భూశైత్యోష్ణ్య న్యాయములను జూడుము.

**వార్తాహరన్యాయము**

పాముమంత్రములలో అనేకరకములు కలవు. పాము కఱచి నది అని తెలిసినవెంటనే కొందఱు పైయుత్తరీయమును

చించినైతురు. కొందఱు కఱువఁబడినవానిచెవిలో మఱొక నిచే 'పాఱిపో' అని చెప్పింతురు. మఱొకరకము కలదు: పాము కఱచినది అని వార్త తెచ్చినవానిని మంత్రగాడు వెనుకముందు లాలోచింపక దౌడ పగులునట్లు కొట్టును. ఆదెబ్బతో కఱువఁబడినవానికి బాధ తగ్గిపోవును. దెబ్బ ఎంతతీవ్రముగ తగిలిన అంతత్వరలో బాధ తగ్గును. వాని పాముకాటు వీని దౌడపాటునకు కారణ మగును.

(వెంకిపెళ్ళి సుబ్బిచావుకు వచ్చెనన్నట్లు)

## వాలకర్కటకన్యాయము

నక్క తనతోఁక పీతకన్నములోఁబెట్టి అది పట్టుకొనఁగా నీవలికిలాగి తినును.

దుర్మార్గుఁడు మంచివాఁడువలె సంచరించుచు అవకాశము లభించిన వెనువెంటనే హానిచేయును.

## వాలిసుగ్రీవన్యాయము

వాలిసుగ్రీవులలోని తారతమ్యమువలె.

"వాలిసుగ్రీవులు పోరుచుండ సుగ్రీవుని పక్షమునఁ జేరి శ్రీరాముఁడు దాగియుండి కొట్టుటవలన వాలి చనిపోవలసి వచ్చెను." అనిన వాలి సుగ్రీవునికంటె బలవంతుఁ డగుట యేగాక 'దాగియుండి' అనుటవలన శ్రీరామునకును అజయ్యుఁడు అని ద్యోతమాన మవుచున్నది.

అట్లే— "కౌరవులు, పాండవులు సమానబలము గలవారలే కాని, పాండవులకు శ్రీకృష్ణునిసాయము గలదు." అనిన, శ్రీకృష్ణుఁడు సాయపడుటవలనఁ బాండవులకంటె కౌరవులు బలహీనులైరని తెలియవచ్చుచున్నది.

ఉద్దిష్టవిషయములందు చెప్పకయే పదవాక్యబలమున న్యూనాధిక్యములను స్ఫురింపఁజేయుతావుల నీన్యాయ ముపయోగింపఁబడును.

వినిగమనన్యాయము

ఒకవస్తువును రెండువిధముల సాధింప నవకాశమున్నను ఏవిధమైన వైరుధ్య మెన్నటికిఁ గలుగకుండుటకై ఒకేరక మున సాధించవలెనను నియమమునకు వినిగమన మని పేరు.

జ్యోతిర్గణితమును సూర్యసిద్ధాంతము ప్రకారముగను దృగ్గణితపద్ధతిని చేయవీలున్నను నిరుమతములవారు పోను పోను వైరుధ్యము కలుగక పరిణామ మొకటియే యగుట కొఱకే త్రోవ ననుసరింపవలయునని వ్యవస్థచేసినట్లు.

సూర్యసిద్ధాంతమునకును, దృగ్గణితమునకును గ్రహస్థితు లలో కొన్నిభాగలు తేడా వచ్చుచునేయుండును. ఆ తేడా లేకుండుటకే పైవ్యవస్థ. ఇట్లే తక్కినపట్లఁగూడ నెఱుంగునది.

విప్రతిషేధన్యాయము

రెండుకార్యములకు తుల్యబలవిరోధములు వచ్చినప్పుడొక దానిని విడిచి బలవత్తరమవు రెండవదాని నాశ్రయింపవలెను. ఇది వ్యాకరణమర్యాదయందలిది.

విశ్వజిన్న్యాయము

విశ్వజిద్యజ్ఞఫలితమువలె.

"విశ్వజిత్తు" అను నొక యజ్ఞము కలదు. ప్రపంచము నంతయు జయించి ఈయజ్ఞమును చేసి తిరిగి సర్వస్వము దానము చేయవలెను. ఇట్లాచరింపఁబడిన విశ్వజిదధ్వరమునకు ఫలము విశ్వవిజయమా, లేక స్వర్గమా? అన సర్వయజ్ఞఫల మవు స్వర్గమే అని నిర్వచింపఁబడినది.

" అనాదిష్టఫలే కర్మణి స్వర్గః ఫలమ్ । అనుపదిష్టఫలస్వరూప మవు కర్మమునకు స్వర్గమే ఫలము"— ఎట్లన— "స్వర్గఫలేషు కర్మసు కర్తవ్యేషు ఫలవచనం నైవోచ్చారయన్తి గమ్యత ఏవేతి. కర్తవ్యములై స్వర్గఫలములైన కర్మములకు ఫలవచనము నుచ్చరింపరు. అయినను అనుషంగమున స్వర్గఫలమే తెలిసికొనఁబడును."

చెప్పఁబడకయే అనుషంగమున నాయాకర్మముల శుభాశుభఫలితములు తెలియనవును.

విషకీటన్యాయము

విషములో పుట్టినపురుగు విషమే తిని జీవించునట్లు.

విషకృమిన్యాయము

విషములో పుట్టినపురుగు విషమే తిని జీవించునట్లు.

చాణక్య నీతిదర్పణమున నీన్యాయము నుదోబ్భధించుచు నిట్లు నుడువఁబడియున్నది.

"విప్రాస్మి న్నగరే మహాన్ కథయ కః ?
తాలద్రుమాణాం గణః;
కో దక్షః ?
పరవిత్తదారహరణే సర్వోఽపి పౌరో జనః;
కో దాతా ?
రజకో, దదాతి వసనం ప్రాత ర్గృహీత్వా నిశి;
తత్కిం జీవసి హేసఖే ?
విషకృమిన్యాయేన జీవామ్యహమ్."

ఒక బ్రాహ్మణుఁ డొకయూరికి యాచనకై యేఁగి యూరి వెలుపల కాన్పించిన బ్రాహ్మణుని యూరి పరిస్థితులు దెలిసికొనుతలంపున నిట్లు ప్రశ్నించెను. వెనువెంటన ఆబ్రాహ్మణుఁడుకూడ సమాధానము నిచ్చెను.

"ఓ విప్రుఁడా ! ఈయూరిలో నందరికన్న గొప్పవాఁ డెవఁడు? "

"అదిగో, ఆకనఁబడు తాడితోపు."

"ఇచట సమర్థుఁ డెవఁడు? "

"పరుల ధనమును, భార్యలను అమాంతముగ దొంగి లించుటయం దీయూరివా రందఱును సమర్థులే."

"పోనీ, దాత ఎవఁడో వినిపింతువా ?"

"చాకివాఁడు. అతఁడొకఁడే ఈయూర మహాదాత. ఎందువలన నందువా ? ఉదయము తీసికొనిపోయిన గుడ్డలను రాత్రికి మఱల తెచ్చియిచ్చుచున్నాఁడు."

"అయిన నీయూరిలో నెట్లు జీవించుచున్నావోయి?"

"అయ్యా! ఏమి చెప్పను ? విషకృమిన్యాయముగా జీవించుచున్నాను.

అనఁగా యీయూరఁ బుట్టినవాఁడ నగుటచే నిచటిప్రకృతి కలవాటుపడి బ్రదుకుచున్నాను అని భావము.

విషములోనిపురుగునకు విష మిష్టాహారమే. ఆవిషము దాని కేమియు హాని చేయదు; కాని, యితరులకుమాత్రము హానికర మవును.

"*What is one man's food is another man's poison*".

"ఒకనికి ఆహార మయిన వస్తువు మఱొకనికి విషమగును." ఒకరిమేలు మఱొకరికి కీడు.

పై విషకీటన్యాయము, ఈ విషకృమిన్యాయము రెండు నొకటియే.

విషభక్షన్యాయము

విషమును తిని జీవించునట్లు.

అపాయకరమైనను విషమును కొంచెము కొంచెముగ తినుట అలవాటుచేసికొనిన క్రమముగ అదే పరిపాటియై తుదకు విషమే తిని ప్రాణధారణము జేయ కారణ మవును.

అట్లే - దుర్మార్గాచరణమును తొలుత కొంచెముకొంచెముగ నారంభించిన పరిపాటియై తుద కదియే తన వృత్తిగ మాఱును.

విషయసూచికాన్యాయము

విషయసూచికను జూచియే గ్రంథమందలి యంశముల నెఱింగికొనినవిధమున.

ముఖమును జూచియే కలపరిస్థితుల గుర్తించు మచ్చున. చెప్పకయే తనంత తా స్పష్టమవుపట్ల నీన్యాయప్రవృత్తి కలుగును.

విషవృక్షన్యాయము

విషపుచెట్టునువలె.

"విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్"
కుమారసంభవము

విషవృక్ష మయినను స్వయముగ పెంచి తనచేతులార నఱికి వేయ యోగ్యము కాదు.

ఉదా:- తార్కికమతమున—

"ఏతే సర్వే తర్కాః......అస్మాభి రేవ తర్కపదవ్యా మభిషిక్తా స్తతో న ప్రబన్ధేన నిరస్యన్తే "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్"

ఈతర్కము లన్నియు మాచేతనే తర్కపదవియందుం జొప్పింపఁబడినవి. కాన (మాచేతనే) ప్రబన్ధమున నిరసింపఁ బడవు. స్వయంసంవృద్ధమయిన విషవృక్షము సయితము తనకు నఱుక నయోగ్యముగదా !

అట్లే—దుర్మార్గుఁ డయ్యును కన్నకొడుకు తండ్రి కవధ్యుఁడు.

ఇదియే మఱొకచో—

"హా హా మయేదం నో చారు కృతం యత్సుతభర్త్సనమ్,
విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్"

అని చెప్పఁబడి యున్నది.

విహగన్యాయము

పక్షి సూటిగ చెట్టుపై కెగిరినట్లు.

చెట్టుపైనున్న ఫలము ననుభవింపవలెనని పక్షి వెంటనే సూటిగ నెగిరి పండుదగ్గరకుఁ జేరి యాపండు తినును.

అట్లే—పూర్వజన్మకృతకర్మఫలమును జీవుఁడు వెంటనే అందుకొని అనుభవించును.

విహంగన్యాయ మనియు, విహంగమన్యాయ మనియుఁ గూడ దీనికిఁ బేర్లు.

వీచితరంగన్యాయము

వాయువశమున సముద్రమందు మొదట చిన్నచిన్న తరంగములు పుట్టి క్రమక్రమముగ అవి కలియుచు పెద్దవై తుదకు పెద్దపెద్ద కెరటములుగా తయారయినట్లు.

ఆకాశమునఁ బుట్టిన శబ్దము గాలితోఁ గలిసి విస్తృతమై అతిశయించి శ్రోత్రపథమును జేరును.

ఒకవిషయము ముందు స్వల్పముగ వెలువడి ఉత్తరోత్తర మభివృద్ధి నొందునపు డీన్యాయ ముపయోగింపఁబడును.

తొలుత నొకటియై తానే కదంబముకుళముల ట్లనేకముగ విస్తరించునపుడును ఇయ్యది వచింపఁబడును.

"సర్వః శబ్దో నభోత్పత్తిః శ్రోత్రోత్పన్నస్తు గృహ్యతే,
వీచీతరంగన్యాయేన తదుత్పత్తిస్తు కీర్తితా.
కదంబముకళచ్ఛాయా దుత్పత్తిః కస్యచి న్మతే."

అని పండితోపదేశము.

వృకబంధనన్యాయము

కొంగలను బట్టుకునే యత్నమటులు.

కొంగలను పట్టుకొను టెట్లు? అని అడుగఁబడి చతురుఁ డొకఁడు—"కొంగ నెత్తిన పేరిన నేయి పెట్టి యుంచవలెను. ఎండ కానేయి కరగి దానికళ్ళలోనికి పోవును. అపుడది కళ్ళు కనఁబడక కంగారుపడును. ఆసమయమున దానిని సుళువుగ పట్టుకొనవచ్చును" అని చెప్పెనఁట.

అవసరమవు నంశము తేల్చకయె తరువాతి యసంబద్ధాంశము నూరక శాఖాచంక్రమణము చేయుట.

"దోమను చంపు టెట్లు అనిన దోమనుపట్టి దానినోటిలో గంధకధృతి యించుక పోసిన నది సులభముగఁ జచ్చును" అని చెప్పినట్లు.

## వృద్ధకుమారీవరన్యాయము

ఒకవృద్ధుఁడు, కన్య వరములు కోరుకొనినట్లు.

ఒకయూరిలో నొక వృద్ధబ్రాహ్మణుఁ డుండెను. అతఁడు గ్రుడ్డివాఁడు, దరిద్రుఁడు, అవివాహితుఁడు. అతఁ డష్ట కష్టములు ననుభవించుచు విసిగి అడవికి పోయి తపస్సు చేసెను. పరమేశ్వరుఁడు మెచ్చి ప్రత్యక్షమై వర మడుగుమన నావిప్రుఁడు విప్రుల కొకటికంటెఁ నెక్కువగ వరము లడుగుట కధికారము లేనందున నొకేవరముతో తనయన్నికష్టములు తీరునట్లును, లేనివి ప్రాప్తించునట్లును వరమును పొంద నిశ్చయించి "దేవా నామనుమఁడు రాజసింహాసనమున నధివసింపఁగాఁ జూచికొను భాగ్యమును దయసేయుము" అని కోరెను. దానితో తనవార్ధక్యము, దారిద్ర్యము పోవుటయు, తాను యువకుఁడై వివాహము చేసికొనుటయు, సంతానప్రాప్తియు, మహైశ్వర్యము, దీర్ఘాయువు లభింపవలయునని ఆతనియాశయము.

అట్లే — ఒకకన్యక ఎన్నిసంవత్సరములు గడచినను వరుఁడు దొఱకక అవివాహితయై యున్నందులఁ కెంతయుఁ జింతిలి యొకనాఁ డేకతమ అడవికి పోయి తపస్సు చేసి దేవుని మెప్పించెను. భగవానుఁడు దర్శన మిచ్చి యభీష్ట మిత్తు కోరుకొనుమనెను. ఆమె చాలదీర్ఘముగ నాలోచించి బహులాభప్రాప్తిఁగోరి "నాపుత్త్రిలు బంగారపళ్ళెరములో ఇష్టమృష్టాన్నము లారగించుచుండఁ జూచి యానందించు నట్లు వరమిమ్మనెను. భగవానుఁడ వల్లె యనెను. తన

వివాహము, అందును తనభర్తకు రాజైశ్వర్యము, సంతాన ప్రాప్తి, పరమాయువు మున్నగు బహులాభములు ఒకే వరముచే నామె సంపాదించుకొనఁ దలఁచి యిట్టి వరము వేఁడి కృతార్థురా లయ్యెను.

కావున—ఒకేవాక్యముచే ననేకాశయములు స్ఫురించు తావుల నీన్యాయము ప్రవర్తించును.

దీనికి 'వృద్ధకుమారీన్యాయము' వృద్ధకుమారీవాక్య న్యాయము, వృద్ధకన్యావరన్యాయము అనియుఁ బేళ్లు.

వృద్ధబ్రాహ్మణవరన్యాయము

పైన్యాయమట్లె.

వృద్ధతరుణీన్యాయము

"వృద్ధస్య తరుణీ విషమ్."

వృద్ధవేశ్యాన్యాయము

"వృద్ధవేశ్యా తపస్వినీ" యనునట్లు.

వృశ్చికచోరన్యాయము

దొంగను తేలు కుట్టినట్లు.

కళా. 2. 78.

వృశ్చికవానరన్యాయము

అసలేకోతి. అందుపై తేలుకుట్టినది.

వైజ. 3. 105

మర్కటమదిరాపానాది న్యాయమును జూడుము.

### వృశ్చికవిదూషకన్యాయము

హాస్యగానికి తేలుకుట్టినచో వాఁడు బాధపడుచున్నను అదియును హాస్యమే యనుకొందురు.

ఈఁదుము నని నీటిలో దిగి ఈఁదలేక మునుఁగుచు, తేలుచు, చావ సంసిద్ధ మగుచున్నను వానిం జూచి గట్టుననున్న వారు యీఁత అనుకొనునటు.

### వృశ్చికీదర్భన్యాయము

త్రేలు చూడి మోసి పిల్లలు పుట్టినవెంటనే చచ్చును. ఆత్మజ్ఞానము కలిగినంతన మాయావరణము విక్షిప్తమవును. అశ్వతరీగర్భన్యాయము జూడుము.

### వృక్షప్రకంపనన్యాయము

మొద లటు నిటు నూఁచిన చెట్టంతయు కదలినట్లు.

కొందఱు చెట్టుక్రిందనిలబడి తమలో నొకనిని చెట్టెక్కు-మనిరి. వాఁడట్లేచేసెను. ఒకఁ డొకకొమ్మ కదల్చుమనెను. మఱొకఁ డింకొకకొమ్మ కదల్చుమనెను. వేఱొకఁడు వేఱొకకొమ్మను; తదితరుఁడు తదితరశాఖను; అన్యుఁ డన్య విటపమును గదల్చుమనిరి. వాఁ డట్లే వరుసన అన్నికొమ్మలను గదల్చుచువచ్చెను. ఏకొమ్మ కదల్చిన నదియే కదలెడిదికాని చెట్టంతయు నొకమాఱుగ కదలలేదు. మొదట తా మనుకొనినట్లు చెట్టంతయు నొకమాటు కదలింపఁ జాలక వారు తమలోఁ దాము కళవళపడుచుండిరి. త్రోవన బోవుచున్న తెరువరి యొకఁ డదంతయు నెఱిఁగి

చెట్టుపైనున్నవానిని దిగిరమ్మనెను. పిదప నందఱుఁగలసి చెట్టుమ్రానును నటునిటు శక్తికొలఁది ఊపుఁడనెను. వారట్లే చేసిరి. చెట్టంతయు నొకమాఱుగఁ గదలిపోయెను.

అట్లే - ఈశ్వరత్త్వాంశభవులవు నానామూర్తుల నానా మంత్రములతో నానాశాఖలవారు వేఱువేఱు తీరులఁ గొలుచు చుందురు. వారిధ్యానమున తన్మంత్రాధినేతయవు నామూర్తియే సంతసించునుగాని సర్వమయమవు నద్వితీయ పరబ్రహ్మము ప్రసన్నము కాఁబోదు. సర్వమూలమవు ఆపరతత్త్వమును ధ్యానించు నెడల విరాట్పురుషు ననుగ్రహమును, సర్వదేవతోపాసనాఫలితమును పొంద నవును.

## వృక్షప్రవృత్తిన్యాయము

చెట్లు పెరిగి విస్తరించినట్లు.

ఎట్టిప్రయత్నమును, ఎవరితోడ్పాటును లేకయే వృక్షములు బాగుగ పెరిగి విస్తరించును.

అప్రయత్నముగ లాభప్రాప్తి కలుగునపు డీన్యాయము వాడఁబడును.

## వృక్షమూలనిషించనన్యాయము

చెట్టుమొదటలో నీరు పోసినట్లు.

చెట్టుమొదట పోయఁబడిన నీటిని వేళ్ళు బోదెకు, ఆకులకు, కొమ్మలకు పంపును. తద్ద్వారా చెట్టు పెరిగి ఫలించును.

పరమేశ్వరబుద్ధితో భూతతృప్తిఁగావించిన సర్వభూతాంత రాత్మయగు పరమాత్మ ప్రసన్నుఁడగును. తద్ద్వారా పునరావృత్తిరహితమైన అపవర్గప్రాప్తి కలుగును.

కడుపునిండ భుజించిన నవయవము లన్నియు పరిపుష్టి నొంది శరీరము పెరుగునట్లు.

## వేణ్యాకాశన్యాయము

త్రివేణీసంగమమున శుక్ల, కృష్ణ లోహిత వర్ణములుగల గంగా, యమునా, సరస్వతీ నదులు కలిసి ఆజలమున చక్కని ఒకక్రొత్తరంగు ఏర్పడును.

త్రివర్ణములును, త్రిగుణములును గల త్రిమూర్తు లొకే స్వరూపముగనై సచ్చిదానందమయుఁడును, జ్యోతిస్స్వ రూపుఁడును, స్వయంప్రకాశుఁడు నగు విరాట్పురుషుఁడు వెలుగొందును.

## వేతసన్యాయము

ప్రబ్బలిచెట్టు యేటియొడ్డున నీటి నానుకొనియుండి, కెర టము వచ్చినపుడు వంగుచు; కెరటము పోయినవెంటనే లేచుచు నుండును.

మతిమంతుఁడు దుష్టుల నెదిరక వినమ్రుఁడట్లు తలయొగ్గి వారిబారింబడక సుఖముండును.

## వేశ్యాకాంతన్యాయము

వెలయాలికి మగఁడొకఁడను నేర్పాటు లేనట్లు.

వేశ్యాపుత్రజనకన్యాయము

వెలియాలికొడుకునకు తండ్రి యెవఁడో నిర్ధారణ లేనట్లు.

వ్యంజకవ్యంగ్యన్యాయము

గూఢమై ప్రయుక్తశబ్దములచే సిద్ధించు నొకవిలక్షణమైన యర్థాంతరము వ్యంగ్యము. ఆవ్యంగ్యమును స్ఫురింపఁజేయు శబ్దము వ్యంజకము. వ్యంజకమునకు ఫలము వ్యంగ్యము; వ్యంగ్యమునకు మూలము వ్యంజకము.

అట్లే— వేదాధ్యయనమునకు ఫలము ఫలవదర్థావబోధ. అనఁగా వేదవిహితక్రియాకలాపాచరణమే ఫలముగాఁ గలిగిన వేదమంత్రార్థావబోధ. అనఁగా—వేదమంత్రార్థములను బాగుగ నెఱిఁగికొని అందు విధింపఁబడిన క్రియాకలాపములను విధివిధానమున నాచరించుట. ఆ ఫలవదర్థావబోధకు మూలము వేదాధ్యయనము.

వ్యక్తిన్యాయము

ఒకానొక అర్థమందు రూఢమైయున్న వ్యక్తినిగుఱించి మాటాడునపుడు లక్షణాదులచే మఱొకవ్యక్తి నావ్యక్తి కర్థముచేసి చెప్పు టసంగతము. అనఁగా — ఒకనిని గూర్చిన ప్రస్తావమునఁ దత్సమలక్షణలక్షితుఁ డగునంత మాత్రమున అప్రకృతుఁ డగు వేఱొకనివిషయము స్వీకరించుట అసమంజసము.

"కౌశికో వాక్య మబ్రవీత్" అనినపుడు కౌశికుఁడు అనఁగా విశ్వామిత్రుఁడు ఇల్లనెను అనుటకుబదులు 'దివాంధః

కౌశికోలూక...' అని నిఘంటువుద్వారా గుడ్లగూబను గ్రహించి గ్రుడ్లగూడ ఇట్లనెను అనిగాని; "కౌశికః కాకాన్ సంహరతి" గ్రుడ్లగూబ కాకులను చంపుచున్నది అనినపుడు 'కుశికస్యాపత్యం పుమాన్ కౌశికః' అను వ్యుత్పత్తిచే కౌశికుఁడు అన విశ్వామిత్రుఁడు కాకులను చంపుచున్నాఁడు అని గాని అర్థములు నుడువుట సంగతము.

వ్యపగతలేపాలాబూన్యాయము

సొరకాయబుఱ్ఱను మట్టితో నింపి నీటిలోఁ బడవైచిన నది మునుఁగును. నీరు తగిలి మట్టి అంతయు నీటిలో కఱఁగి పోయిన తేలికయై వెంటనే నీటిపైకి వచ్చును.

దేహముతో సంబంధ మున్నంతవఱకు ఆత్మ సంసార సముద్రములో మునిగియుండును. ఆయువు క్షీణించి దేహము నశించినవెనువెంటన ఆత్మ అచట నిలువక ఎకా యకి ఊర్ధ్వముఖముగ ఆకాశమున కెగిరిపోవును.

పంజరముక్తపక్షిన్యాయమును, జలతుంబికాన్యాయమును, ఏరండబీజన్యాయమును జూడుము.

వ్యపదేశిన్యాయము

ఒకేవస్తువునందు రెండు ధర్మములను ఆరోపించుట.

సమస్తబ్రహ్మాండాంతర్వర్తియగు పరమాత్మ యొకఁడే జీవుఁడు, దేవుఁడును.

అట్లే— అత్రికి దత్తాత్రేయుఁ డొకఁడే కుమారుఁడు. అతఁడే జ్యేష్ఠుఁడు కనిష్ఠుఁడును.

## వ్యభిచారిణీన్యాయము

వ్యభిచారముచేయు స్త్రీ తనయింటిలో పనులు పాటలు చేసికొనుచున్నను తనకిష్టుఁడవు విటపురుషునే నిరంతరము స్మరించి ఆనందించుచుండును.

భగవదర్పితమైన చిత్తవృత్తిగల మహనీయుఁ డేకర్మలు చేయుచున్నను, ఎటనున్నను మనసా పరబ్రహ్మస్వరూప చింతన మొనరించుచు బ్రహ్మానందము ననుభవించుచునే యుండును.

## వ్యాఘ్రచోరధనుర్న్యాయము

పెద్దపులి వెఱచినదివోలె పొదలలో మాటున డాగి పొంచియుండి మృగములపైఁబడి మడియించును. చోరుఁడు చీమకైన నొప్పితగులనట్లు అడుగులు వైచుచు నిలు జేరి యింటిలోనివారికి నిద్రాభంగముచేయ నొల్లని వాని చొప్పున చప్పుడు కాకుండ గోడకు కన్నమువైచి యిల్లు చక్కఁబెట్టును. ధనుస్సు వినయమునఁ బోలె మొదట వంగియే బాణము విడిచి తోటివానిని సంహరించును. దుర్మార్గుఁడు అడఁకువతో నుండియుండి నమ్మించి అపాఢ భూతివలె కొంపదీయును.

## వ్యాఘ్రీక్షీరన్యాయము

పెద్దపులిపాలు బంగారుగిన్నెలో పోసియుంచినఁగాని విఱిగి పోక నిలువవు. బంగారముకన్న నితరములవు లోహముల పాత్రలలో నవి విఱిగి చెడిపోవును.

జ్ఞానోపదేశ మొక సత్పురుషునియందు మాత్రమె వ్యర్థము గాక ఫలించును. మూర్ఖునియందు బూడిదలో బోసిన పన్నీరగును.

సింహీక్షీరన్యాయము జూడుము.

### వ్యాఘ్రోపవాసన్యాయము

"వ్యాఘ్రస్య తూపవాసస్య పారణం పశుమారణమ్"

పులియుపవాసమునకు పారణము పశుమారణమే.

దుష్టుని సవినయానుసరణమునకు పరిణామము ధనమాన ప్రాణాపహరణమే.

### వ్యాలనకులన్యాయము

పాము, ముంగిస వలె.

పామునకు, ముంగిసకు ఎడతెగని వైరము. అవి రెండు ఒకచో నెన్నఁడు నుండవు.

ఒకపొలములో రెండు ముంగిసలు తిరుగుచుండెను. ఇంతలో దగ్గఱగానున్న బిలములోనుండి యొకపాము ముంగిసలున్న సన్న గుఱుతింపక వెలికి వచ్చెను. వెంటనే యొక ముంగి దానిపైఁ బడి తునుకలు తునుకలుగ కొఱికివైచెను. కావున వానికిఁగల సహజవైరవ్యాపార మపారము.

ప్రబలవైరముగల వ్యక్తుల విషయమున నీన్యాయము ప్రవర్తించును.

వ్రీహిబీజన్యాయము

బియ్యపుగింజ పైభాగమున ఊకతోను, దానిక్రింద తవుడు, మున్నగు రేణువులతోను కప్పఁబడియుండును

ఉదా:—సత్త్వగుణము పైన తమోగుణముచేతను, దాని క్రింద రజోగుణముచేతను ఆవరింపఁబడియుండును.

వ్రీహి అనఁగా ధాన్యమును బాగుగా రోకళ్ళతో దంచి పైన ఆవరించియున్న ఊక తవుడు మున్నగువానిని తొలగించి లోపల గూఢముగ నున్న బీజములు అనఁగా బియ్యమును వెలికి దీయుదురు.

ఉదా:— అన్నమయాదికోశతుషసముదాయమున నిగూఢముగ డాగియున్న పరతత్త్వమును వేదవేత్తలు యుక్త్యవఘాతములచే బియ్యము విధమున వెలిజేర్తురు.

"ఉ. ఖాద్యము విశ్వవిశ్వ మొలయన్ సృజియించి యనుప్రవిష్టమై సద్యమ దానఁ గోశతుషజాతసుగూఢమ యైన దేని నుద్యద్యశులౌ కవుల్ వెలికిఁ దార్తురు తండుల మెట్టులట్టు లోవేద్య! సుయుక్తిఘాతముల; వింటివె, నీవును దత్త్వ మద్దియే."

వ్యాఖ్యాతల శంకరవిజయమునుండి.

శంకూత్ఖాతదంష్ట్రోరగన్యాయము

కోఱలు ఊడఁబెఱికినపామువలె.

మూలబలమును నాశనము చేసిన శత్రుఁ డేమియుఁ జేయఁజాలఁడు.

ఉత్ఖాతదంష్ట్రోరగన్యాయమును జూడుము.

శంఖన్యాయము

ఒకరాజభవనములో నొకశంఖము గలదు. అనుదినము నిర్ణీతసమయమునకు నియమితభటుఁ డొకఁ డాశంఖము నూదును. ఆవేళకు సరిగా సేవకు లందఱు హాజరై తమ తమపనులలోఁ బ్రవేశింపవలయును. కారణాంతరమున నెన్నఁడేని నాశంఖము పూరింపఁ బడకపోయినను సేవకులు అదేసమయమునకు అనఁగా శంఖపూరణవేళ నతిక్రమింపక హాజరై తమపనులలో ప్రవర్తింతురు. అట్లు ప్రవర్తింప వలయునుగూడ.

అదేవిధమున— "శంఖన్యాయేనోపలక్షకస్యాగ్నీషోమీయ పురోడాశస్యైవాభావేఽప్యుపలక్ష్యే కాలే యాగోఽస్తి యథా శంఖవేలాయా మాగంతవ్య మిత్యాది ..."

ఒకపురోడాశమున రెండు పురోడాశములు ప్రయోగింపఁ బడవు. ఉద్దిష్టపురోడాశావసరమున కర్తవ్యయాగ మొండు గలదు. అగ్నీషోమీయపురోడాశము ప్రయోగింపఁబడక పోయినను తదుపలక్ష్యమవు కాలమున నావిహితయాగము నాచరింపవలసి యున్నది.

గంట కొట్టగానే పిల్ల లందఱు బడికి రావలయును. అట్లు వచ్చుచుందురు. ఒకనాఁ డే దేనికారణమున—జవాను రాక అనుకొనుఁడు—ఆగంట కొట్టఁ బడకపోయినను గంట కొట్టువేళకే పిల్లలందఱు బడిలోనికి వత్తురు; రావలయును గూడ.

నాగవేలాయా మాగంతవ్యాం; పటహవేలాయా మాగం తవ్యాం మున్నగు వాక్యములు నిట్టివియే.

దీనికి శంఖవేలాన్యాయ మనియుఁ బేరు.

శకునిగ్రాహకగతిన్యాయము

పక్షిని పట్టుకొనఁ బోవువాని నడకవలె.

"యథా శకునిగ్రాహకస్య శకునిం జిఘృక్షత శ్ఛద్మనా గతి ర్భవతి శనైఃపదన్యాసో దృష్టిప్రణిధాన మశబ్దకరణంచ; కథ మనవబుద్ధః శకుని ర్గృహ్యేత......"

పక్షిని పట్టుకొనఁబోవు కిరాతుఁడు దొంగతనముగ మెల్లగ చప్పుడు కానట్లు అడుగులు వైచుచు ఆపక్షికి కనుపడక మాటుమాటున నుండి సమీపించి దానికి తెలియకుండ అకస్మాత్తుగ దానిని బట్టుకొనిపోవుచు.

పొంచియుండి కపటముతో తెలియరాకుండ తనయభీష్టము సాధించుకొనుట నీన్యాయము సూచించును.

ఆకసముపై నెగిరిపోవు పక్షియొక్క నీడను గుర్తించుచు అది పోయిన త్రోవన పోయి కిరాతుఁడు ఒకచో వ్రాలిన దాని నేర్పుతో పట్టుకొనునట్లు.

భూమిరథికన్యాయమును, శుక్తేష్టిన్యాయమును జూడుము.

శకునిసూత్రన్యాయము

పక్షి, దానిని పట్టుకొనుట కుపయోగింపఁబడు వల, ఒకచోఁ గూడునవి యైనను పరస్పరభిన్నములు.

నదీసముద్రన్యాయమును, నానావృక్షరసన్యాయమును, చోరాపహార్యన్యాయమును, పుంవిషయన్యాయమును జూడుము.

## శతపత్రపత్రశతభేదనన్యాయము

నూఱుదళములుగలదైనను పద్మము నొకమాఱు సూదితో గ్రుచ్చిన నూఱుదళములకు నొక్కమాఱుగ రంధ్రము పడును. ఆదళములను విడదీసి ప్రత్యేకముగ గ్రుచ్చినచో నూఱుమాఱులు గ్రుచ్చవలయును.

ఒకేపనివలన ఒక్కమాఱుగ ననేక ఫలితములు కలుగునపుడీ న్యాయ ముపయోగింతురు.

అంతియగాక—కమలముల నన్నిటిని విడివిడిగ చిల్లువడఁజేసి తుదకుఁ జూచిన నవన్నియు నొకమాఱుగ నట్లు చిల్లు వేయఁబడినవా యేమి యని భ్రాంతి కలుగును.
ఒకపని క్రమముగఁగాక ఒకమాఱుగ నట్లు జరిగినదను భ్రాంతి కలుగునపుడును ఇయ్యది యుపయోగింపఁబడును ఎట్లన—

"శాఖాచంద్రమసో స్తుల్యకాలోపలబ్ధిః—" కొమ్మమీదుగ చంద్రుని చూడుము అని చెప్పిన ఒకఁడట్లే చూచెను. మొదటివాఁడు ముందు దేనిని జూచితి వని యడుగ నాతఁడు కొమ్మను చంద్రుని గూడ ఒకేపర్యాయము చూచితినని చెప్పెను. వాస్తవమున నాతఁడు ముందు కొమ్మను జూచి తరువాత చంద్రుని గుఱుతించెను.

శతేపంచాశన్న్యాయము

నూటిలో ఏబది ఇమిడియున్నట్లు.

"వ్యాపకశతసంఖ్యాయాం యథా వ్యాప్యపంచాశత్సంఖ్యా నివిష్టా ఏవం యత్ర వ్యాపకే వ్యాప్యస్య నివేశ స్తత్రాస్య ప్రవృత్తిః॥"

వాచస్పత్యమ్.

వ్యాపకమందు వ్యాప్యము తద్వ్యాపకఫలభాగి యయినపు డీ న్యాయము ప్రవర్తించును.

అభిమన్యుఁడొకేదినమున ఎనిమిది అక్షౌహిణుల కౌరవ సేనం దునుమాడెను. అనిన చనిపోయినవారిలో ఒకటి రెండు, మూడు, అక్షౌహిణులసేనగూడ నున్నదిగదా!

శరపురుషీయన్యాయము

"శరశ్చ క్షిప్తః ప్రాకారాచ్చ పురుష ఉత్థితః, స తేన హతః। తత్తుల్యం శరపురుషీయమ్॥"

ఒకఁడు గోడవైపునకు బాణము వదిలెను; దానివెనుక నుండి యొకఁడు తలవెళ్ళబెట్టెను; ఆబాణము సరిగా వానికి తగిలి వాఁడు చచ్చెను.

కాకతాలీయన్యాయముగ జరిగిన పనులయం దీ న్యాయ ప్రవృత్తి యవును.

అజాకృపాణీయ, ఖల్వాటబిల్వీయ, (బిల్వఖల్వాట) న్యాయములను జూడుము.

## శర్కరోన్మజ్జనీయన్యాయము

"శర్కరాచ క్షిప్తా పురుషస్యోన్మజ్జనం, తత్తుల్యం శర్కరోన్మజ్జనీయమ్॥"

ఒకఁడు గట్టుననుండి కాలువలోనికి ఱాళ్ళు ఱువ్వెను; అంతకు మున్ను నీటిలో మునిఁగియున్నవాఁ డొకఁడు తల పైకెత్తెను. ఆఱాయి తగిలి వానితల పగిలెను.

శరపురుషీయన్యాయమట్లు.

## శలభన్యాయము

మిడుత దీపము నార్పివేయునట్లు.

"ఉజ్జ్వలగుణ మభ్యుదితం క్షుద్రో ద్రష్టుం న కథమపి క్షమతే, దగ్ధ్వా తనుమపి శలభో దీప్రం దీపార్చిషం హరతి."

నీచుఁడు శ్రేష్ఠపురుషుని గొప్పతనమును జూచి యించుకంతయు నోర్వఁడు. తనబడలు కాలిపోవుచున్నను, మిడుత దీప్రమైన దీపశిఖ నార్పివేయును.

## శల్యకవానాఖున్యాయము

చుంచెలుకవలె.

చుంచెలుక పరుండియున్నవారిపాదములను మెల్లగా నొప్పింపక కఱచి పాఱిపోవును.

ఏవిధమయిన కష్టమును తగులనీయక చతురతతో రాజు ప్రజలనుండి కప్పమును వసూలుచేసికొనవలెను.

శవోద్వర్తనన్యాయము

శవమును లేపుచు పొర్లించినట్లు.

నిష్ప్రయోజన మని తాత్పర్యము.

అరణ్యరోదనన్యాయమువలె.

శశవిషాణన్యాయము

చెవులపిల్లికి కొమ్ములవలె.

మూషకవిషాణన్యాయమును జూడుము.

శాకటికన్యాయము

"శిరశ్ఛేదేపి శతం న దదాతి వింశతిపంచకంతు ప్రయచ్ఛతి శాకటికః"

బండి తోలువాఁడు "తలతీసినా, నూఱురూపాయ లీయను; ఐదుఇరవైలు మాత్రమే ఇత్తును" అనునట్లు.

మూర్ఖుఁడు తను పట్టిన పట్టేగాని ఒరులు చెప్పునది విని పించుకొనఁడు.

శాఖాచంక్రమణన్యాయము

ఒకకొమ్మనుండి మఱొకకొమ్మకు, దానినుండి, యింకొక కొమ్మకు, ప్రాఁకునట్లు.

శాఖాచంద్రన్యాయము

ఆకాశముపై నున్న చంద్రుని జూపుటకు చెట్టుకొమ్మ మీఁదుగఁ జూడుమని చెప్పునట్లు.

దుర్గ్రాహ్యమైన యంశము సుగ్రాహ్యమవుట కరుంధతీ ప్రదర్శన న్యాయమటులు లోకప్రసిద్ధవ్యవస్థం గల్పించి నుడువుట.

"తరుశాఖాగ్రదృష్ట్యైవ సోమం యద్వ త్ప్రదర్శయేత్,

నిష్కోశం కోశదృష్ట్యైవ ప్రతీచి బ్రహ్మ దర్శ్యతే."

చంద్రుని జూపుమనిన యర్భకునకు ఆకొమ్మమీఁదుగఁ జూడుము, అదె చంద్రుఁడు ప్రకాశించుచున్నాఁడు—అని చూపునటులు కోశశూన్యమైనను కోశదృష్టితో బ్రహ్మ పదార్థము ప్రత్యక్షనంబు చూపింపఁబడుచున్నది.

నిరవయవమై తేజోరూపమైన పరబ్రహ్మవస్తువు నెఱింగి కొనుట సులభసాధ్యముకాదుగాన "అసా వాదిత్యో బ్రహ్మ" ఈ కనఁబడు సూర్యుఁడే బ్రహ్మ అని కొంత వ్యవస్థ కల్పించినట్లు.

శాఖాచంద్రజ్ఞానానంతరము వాస్తవిక చంద్రస్వరూపము హృద్రూఢ మవునట్లు సూర్యాదివ్యవస్థలద్వారా అభ్యాసవశమున శుద్ధతత్త్వస్వరూపజ్ఞానము కలుగును.

శిఖికర్పూరన్యాయము

కర్పూరపుముద్దకుఁ నంటుకొనిన అగ్నిహోత్రము కొంత తడవు దానితోఁకూడ వెలిగి తుదకు రెండును కనుపడ కుండ పోవును.

దగ్ధేంధనవహ్నిన్యాయమును జూడుము.

శిరోవేష్టనేన నాసికాస్పర్శన్యాయము

"శిరోవేష్టనేన అంగుల్యా నాసికాప్రవేశవత్" నీముక్కు చూపు మనిన తల చుట్టి చేతితో ముక్కు చూపినట్లు. "తిణుకు పోయి మాచవరం" వలె.

ద్రవిడప్రాణాయామన్యాయమును జూడుము.

శీతకిరణకరావలంబనన్యాయము

చంద్రకిరణములను పట్టుకొనఁ బ్రయత్నించినట్లు. శక్తికి మించి, అసంభవములైన పనులలో ప్రవర్తించునపుడీ న్యాయము వర్తించును.

ఆకాశముష్టిహననము, పొగను మూటకట్టుటవలె.

శీతలాప్రస్తరన్యాయము

జాతిని శీతల (ఒకానొక దేవత) మున్నగువిగ్రహములుగా చెక్కి పూజింతురు. దానినే తూనిక రాళ్ళుగా వాడుదురు. అయ్యదియే చాకిబండగా నుపయోగపడును. భావనవలన కోతి బ్రహ్మయు; బ్రహ్మ కోతియు నవును.

శుండాసూచీన్యాయము

ఏనుఁగు తొండముతో త్రోవలో పడి యున్న సూదినికూడ తీయును.

శుకనలికాన్యాయము

కాకుదీక శుక నాక నలిక ప్రభృతు లస్త్ర విశేషములు. అవి పైకి చూచుటకు వెలుపుగొలుపనివే యైనను యుద్ధములలో రథగజతురగాదులకు చాల హాని చేయును.

అట్లే— పైకి చాల సుఖముగ కనఁబడినను కామము మానవు నధోగతి నొందించును.

ఇదియే నీలకంఠాచార్యులవారు భారతోద్యోగపర్వమున- "కాకుదీకం శుకం నాక మక్షిసంతర్జనం తథా......అను శ్లోకవ్యాఖ్యానమున సి ట్లుపదేశించియున్నారు—

"కాకుదీకమిత్యాదయోఽష్టౌ స్త్రవిశేషాః। ... యేన శుకనలికాన్యాయేన అభయేపి భయదర్శినో హయరథాదిపాదేషు గాఢం శ్లిష్యన్తి తచ్ఛుకమోహనం నామ॥"

మఱియొక యుదాహరము—శుకనలికన్యాయముచే స్వకామపరికల్పితమే కాని ఆత్మకు వాస్తవముగ కర్తృత్వము, బంధమోక్షాదికము లేదు.

శుక్త్యంబుబిందున్యాయము

ముత్యములోఁ బడిన వానబొట్టు ముత్యమయినట్లు.
"చిప్పఁ బడ్డ నీటిచినుకు ముత్యంబాయె"

వేమన

సత్పురుషునియందుఁ గావింపఁబడిన జ్ఞానోపదేశము బ్రహ్మసాధకమై రాణించును.

శుద్ధోదలవణన్యాయము

మంచినీరు, ఉప్పు భిన్నములైనట్లు

చోరాపహార్య, నదీసముద్ర, శకునిసూత్ర, పుంవిషయా, నానావృక్షరసన్యాయములను జూడుము.

శుష్కతటాకమత్స్యన్యాయము

ఎండిపోయిన చెఱువులోని చేపలట్లు.

శుష్కేష్టిన్యాయము

శుష్కేష్టి యన భ్రష్టక్రతువు. ఉత్తరకాలమున క్రతుకృతులయందు ప్రావీణ్యము, ప్రతిష్ఠ సంపాదించు నుత్సుకతతో అవిధిపూర్వకముగ నొనర్పఁబడు నిష్టి శుష్కేష్టి అనఁబడును. ఈన్యాయము చాలవఱకు భూమిరథిక న్యాయమునకు సరివచ్చును. భూరథికుని యుద్ధక్రియ తాత్కాలికముగ ప్రయోజనశూన్యమయ్యు అభ్యాసవశమున సంగ్రామరంగముల నధికచాతుర్యము నిచ్చి పేరు ప్రతిష్ఠలు సంపాదింప మూలకారణ మవును.

శూర్పన్యాయము

చేట మంటిబెడ్డలు, తవుడు, ఊక మున్నగువానిని వదలివైచి బియ్యమును నిలువచేయును.

బుద్ధిమంతులు దుర్గుణములను వదలివైచి సుగుణములను మాత్రమే స్వీకరింతురు.

శృంగగ్రాహికాన్యాయము

శృంగస్యగ్రహణం క్రియాయాం యస్యాం సా శృంగగ్రాహికా కొమ్ములుపట్టుకొను పని.

"యథా గోవ్రజే కా మదీయా గౌ రితి గోపః పృష్టః
శృంగం గృహీత్వా గాం ప్రదర్శయేత్—"

ఈఆవులమందలో నాఆవు ఏది అని యజమాని అడిగిన గోపాలుఁడు ఇది నీయావు అని దానికొమ్ములు పట్టుకొని చూపినట్లు.

"—ఏవంబోధకం శాస్త్రం విధాయకం" ఇట్లు ప్రధాన లక్షణోదాహృతిపూర్వకముగ నుడువునది విధాయక శాస్త్రము.

శృంగగ్రాహాదిలక్షణములచే ధేన్వాదులు గుఱుతింపఁబడు నట్లు విధాయకశాస్త్రములచే వస్తునిర్దేశము చేయుట అని తాత్పర్యము.

మఱియు—

"యథా గోమండలస్థాం గాం శృంగం గృహీత్వా విశేషతో దర్శయత్యేషా బహుక్షీరేతి".

మందలోనొకానొకయావును కొమ్ములు పట్టుకొని చూపుచు ఆలకాఁపరి యీయావు చాల పాలిచ్చును అని చెప్పినట్లు.

మఱియొకయుదాహరణము—

గవాదులు సాక్షాచ్ఛృంగగ్రాహికచే నిర్దేశింపఁబడి తెలిసి కొనఁబడినట్లు బ్రహ్మ విధాయకశాస్త్రమున ప్రతిపాదిత మును, ప్రతీతమును గాదు.

## శైలూషీన్యాయము

నాటకములో వేషము వేయు స్త్రీ అనేకవేషములు వేసి తా నొకతెయే అనేకరూపములతో భాసించును.

మూలప్రకృతి వాస్తవమున నొకటియయ్యు జగదాద్యాకృతులం బరిణమించి యనేకత్వమున భాసించును.

శ్మశానకుసుమన్యాయము

వల్లకాటిలో మంచిమంచిపూవులు పూచినట్లు.

నిష్ప్రయోజన మని భావము.

శ్మశానవైరాగ్యన్యాయము

శవమును కాటికిజేర్చి అగ్నిసంస్కారముచేయుచు, అట నున్నంతదనుక "ఏమున్నది? అంతా మాయ. ఈదేహము ఋణానుబంధము. భార్యాపుత్రాదులు శత్రువులు" అని వైరాగ్యముతో పలుపోకలు పోదురు. మఱలివచ్చినంతన దూడపేడదగ్గఱనుండియు తనకే కావలెను.

పురాణ, ప్రసూతివైరాగ్యములటులు.

శ్యామరక్తన్యాయము

వస్త్రమునకు శ్యామలవర్ణము పోయిన నెఱుపురంగు వచ్చును. కాని రంగు లేకుండమాత్రము వస్త్రముండదు. ప్రతియొకవస్తువు గుణసహితమై యుండునుగాని గుణ రహితమై యుండదు.

అట్లే—నిర్గుణపరబ్రహ్మము నామరూపక్రియావికార రహితమైనను నామరూపక్రియారహితత్వవికారసహితమే మై యొప్పుచుండును. (అభావమంను అభావత్వభావ మిమిడియున్నట్లు.)

శ్యాలశునకన్యాయము

ఒకడు తనభార్యకు కోపము గలిగించి ఏడిపించుటకై తన పెంపుడుకుక్కను బావా, బావా అని పిలుచుచుండెను. ఒకనాఁడతఁడు కుక్కను చావమోది బావా అని పిలుచుచు, బండబూతులు తిట్టెను. అందుల కాతనిభార్య సహించలేక నిజముగా ఆకుక్క తనతమ్ముఁడే అను నూహతో ఏడ్చి భర్తతో తగవులాడెనఁట.

తనకు సంబంధించనివస్తువుపై మమత్వబుద్ధిం జేసి ఆవస్తువున కేదేని హాని సంభవించినపుడు దుఃఖించుట లోకస్వభావము.

శ్యేనకపోతీయన్యాయము

పావురము డేగచే బారిం బడినట్లు.

"యథా కపోతోఽతర్కిత మాగతేన శ్యేనేన గృహీత స్తథాఽఽకస్మికో యో దుర్యోగ స్స ఏవ ముచ్యతే॥"

గింజ లేరి తినుటకై కళ్ళమునకుఁ బోయిన పావుర మొకఁ డాకస్మికముగ నగుదెంచిన డేగవాతంబడి మడిసెను.

అట్లే—తలవనితలంపుగ సంభవించిన దుర్యోగమునెడ నీ న్యాయ ముపయోగింపఁబడును.

శరపురుషీయ, కాకతాళీయ న్యాయములను జూడుము.

శ్యేనాధికరణన్యాయము

పావురములు కొంగలు మున్నగువానిపై డేగ కధికార మిచ్చినట్టు.

(యాగప్రకరణములందు శ్యేనాధికరణ మొకండు కలదు.)

దుష్టున కధికార మిచ్చినట్లున్నన.

## శ్రుతిబలీయస్త్వన్యాయము

శ్రుతిక్రమ, అర్థక్రమ, పాఠక్రమ, ప్రవృత్తిక్రమముల యందు ప్రవృత్తిక్రమముకన్న పాఠక్రమమును, దానికంటె అర్థక్రమమును, దానికన్న శ్రుతిక్రమమును క్రమముగ బలీయము లయినట్లు.

పూర్వాపూర్వ మహాప్రత్యుసూచనమున నీన్యాయము ప్రవర్తించును.

## శ్వపిశునన్యాయము

లోభికిని కుక్కకును భేదము లేదు.

లోభికిని కుక్కకును స్థిరబుద్ధి శూన్యము; తోడివారల జూచిన నిరువురకును సరిపడదు.

## శ్రోత్రశృంగన్యాయము

ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాడి.

## శ్రోత్రియవిటన్యాయము

శ్రోత్రియవిటుఁడొకఁడుతనవిటకత్తెను మడికట్టుకొమ్మన్నట్టు.

## శ్వపుచ్ఛన్యాయము

కుక్కతోకను సరిచేయఁ బ్రయత్నించినట్లు.

"వెంటఁదవిలి బోధించిన వింతకైన
నార్జవ మ్మొందఁ డొకయింత దుర్జనుండు
స్వేదనాభ్యంజనోద్బంధనాదివిధివి
నామితశ్వపుచ్ఛమువ్రాలె రామకృష్ణ!"
వ్యాఖ్యాతల రామకృష్ణశతకమునుండి.

శ్వపుచ్ఛోన్నామనన్యాయము

పై శ్వపుచ్ఛన్యాయము వలెనే.

"నచైవ శక్యతే కర్తుం నమ్రో యత్నశతైరపి,
కో హి స్వేదశతే నాపి శ్వపుచ్ఛం నామయిష్యతి?"

మఱియు—వాలియుండు కుక్కతోకను పైకెత్తఁ బ్రయత్నించినట్లు.

వ్యతిరేకమున నుదాహరణము:— ధూర్తుఁడై కనుగానక తిరుగువాని నెవఁడు నమ్రము నొనరింపఁగలఁడు?

శ్వలీఢపాయసన్యాయము

కుక్క ముట్టుకొనిన పాయసమువిధమున.

"అపి ప్రయత్నసంపన్నం కామేనోపహతం తపః,
న తుష్టయే మహేశస్య శ్వలీఢ మివ పాయసమ్."

గట్టిప్రయత్నముతో ప్రారంభింపఁబడినను కామవిద్ధమవు నెడల తపస్సు కుక్క ముట్టుకొనిన పాయసమువలె మహేశ్వరతుష్టికి కారణము కానేఱదు.

శ్వశుష్కాస్థిన్యాయము

కుక్క ఎముకను నాకినట్లు.

నాలుక చీరుకుపోయి రక్తము కారుచున్నను కుక్క ఎండి పోయిన యెముకను విడిచిపెట్టక నాకి కొఱుకుచునే యుండును.

తనకు హానికరమేయైనను మూర్ఖుఁడు పట్టినపట్టు విడువఁడు.

శ్వశ్రూభిక్షాన్యాయము

కోడలు బిచ్చము పెట్టినట్లు.

కొందఱీన్యాయమునకును, వధూమాషమాపనన్యాయ మునకును భేదము లేదందురు; మఱికొందఱు శ్వశ్రూనిర్గ చ్ఛోక్తిన్యాయము నియ్యదియు నొకటి యందురు.

శ్వశ్రూనిర్గచ్ఛోక్తిన్యాయము

"భిక్షా మటతే మాణవకాయ భిక్షాం ప్రత్యాచక్షాణా మాత్మనః స్నుషాం భర్త్సయిత్వా శ్వశ్రూః పున స్తమా హూయ సమాగతే తస్మి న్నాస్తి భిక్షా నిర్గచ్ఛేతి తథైవ ప్రత్యాచష్టే."

ముష్టివాఁ డొకఁడు బిచ్చమునకు రాఁగా ఆయింటికోడలు లేదు పొమ్మనెను. అది విని అత్తగారు వాగ్వర్షము కురిపించుచు వచ్చి " ఓసీ, నీదా పెత్తనము బిచ్చగానిని పొమ్మనుటకు ? చూడుము నిన్నేమిచేసెదనో " అని పోట్లాడి వానిని పిలిచి ఈతొత్తు అనవసరపు పెత్తనము

కట్టుకొనుచున్నది. దానినోటికి తాళము వేయించవలెనని తానే స్వయముగ బిచ్చము లేను పొమ్మనెనట.

కోడలికి బుద్ధి చెప్పి అత్త తాను బింకుచేసినట్లు.

శ్వసభన్యాయము

కుక్కలు సభ చేసినట్లు.

కుక్క మఱొకకుక్కను జూచిన నూరుకొనక మొఱుగును, పైబడి పోట్లాడును. అట్టియెడ పదికుక్క లొకచోఁజేరిన నెట్లుండునో చూడుడు. నిరర్థకమైన పోట్లాటతో ఆకుక్కలకును, ఆఱుపులు వినలేక ఇరుగుపొరుగువారలకును మచ్చమాయును.

కేవలవాదప్రతివాదములతో చికాకై వట్టిగల్లంతుగా మాఱిన అప్రయోజకుల కూటమి వచియించుతావుల నీ న్యాయము ప్రవర్తించును.

శ్వానమకరన్యాయము

"నీళ్ళలోన మొసలి నిగిడి యేనుగుదీయు
బైట కుక్కచేత భంగపడును
స్థానబలిమికాని తనబలిమి కాదయా"

వేమన.

శ్వానారోహన్యాయము

"శ్వానారోహే కుతఃసౌఖ్యమ్"

గుఱ్ఱమున్నగువానిని వదలి కుక్కమీఁద స్వారిచేసిన నేమిసుఖము కలుగును?

లాభాధిక్యమును నిరసించి స్వల్పలాభము నిచ్చు పనులలోఁ బ్రవర్తించుట.

మత్తకాశినీన్యాయమువలె.

షష్ఠాద్యన్యాయము

ఆఱుగురిలో మొదటివాఁడు అన్నట్లు.

ఒకచో నాఱుగురు మనుష్యులున్న వారిలో మొదటివాఁడెవఁడో తెలిసికొనుట దుర్ఘటము. వారిలో నెవనినుండి లెక్కించుట ప్రారంభించిన నాతఁడే మొదటివాఁడగును. అదే లెక్కయందు అనులోమవిలోమముగ మొదటివాఁడు ఆఱవవాఁడును, ఆఱవవాఁడు మొదటివాఁడును కావచ్చును. కాని అభిమతుఁడుమాత్రము తెలియఁబడఁడు. అట్లు మొదటివాఁడు తేలవలెననిన ఫలానా ఫలానా ఆఱుగురిలో మొదటివాఁడు అని నిర్ధారణచేసి చెప్పవలెను.

అనిర్ధారిత విషయములం దీన్యాయము ప్రవర్తించును. ఆచెట్టుమీఁదిపక్షులలో మొదటిది చాల అందమైనది అన్నట్లు.

షాష్ఠతిర్యగధికరణన్యాయము

మెలికలు పెట్టిన సిద్ధాంతము మాదిరి.

షోడశికాగ్రహణాగ్రహణన్యాయము

షోడశిని గ్రహించుట, గ్రహింపకుండుట వలె.

"అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" "నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" అతిరాత్రమున షోడశిని గ్రహింపవలెను, గ్రహింపరాదు అని రెండురకముల నియమములున్నవి. అపేక్షాభేదముచే అతిరాత్రమున షోడశిని గ్రహించుటయు, మానుటయు విధివిహితములే.

"షోడశికాగ్రహణాగ్రహణవ ద్వికల్పే ప్రాప్తే—"

అటు, నిటూ, (అవునని, కాదని) వికల్పముగ నుడువు నవసరమున నీన్యాయము ప్రవర్తించును.

సంగగుణదోషన్యాయము

సాంగత్యమువలన గుణదోషములు గలుగును.

కాలిన ఇనుపకడ్డీపైఁ బడి నీరు ఆవిరియై రూపఱును; ముత్యపుచిప్పలోఁ బడి ముత్యములుగా మాఱును.

సందంశపతితన్యాయము

పట్టుకాఱులో చిక్కుకొన్నట్లు.

అటు నిటు తేలక విషమావస్థలో నున్నయంశమున నీన్యాయ ముపయుక్తము.

సంధిగ్ధే న్యాయః ప్రవర్తతే న్యాయము

సందిగ్ధాంశ మైనను విడువక విచారింపవలయును.

"విచారపాటవేన యావ ద్యావ ద్వివేకదార్ఢ్యం భవతి తావ త్తావ ద్భ్రమశైథిల్యం జాయతే తరతమభావాపన్న సాధనాయత్తం ఫలం తరతమభావాపన్నమితిన్యాయాత్।

విచారవిషయత్వంచ నాజ్ఞాతస్య నాపి నిశ్చితస్య కింతు సందిగ్ధస్య సందిగ్ధం సప్రయోజనం చ విచార మర్హతీతి న్యాయాత్ ”

సవిమర్శముగ విచారించినకొలఁదిని భ్రమ దూరమవును. కాన కలయథార్థభావము తెలియరాక సందిగ్ధావస్థయందుఁ జిక్కియున్నయంశము సప్రయోజన మవునెడ తప్పక విచారింప నర్హమవుచున్నది.

## సంవాదిభ్రమన్యాయము

మణిప్రభను చూచి మణియను భ్రాన్తితో వాస్తవమణిని వదలి మణిప్రభయొద్దకుం జేర్చుభ్రమ.
మణిప్రభామణిమతిన్యాయమును జూడుము.

## సకృత్కృతే కృతః శాస్త్రార్థః అను న్యాయము

ఒకమాఱొనరింపఁబడిన శాస్త్రార్థము నింకొకమాఱు చేయు టవసరము.

“నను సకృత్కృతే కృతః శాస్త్రార్థ ఇతి న్యాయేన సకృదధ్యయనాదేవ నిత్యాధ్యయనవిధిసిద్ధే రావృత్తి ర్న లభ్యేతేతి చే న్న.”

ఈవాక్యము వివరణప్రమేయసంగ్రహమందలిది. సిద్ధాంతి పూర్వపక్షితో ననుచున్నాఁడు—

“సకృత్కృతే కృతః శాస్త్రార్థః” అనున్యాయముచే సకృదధ్యయనముచేతనే నిత్యాధ్యయనవిధి సిద్ధించుచుండ

మఱలఁ దదావృత్తి పొందఁ బడను అని అందువేమో, అట్లు గాదు.

సకృద్గతిన్యాయము

"సకృద్గతౌ యద్బాధితం తద్బాధిత మేవ" అను పరిభాషను నాగోజీభట్టు న్యాయరూపమున క్లుప్తీకరించెను.

తుల్యబలములు గల రెండు శాస్త్రము లొకచోఁ బ్రవర్తించునపుడు తొలుత నొకదానిచే బాధింపఁబడి ప్రవర్తింపకున్న శాస్త్రము బాధితమే కావున మఱలదానికి ప్రవృత్తి యుండదు.

ఒకపనిని సాధింపఁగలవా రిరువు రున్న, వారిలో నొకని నాపనికై నియోగించి రెండవువానిని మానివేయుదుము గాని, వానినికూడ ఆపనికై నియోగింపముకదా.

సక్తున్యాయము

అన్నముమాని పేలపిండి తినినట్లు.

ముఖ్యమయినదానిని వదలి అప్రయోజనమైన తేలికపనికిఁ బూనుకొనుట.

మత్తకాశినీ, శ్వానారోహన్యాయములవలె.

సచ్ఛిద్రఘటాంబున్యాయము

చిల్లికుండలోఁ బోసిన నీరుతీరున.

సత్రన్యాయము

సత్రము అనఁగా యజ్ఞము. యజ్ఞము లనేకములు. కొన్ని కొలఁదిదినములలో ముగియునవి; మఱికొన్ని చాలదినము

లలో ముగియునవి; ఋత్విగాదులు సత్రవిశేషమును బట్టి కొందఱు నియమింపఁబడుదురు. అట్లు ఋత్విగాదులను నియమించుకొని సత్రమును ప్రారంభించిన నది ముగియక ముందె నియమితులలో నొకరుఁడు కారణాంతరమున సత్రవాటిక విడచిపోయిన లేక మరణించిన వానిస్థానే మఱియొకని నియమించుకొందురు. లేనిచో నాయాగము భ్రష్టమవును. అగతికమై యాగము భ్రష్టము కానున్న యపుడు గతి కల్పించి దానిని సంరక్షించుకొనుటయే ఆ నూతనపురుషనియోగమునకు ఫలము.

అట్టిపట్టుల నీ న్యాయ ముపయోగిందును.

ఇంచుమించు రాత్రిసత్రన్యాయమున కియ్యది సరివచ్చును.

సదృశా త్సదృశోద్భవః న్యాయము

ఎటువంటిదానివలన అటువంటిదే పుట్టును. అనులోమమున అనులోమసృష్టియేగాని విలోమసృష్టి కానేఱదు.

ఏవిత్తువలన ఆచెట్టు.

కాని, అనులోమమున విలోమసృష్టియు కలుగుచున్నది. ఎట్లన—

"నచైవ నియమో లోకే సదృశా త్సదృశోద్భవః,
వృశ్చికాదేః సముత్పాదో గోమయా దపి దృశ్యతే."

తేళ్ళు మున్నగునవి తేళ్ళవలననేగాక పేడవలనఁగూడ పుట్టుచుండుటవలన 'సదృశా త్సదృశోద్భవః' అను నియమము సర్వజీవసామాన్యముగఁ గన్పించుటలేదు.

కావున ఈనియమము కొన్నితావులమాత్రమే ప్రవర్తించునుగాని సార్వజీవికము కాదని జయంతభట్టు మున్నగు వారి అభిప్రాయము.

సన్న్యాసియోషాన్యాయము

సన్యాసి కావలెను; మంచి అందగత్తెయు నుండవలెను. ఈరెండు నొకేస్థితియందు కలియుటెట్లు ?

పరస్పరవిరుద్ధధర్మము లొకచోఁ జేర్కొనఁబడునెడ నీ న్యాయము ప్రవర్తించును.

సుభగాభిక్షున్యాయమును జూడుము.

సముద్రకిట్టన్యాయము

సముద్రములో మలము వైచిన తిరిగి ఒడ్డునకే వచ్చును గాని, సముద్రమున కేచెఱుపును గూర్పనేరదు.

సత్పురుషుల కెగ్గు దలఁపెట్టిన నది చుట్టుప్రక్కలవారికి సంక్రమించునేగాని, వారికేలోటును గూర్పఁజాలదు.

సముద్రమధుబిందున్యాయము

సముద్రములో తేనెచుక్క వైచిన సముద్రజలము తీయఁబడునా ?

సముద్రమథనన్యాయము

సముద్రమథనసమయమున అమృతాదిఫలభోక్తలు దేవతలు; సంక్షోభము నొందినది సముద్రుఁడు.

లోకమంగళమునకై సత్పురుషు లెట్టి యిక్కట్టులకైన నొడిగట్టుదురు.

## సముద్రవృష్టిన్యాయము

సముద్రములో వర్షము గురిసినట్లు.

నిష్ప్రయోజనము.

ఊషరవృష్టి, అరణ్యరోదన, పిష్టపేషణ, వనచంద్రికా, శవోద్వర్తన, గర్దభరోమగణన, శ్వపుచ్ఛోన్నామన, బధిరకర్ణజప, అంధకరదీపికా, అంధదర్పణాది న్యాయములఁ జూడుము.

## సమూహాలంబనన్యాయము

సమూహముపై నాధారపడినట్లు.

ఒకవాక్యమునఁగల ప్రతియొకశబ్దమునకును అన్వయము కుదరనపుడు మొత్తముశబ్దములఁ కన్నిటికిని గలిపి అన్వయము సరిపోవును.

సంఘములోనివారిలోఁ బ్రతియొకఁడును సమర్థుఁడు కాక పోయినను మొత్తముమీఁద నందఱును సమర్థులే అవుదురు.

## సర్వశాఖాప్రత్యయన్యాయము

"సర్వశాఖాప్రత్యయ మేకం కర్మ" అన్ని శాఖలవారును నమ్మునది ఒకకర్మయే.

అనఁగా— భిన్నభిన్న వేదమార్గావలంబకు లెల్లరు అగ్న్యుపాసనాపూర్వకమైనకర్మమే ముఖ్యముగా చూచుకొందురు. అచరించుపద్ధతి భిన్నమగుఁగాక అగ్నిహోత్రమునకు మాత్రము భంగము రానీయరు.

ఎట్లన:— కొందఱు సూర్యోదయమునకుఁ బూర్వమే అగ్నిహోత్రము వేల్తురు; కొందఱు సూర్యోదయానంతరము వేల్తురు. కాని, ఇరువురుచేయునదియు నొకటే, ఇరువురకు నది ముఖ్యమే.

ఉదా:— సూర్యచంద్రులకు భూమి అడ్డముగా వచ్చుటచే గ్రహణములు వచ్చును అని పాశ్చాత్యు లందురు. మన వారు సూర్యచంద్రులను రాహుకేతువులు మ్రింగివేయుట వలన గ్రహణములు వచ్చుచున్నవి అందురు. ఇరువురు చెప్పునదియు నొకటే. ఒకేకాలమునకు నిరువురు నిర్ణయించి వచింతురు. కాని, పద్ధతిమాత్రము భిన్నము.

**సర్వాపేక్షన్యాయము**

సర్వసంఘాతముపై నాధారపడినట్లు.

శబ్దసమూహమునకుఁ జెప్పఁబడినయర్థము అందవయవములుగ నున్న ప్రత్యేకపదముల కన్వయించదు.

పలువురిచేఁ గావలసిన పనియొకఁడు వారిలోనివాఁడే యొకఁడు చేయనేలఁడుగదా!

**సలిలాదిత్యన్యాయము**

జలసూర్యునివలె.

వాస్తవమున సూర్యుఁ డొకఁడే అయ్యు నీటిలో అన్ని తరంగములయందును ప్రతిఫలించి అంతమందిసూర్యులుగ తోఁచును.

ఈశ్వరుఁ, డొకఁడే అయ్యు అనేకోపాధుల నాశ్రయించి అనేకరూపములుగ భాసించును.

సవిశేషణేహిన్యాయము

"సవిశేషణేహి విధినిషేధౌ విశేష్యే బాధేసతి విశేషణ ముపసంక్రామతః" అను వేదాంతపరిభాషనుండి ఈ న్యాయము పుట్టినది.

సవిశేషణమై యున్న విశేష్యము బాధింపఁబడినపుడు విధి నిషేధములు విశేషణమునకు సంక్రమించును.

(అప్పుతీసికొనినవాఁడు తిరిగి తీర్చక పరారైనపుడు వాని కూతగ వచ్చి నిలిచిన జామీనుదారుపై జరగవలసిన అన్నివిధములకర్మకాండ విఱుచుకొని పడినట్లు.)

'సహైవ దశభిః పుత్రైర్భారం వహతి గర్దభీ' న్యాయము

పదిపిల్లలతోఁ గలిసి పోవుచున్నను భారమంతయు తల్లి గాడిద ఒకటే మోయుచుండును.

అట్లే—"సహకారిత్వం కర్మణాం న విద్యాయాః......

......సత్సు కర్మసు విద్యైవ స్వకార్యే వ్యాప్రియతే యథా దశభిః పుత్రైః ... ... ..."

విద్యకు కర్మలు సహకారులు కాఁబోవు......అనేకకర్మ లున్నను విద్యయే తనకార్యమున ప్రవర్తించును...... ఇంటిలో పదిమంది తినేవా రున్నను ఇంటియజమాని యొకఁడే ఆయింటిపోషణభారమంతయు మోయునట్లు.

సాకమేధీయన్యాయము

నాలుగేసిమాసముల కొకసారిగ సంవత్సరమునకు మూఁడు మాఱులు—వసంతర్తువున, వర్షర్తువున, హేమంతర్తు

పునః — జేయవలసిన యాగములు కొన్ని గలవు. వానిలో అంతర్భాగములుగ మఱికొన్ని యాగములు గలవు. వానికి సాకమేధములు అనిపేరు. అవి మొత్తము ఏడుభాగములు. వానిలో మూఁడు మొదటి రోజునను తక్కిన నాలుగు భాగములు రెండవరోజునను చేసి మొత్తము కలాప మంతయు రెండు రోజులలో పూర్తిచేయవలెను. కాని, కొందఱు ప్రతియొకభాగము రెండురోజులవంతున మొత్తము కలాపమంతయు పదునాలుగురోజులలో ముగించవలె నందురు. కాని, విధిజ్ఞులు రెండవపక్షమును త్రోసివేసి మొదటిపక్షమునే నిర్ణయించి యుంచిరి.

అట్లే — ఇన్ని రోజులు; కాదు ఇన్నిరోజులు అని రోజులతో సంబంధించిన వాదోపవాదములయం దీన్యాయము ప్రవర్తించును.

## సాధుమైత్రిన్యాయము

సజ్జనులతోటిసహవాసము చిరకాలముండును. దినదిన మభివృద్ధి నొందుచుండును.

అపరాహ్ణచ్ఛాయాన్యాయమువలె.

## సామర్థ్యయోగన్యాయము

సామర్థ్యమువలన పనులు నెఱవేఱునట్లు.

## సావకాశనిరవకాశన్యాయము

'సావకాశ నిరవకాశయో ర్నిరవకాశో బలీయాన్'

ఏదేని యొకపనియందుఁ బ్రవర్తించుట కవకాశము నిచ్చు శాస్త్రము సావకాశశాస్త్రము; అవకాశము నీయని శాస్త్రము నిరవకాశశాస్త్రము. ఆరెంటిలో నిరవకాశ శాస్త్రము బలవత్తరము. అనఁగా ప్రవర్తింపఁగూడదు అని అది రాజుమాదిరిగ శాసించును.

ఎట్లన.— 'న హింస్యా త్సర్వాభూతాని' జీవహింస ఎన్నఁడును చేయరాదు అనునది నిరవకాశశాస్త్రము. 'అగ్నీషోమీయం పశు మాలభేత' అనునది సావకాశశాస్త్రము. ఈరెంటిలో నిరవకాశశాస్త్రము బలవత్తరమై సామాన్య శాస్త్రము నపవాదశాస్త్రము బాధించునుగాన కేవల వేదవిహిత యాగాదికర్మములందక్క తదితరసమయము లందు పశుహింసచేయరాదు అనిబోధించును.

అట్లే - 'బొంకు లాడరాదు' అనునది నిరవకాశశాస్త్రము.

'వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందుఁ
బొంకవచ్చు; నఘము బొంద దధిప'

అనునది సావకాశశాస్త్రము. ఇందు నిరవకాశశాస్త్రము పైనిర్దిష్టసమయములందక్క నీఁక నెన్నఁడును బొంకజనదు. బొంకిన పఘము బొందుట నిక్కువము అని బోధించును.

సాక్షపురుషన్యాయము

"సాక్షః పురుషః పరేణ చేన్నీయతే నూన మక్షిభ్యాం న పశ్యతి"అను వాక్యమున కీ న్యాయము సంక్షిప్త రూపము.

కనులుగలమానిసి ఒకరిచే చేయిపట్టుకొని తీసికొనిపోఁబడుచున్నయెడల నిజముగ నాతఁడు కళ్ళతోఁ జూడఁడు. వేదములు వల్లించియు వేదమంత్రార్థముల నెఱుంగనేఱక యజ్ఞాదికర్మాచరణమునకు భాష్యాదులపైనను, ఇతరుల పైనను నాధారపడియుండుమానిసి కీన్యాయ ముదాహరణముగఁ గైకొనఁబడును.

సింహఘంటాన్యాయము

సింహముమెడలో గంట కట్టువా రెవరు ? విప్పువా రెవరు ?

సింహమృగన్యాయము

సింహమునకు లేళ్ళకు సహజవైరము.

వ్యాలనకులన్యాయమును జూడుము.

సింహమేషన్యాయము

ఒకగొల్లవాఁ డొకసింహపుపిల్లను పట్టుకొని తనమేకలతోఁబాటు పెంచుచుండెను. అదియు మేకలతో కలసి మెలసి తిరుగుచు, తానుకూడ మేకనే అనుబుద్ధితో వర్తించుచుండెను. ఒకనాఁడది అరణ్యమునఁబడి తోడిసింహములను జూచెను. అవి దాని పరిస్థితినిగుర్తించి

నీవు మావలెనే సింహమవు అని బోధించెను. అపుడది మేకనను భ్రాంతి వదలి సింహమయ్యెను.

అజ్ఞానావృతమై యున్నంతదనుక ఆత్మ తాను దేహిని అని తలంచుచుండును. గురూపదేశానంతరము ఆ అజ్ఞానము నశించి స్వస్వరూపజ్ఞానము నొంది పరమాత్మయై పోవును.

రాజపుత్రవ్యాధన్యాయమును జూడుము.

## సింహస్యైకపదన్యాయము

సింహముయొక్క మొదటియడుగువడువున.

తన శత్రువుపైకి పోవునపుడుగాని, మఱొకపుడుగాని సింహము మొట్టమొదటియడుగు మహాటీవితో, మహా సాహసముతో వైచును. తరువాత నేమైనం గానిండు. అట్లే— మొట్టమొదటి ప్రయత్న మతిసాహస శౌర్య ధైర్యాదులతో నొప్పునప్పు డీన్యాయ ముపయోగింపం బడును.

ఎట్లన—

"విచార్యావిచార్య వా, కృతప్రయాణోఽయం మహా నరేంద్ర శ్చలితః! సింహస్యైకపదం యథేతి న్యాయా చ్చలిత ఏవ రాజతే।"

విచారించియో, విచారించకయో మంత్రిముఖ్యులచేం బ్రేరేపింపఁబడి యుద్ధసన్నద్ధుండై బయలుదేరిన రాజు

సింహస్యైకపద న్యాయమున మొట్టమొదటియనుగు వైచెను.

ఆరంభశూరత్వమునుగూడ నీన్యాయము సూచించును.

## సింహావలోకనన్యాయము

సింహము ఒకమృగమును చంపి ముందుకు సాగిపోవుచు, కొంతదూర మరిగినతరువాత తిరిగి వెనుదిరిగి చూచును. అప్పు డింకొకమృగము కనఁబడిన పరుగుపరుగున వచ్చి దానినిగూడ గడతేర్చును. ఇట్లే కనఁబడినదాని నెల్లఁ జంపి వేయును.

సిద్ధాంతి తనవాదమును సమర్థించుకొనుచు కొంతదూరము పోయి వెనుదిరిగి పూర్వపక్షివాదముపై పూర్వపక్షము చేయుచు యుక్తితో వాని నోడించును.

## సింహీక్షీరన్యాయము

సింహముపాలు బంగారుగిన్నెలో మాత్రమే విఱిగిపోక నిలుచును.

వ్యాఘ్రీక్షీరన్యాయమును జూడుము.

## సికతాకూపన్యాయము

ఇసుకదిబ్బలో తీసిన బావివలె.

ఇసుకనేలలో బావిగుంట తీసిన ఒడ్డునిలువక విరిగి పడి పోవును.

వినాశసమయము వచ్చినపు డొకరు కూలద్రోయకయే ఇసుక నేలలోనిబావివలె సర్వము కూలి అగాధమునఁ బడి పోవును.

సికతాతైలన్యాయము

ఇసుకలోనుండి నూనెనువలె.

"తివిరి యిసుమునఁ దైలంబు దీయవచ్చు;
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ;
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ;
జేరి మూర్ఖులమనసు రంజింపరాదు."

భర్తృహరి.

సుందోపసుందన్యాయము

మున్ను అన్నదమ్ములైన సుందోపసుందులను నిరువురు రాక్షసులు అన్యోన్య మతివాత్సల్యమున వర్తించుచు నొకనాఁడు తిలోత్తమ యను దేవకాంతకై పరస్పరము పోరి చచ్చిరి.

" అన్యోన్యనాశ్యనాశకవివక్షాయాం సుందోపసుంద న్యాయః "

అన్యోన్యము వధ్యఘాతకభావమున సుందోపసుంద న్యాయము ప్రవర్తించును.

(రాముడూ, రంగడూ, ఒకటే; రొట్టెదగ్గఱ గిజగిజ)

సుతజన్మమృతిన్యాయము

కొడుకు పుట్టుట, గిట్టుటకూడ సంభవించినట్లు.

ఒకఁ డొకదేవత నారాధించి యొకకొడుకును సంపాదించెను. కొన్నిదినముల తరువాత నాతఁడే మఱల మఱొకదేవతనారాధించి మఱొకకొడుకును సంపాదించెను. అందువలన మొదటిదేవతకు కోపము కలిగి తానిచ్చిన కొడుకును నిమిషములో చచ్చునట్లు చేసెను.

కావున ఒకరినే నమ్మియుండవలెనని న్యాయముయొక్క భావము.

సుధార్ద్రహరిద్రాన్యాయము

సున్నముతోఁ దడిపిన పసుపు యెఱ్ఱబడును.

భిన్న భిన్న పదార్థముల కలయికవలన విలక్షణపదార్థ మొకఁడు పుట్టునపు డీన్యాయము ప్రవర్తించును.

సుపేటికాస్థాపనన్యాయము

అమూల్యవస్తువులను నిరపాయములవు పెట్టెలలో దాచుకొనునట్లు.

జ్ఞానులు తమ మానసమును నిర్దాశమవు బ్రహ్మమునందు నిలిపియుంచుకొందురు.

✓ సుప్తడింభముఖచుంబనన్యాయము

నిదురించు పిల్లవానిమొగము ముద్దుగొనినట్లు.

శవమును కౌఁగిలించుకొన్నట్లు నిష్ప్రయోజనమనిభావము.

సుప్తప్రబుద్ధన్యాయము

నిద్రపోయి మేల్కొన్నట్లు.

నిద్రకుపూర్వమునఁగల సుఖదుఃఖములుగాని, భయద్వేష ములుగాని, మఱేదియైనను నిద్రావస్థయందుండక దూర మవును. మెలకువవచ్చినంతన వెనుకటి పరిస్థితు లన్నియు మఱల నావరించును.

యుద్ధము చేయుచున్న యొక యోధుఁడు పరబాణార్దితుఁడై మూర్ఛ మునిగి ఆబాధగాని, యుద్ధముగాని, యెఱుఁగక మఱచి కొంతతడవట్లు పడియుండి మూర్ఛ దేరినవెనుక మఱల యుద్ధోద్యతుఁడై శత్రువుపై బాణ ప్రయోగ మొనరించును.

అజ్ఞానములో మునిఁగియున్నంతవఱకు ఆత్మ స్వస్వరూప జ్ఞానము లేక భ్రష్ట మవుచున్నను, ఆఅజ్ఞానావరణము విచ్చిపోయినవెను వెంటన తనను తా దెలిసికొనును.

సుభగాబాలోదితాఖ్యాయికాన్యాయము

ఒకస్త్రీ బాలునకు చెప్పిన కథవలె.

ఒకవనిత పిల్లవాని నాడించుచు నీక్రింది కథను చెప్పెను:- అనఁగా అనఁగా ఒకరాజు. ఆరాజుకు ముగ్గురు కొడుకులు. వారిలో ఇద్దరు పుట్టిరి. ఒకఁడు కడుపులోనే ఉన్నాఁడు కాని, యింకను పుట్టలేదు. ఆముగ్గురుకొడుకులు కలిసి ఆడుకొంటూఉండేవారు. ఒకనాఁడు వారు ముగ్గురును కలసి ఉళక్కి పట్టణమునకు వేటకు బయలుదేరిరి. త్రోవలో వారికి ఆకాశముమీఁద పండ్లతో వంగియున్న చెట్టొకటి కంటఁబడెను. వెంటనే వారాచెట్టు దగ్గఱకు పోయిరి.

ఆ చెట్టుఉన్న పట్టణము పేరు భవిష్యన్నగరము. ఆముగ్గురు పిల్లలు ఆ భవిష్యన్నగరములో ఇంకను వేటాడుచునే ఉన్నారు." పిల్లవాఁడు కథ నిజమే అనుకొని ఊఁకొట్టుచూ వినుచున్నాఁడు.

అర్థ—సంసారమునఁ బడి స్త్రీపురుషులు మాయా వృతులై విహరించుచు అనేకకష్టముల బారింబడి ఆశా పాశములు చుట్ట పాపాచరణమునకుంగడంగి మృతులై కర్మఫలానుకూలముగ మఱొకచో జనించి మఱల నశించుచు సంసారము నిజమే అనునమ్మకమున పడరాని పాట్లుపడుచుందురు.

సుభగాభిక్షున్యాయము

చక్కనిచుక్కయైన యువతి యుండవలెను, సన్యాసియుఁ గావలెను అన్నట్లు.

"ఏకత్ర విరుద్ధానేకధర్మసమావేశాసంభవవివక్షాయాం తు సుభగాభిక్షున్యాయః ప్రవర్తతే."
పరస్పరవిరుద్ధములైన అనేకధర్మము లొకచో సమావేశ మగుట సంభవింప నేఱదను నంశమున సుభగాభిక్షు న్యాయము ప్రవర్తించును.

ఎట్లన—"యథా సుభగాత్వం, భిక్షుత్వం; స్త్రీత్వం పుంస్త్వంచ తథావిధపదద్వయసామానాధికరణ్యా త్ప్రతీయమానమపి విరుద్ధత్వా దేకస్మి న్నుపగ న్న సంభవతి తథా—"

సుభగాత్వము, భిక్షుత్వము, స్త్రీత్వము, పుంస్త్వము, మున్నగుధర్మములు — వానిని బోధించు పదములు వాక్యమునఁ బ్రయోగింపఁబడియున్నను — పరస్పరవిరుద్ధముల వ్రట నొకచో—అన నొకవ్యక్తియం దొకేమాఱుగ సంభవింపనట్లు—

"ఏకస్మిన్ శశరూపాప్రవచనే ప్రామాణ్యాప్రామాణ్యలక్షణవిరుద్ధధర్మద్వయం నసంభవతీతి కేచిత్"

ఈశశరూపము నొకేయాప్రవచనమున ప్రామాణ్యాప్రామాణ్యలక్షణవిరుద్ధ మయిన ధర్మద్వయము సంభవింప నేఱదని కొందఱమతము.

"అన్యేతు యథా సుభగాభిక్షుకౌ ప్రబలఘాతకభయాత్కాంచి చ్ఛరణ మాపన్నౌ। స చ శరణాగతత్యాగదోషశ్రవణా త్సర్వప్రయత్నేనోభయో రక్షణే ప్రబలారికృతస్వఘాతభయేన త్యాగేవా ప్రాప్తేపి సుభగాం రక్షతి భిక్షుకం త్యజతీతి యత్తత్ర తస్యేచ్ఛైవ నియామికా నతు కించి ద్వినిగమక మస్తి తథా—"

ఒకసుందరియు, భిక్షుఁడును తమకు హానిఁజేయనున్న ప్రబలశత్రునివలన భీతిలి యొకని మఱుఁగుఁజొచ్చిరి. ఆతఁడును శరణాగతత్యాగము నరకద్వారమని వినియున్న కారణమున వారిం జేరఁదీసెను. కాని, శత్రువు ప్రబలుఁడవుటవలన దనకును హాని శంకించి వారినిఁ ద్యజింపవలసిరాగా, నాతఁడు ఆసుందరినిఁ గాపాడ నీకొని

భిక్షునిమాత్రము త్యజించివైచెను. అట్లు త్యజించివైచుటకు తనయిచ్ఛయే వానిని పురికొల్పినది. శ్లో—

'ప్రకృతేఽపీశవచనాత్వాదుభయోః ప్రామాణ్యే పౌరుషేయత్వా న్మూలప్రమాణసాపేక్షతయా ధర్మాదౌ తదభావా దప్రామాణ్యే వా ప్రాప్తేఽప్యుక్తవిభాగే తార్కికేచ్ఛైవ నియామికే త్యర్థ మాహుః"

ప్రకృతాప్తవచనమున ప్రామాణ్యాప్రామాణ్యములు సంభవించినప్పుడు స్వేచ్ఛగా తార్కికు లొకపక్షమవలంబింతురు అని కొంద అందురు.

ఏతావతా— విషమసంఘటనలు రెండు సంఘటించినపుడేదోయొకపక్షమును స్వేచ్ఛగా నవలంబించుసందర్భమున నీన్యాయము ప్రవర్తించునని రెండవపక్షపు భావము.

సన్న్యాసిద్వయోపాన్యాయమును జూడుము.

## సుమసౌరభన్యాయము

పూవు, తావివలె.

అవినాభావసంబంధము.

శబ్దము, అర్థము; ఉఱుము, మెఱుపు; వెలుతురు, నీడ; మున్నగునవివలె.

## సువర్ణన్యాయము

బంగారమును కఱగినకొలఁది వన్నె హెచ్చును.

శాస్త్రమును తఱచినకొలఁది మెఱుఁగు వచ్చును.

ఒకేబంగారము రకరకముల నగలుగా మాఱి అన్నిరూప ములుగా కనఁబడును.

పరమాత్మ యొకఁడే బహుదేహాంతర్వర్తియై అనేకత్వమున భాసించును.

"మృత్పిణ్డ మేకం బహుభాణ్డరూపం
సువర్ణ మేకం బహుభూషణాని
గోక్షీర మేకం బహుధేనుజాత
మేకః పరాత్మా బహుదేహవర్తీ."

సూకరవాటికాన్యాయము

పంది పూఁదోటలోఁ జొచ్చినట్లు.

" పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా "

పెంట దిని నేలఁ(ద్రు)ళ్ళగించు పంది పూఁదోటలోఁ జొచ్చిన పాదులు పెల్లగించి పూలమొక్కలను ధ్వంసముచేయుగాని సౌరభాదుల ననుభవింపదు.

సాధుసమాజమున కుత్సితుఁడు జేరినట్లు.

సత్కులమున కులపాంసనుఁడు పుట్టినట్లు.

సూకరీప్రసవన్యాయము

పందిపిల్లలు పుట్టినట్లు.

తల్లి కడుపుబాధయేగాని, నిష్ప్రయోజన మని భావము.

సూక్తవాకన్యాయము

సూక్తవాకమును బఠించునట్లు.

"సూక్తవాకేన ప్రస్తరం ప్రహరతి" అనఁగా— సూక్తవాకమును బఠించుచు ప్రస్తరప్రహరణమును చేయవలయును అని శ్రుతి విధించుచున్నది. ప్రస్తరప్రహరణమన దర్భలతో హోమము చేయుట.

ఇందు విధివాక్యమున "సూక్తవాకేన—" అని యుండుటచే ప్రస్తరప్రహరణావసరమున సూక్తము నెంతవఱకు అనఁగా పూర్తిసూక్తమునా లేక దానిలో కొంతభాగమునా చదువవలసినది అని సంశయము. వేదమం దెచటను ఈ విషయమై నిర్ధారణ లేదు. అట్లు వేద మెపుడును నిర్ధారణ చేయదుకూడను.

అంతియగాక— ప్రస్తరప్రహరణ మనేక దేవతలనుగూర్చి యాచరింపఁబడును. ఆయాసూక్తములలో నాయాదేవతలను గుఱించి హోమాదిక మొనర్చునపు డేయే సూక్తము నెంతదనుక బఠింపవలసినదియు వేదమున వచింపఁబడియుండ లేదు.

అట్టియెడ హోమము నెట్లు చేయవలెనను మీమాంసరాఁగా— యజమాని ఏ దేవతను గుఱించి తాను హోమము చేయుచున్నాఁడో ఆదేవతకు సంబంధించిన సూక్తభాగమును గ్రహించి కర్మానుకూలముగఁ దవకవసర మగునంతదనుక ఆసూక్తమును జదువుచు హోమము చేయవలెను. అది యజమాని యధీనము— అని పెద్దలచే నిర్ణయింపబడియున్నది.

అట్లే—యొకవిషయమునఁ దనకు సంబంధించి తనకవసర మగునంతదనుక గ్రహించి మిగిలినదానిని వదలివేయు టలో నీన్యాయము ప్రవర్తించును.

సూచీకటాహన్యాయము

ఒకఁడొక కమ్మరివానికి సూదియొకటియు, కాగొకటియు తయారుచేసి యిమ్మని చెప్పెను. వాఁడు ముందు సూది తయారుచేసి యిచ్చెను కాగేది అనఁగా రెంటిలో నొకటి ముట్టినదిగదా; యిఁక కాగుప్రయత్నము చేసెద నని చెప్పెను.

లోకములో రెండుపనులు— ఒకటి తేలికగ కొలదికాల ములోఁ జేయవీలవునదియు; మఱొకటి కష్టసాధ్యము, బహుకాలము పట్టునదియు — వచ్చినపుడు మొట్టమొదట సులభమైనదానిని మొదలిడి పూర్తిగావించి ఆపిదప రెండవదాని కుపక్రమింతురు.

పరీక్షలో బాలురు ఎక్కువ ఆలోచింప నవసరము లేక తేలికగ వ్రాయగల ప్రశ్నలకు ముందు సమాధానము వ్రాసి, ఆపిదప ఆలోచింపవలసి ఎక్కువవేళ తీసుకొను ప్రశ్నలకు సమాధానములు వ్రాయునట్లు.

అట్లే— వైదికసంప్రదాయమునఁగూడ—

"అనుభవోఽపి ద్వివిధః। ప్రమాఽప్రమాచ। అప్రమాపి సంశయో విపర్యయశ్చ। ప్రమాచ ప్రత్యక్షమనుమితిశ్చ।"

"ప్రమానిరూప్యత్వాత్ పరస్తాద్విభక్తామప్యప్రమాం సూచీకటాహన్యాయేన ప్రాగ్విభజతేఽప్రమాపీతి."

### సూచీముఖన్యాయము

కొన్ని క్రోతులు చలిబాధకోర్వక అగ్నికణము లను భ్రాన్తితో గురువిందగింజలను ప్రోవుచేసి చలికాచుకొన నారంభించెను. కాని, వానికద్దాన చలిబాధతీరకపోవుటయే గాక మఱింత హెచ్చుగకూడ నుండెను. అదేసమయమున సూచీముఖమను నొకపక్షి యటుపోవుచు వానింజూచి నవ్వి—ఓమూర్ఖవానరములారా! అవి నిప్పురవలు కావు. గురువెందగింజలు. అదిగో ఆగుహాలోనికిపొండు. అచట వెచ్చగ నుండును. మీచలిబాధ శాంతించును — అని చెప్పెను. క్రోతులు వినక వెక్కిరించినవి. మఱల సూచీముఖ మటులే చెప్పెను. వెంటనే క్రోతులు లేనిపోని కోపమున—నీవా మాకు బుద్ధిచెప్పునది? అసలు నీకు మాఊసెందుకు?—అని గద్దించుచు పైబడి కొట్టి చంపి వైచినవి.

తనకు మాలిన జోలికి పోయి ఆపదలంబడినతావున నీ న్యాయము ప్రవర్తించును.

దీనికి సూచీముఖీన్యాయ మనియుఁ బేరు కలదు.

### సూచీశతపత్రన్యాయము

నూఱు దలములు గల తామరపూవును ముద్దగ పట్టుకొని సూదితో గ్రుచ్చినచో నూరు రేకులు చిల్లులు పడును. విప్పిచూచిన నవి అన్నియు నొకేమాఱుగ చిల్లు వడినట్లు తోచును. కాని కాలభేదము కలదు. ఒకరేకులో

నుండి, రెండవుదానికిని, అందుండి మూఁడవుదానికిని, నాలవుదానికిని సూది క్రమక్రమముగ దిగి చిల్లు చేయ వలయునుగదా. అట్లు ఒకదానినుండి రెండవుదానికిం బోవు నపుడు సూది కొంత కాలము తీసికొనును. కాని అతిసూక్ష్మ మవుట నయ్యది మనకు గుర్తింప సాధ్యము కాక ఒకేమాఱుగ నవన్నియు చిల్లుపడఁ జేయఁ బడినవని భ్రమింతుము.

శతపత్రపత్రశతభేదనన్యాయము జూడుము.

## సూత్రబద్ధశకునిన్యాయము

ఒకపక్షికాలికి దారము గట్టి మేకునకుఁ గట్టివైచిన నది ఎగిరిపోఁ బ్రయత్నించి ఎగిరెన దార మెంతపొడవున నుండునో అంతదూరముమాత్రము మేకునకు నలువైపుల పోయి మఱల మేకుదగ్గఱకే రాగలుగునుగాని యింకెందును పోఁజాలదు.

అట్లే—మనస్సు అన్నివైపుల నన్నిదిక్కులం బడి పోయి యెచటను నాయతనము లభింపమి మఱల మఱలివచ్చి ప్రాణమునే ఆశ్రయించును. 'ప్రాణబన్ధనం హిసోమ్య మన ఇతి.'

మఱియు—

'శకునిః సూత్రబద్ధో యః స గచ్ఛ న్వివిధా దిశః,
అలబ్ధ్వాధార మాకాశే బన్ధనస్థాన మావ్రజేత్."

"శకునిః సూత్రబద్ధః సన్ దిక్షు వ్యాపృత్య విశ్రమమ్,
అలబ్ధ్వా బన్ధనస్థానం హస్తస్తమ్భాయ శ్రాపయేత్"

సూత్రశాటికాన్యాయము

నూలుతో వస్త్రమును నేయుమన్నట్లు.

"యత్రతు భావిసంజ్ఞయా నిర్దేశః ...... తత్ర సూత్ర శాటికాన్యాయావతారః"

తదానంతరికసంజ్ఞచే దత్పూర్వమే నిర్దేశము కలిగిన యవసరమున సూత్రశాటికాన్యాయము ప్రవర్తించును.

"కశ్చిత్కంచి త్తన్తువాయ మాహ అస్య సూత్రస్య శాటకం వయేతి। స పశ్యతి యది శాటకో నవాతవ్యోథ వాతవ్యో న శాటకః శాటకో వాతవ్యశ్చేతి విప్రతి షిద్ధమ్। భావినీ ఖల్వస్య సంజ్ఞాభిప్రేతా స మన్యే వాతవ్యో యస్మిన్నుతే శాటక ఇత్యేత ద్భవతీతి."

ఒకఁడొక సాలెవాని వద్ద కేఁగి ఈనూలుతో వస్త్రము నేసి యిమ్మనెను. ఆసాలెవాఁడు ఆశ్చర్యపడుచు ఇదేమి, నూలుతో వస్త్రము నేయు మనుచున్నాఁడు? నూలును నేసినఁగదా వస్త్ర మవును? ఇంక వస్త్రమును నేయుట యన నేమి? నూలున్ను నేయు మనియా? ఎట్లు నేయ వలెను?" అని అనేకవిధముల నాలోచించి ఈయన తరు వాతిసంజ్ఞతో వస్త్రమునే నేయుమనుచున్నాఁడు. నేను నేయవలసినది వస్త్రమే—అని నిర్ధారణచేసికొనెను.

పిండి విసరు మనినట్లు. విసరినఁగదా పిండి యను నామము వచ్చునది! మఱి తయారయిన పిండిని విసరుట యననేమి? పిండిని విసరుము అన—తదుపకరణమవు బియ్యమో మఱొకటియో పిండిగా విసరుము అని నిర్దేశించి చెప్పుట.

## సూర్యాస్తన్యాయము

సూర్యుఁ డస్తమించిన చీఁకటి, జారులు, చోరులు బయలు దేరుదురు.

రాజు నశించిన శత్రువులు చెలరేగుదురు.

## సైంధవోదకన్యాయము

సముద్రపునీరువలె.

సముద్రోదకము సూర్యకిరణతప్తమై ఆవిరియై మేఘముగా మాఱి వర్షించి నదులద్వారా మఱల సముద్రమును జేరును.

పరమాత్మస్వరూపము అనేకరూపములొంది బ్రహ్మాండ మంతయు తానుగా రూపములను ధరించి లయావసర మున తిరిగి పరమాత్మలో నైక్యమొందును.

## సోపానారోహణన్యాయము

క్రమముగ ఒక్కొకటిగ మెట్లన్నియు నెక్కి మేడపైకిఁ జేరవలయును.

"ఏవం చానాత్మవిద ఆత్మానం వివిదిషో ర్నారదస్య పర మాత్మాన మేవాస్మై వ్యాఖ్యాస్యామీ త్యభిసన్ధిమా

సనత్కుమారః సోపానారోహణన్యాయేన స్థూలాదారభ్య తత్తద్బ్రహ్మవ్యుత్పాదనక్రమేణ భూమాన మతిదుర్జ్ఞాన తయా పరమసూక్ష్మం వ్యుత్పాదయామాస."

సోపానావరోహణన్యాయము

ఎక్కినవరుసనే మేడమెట్లొకటొకటిగ దిగవలెను.

సౌధసోపానన్యాయము

పై సోపానారోహణ, సోపానావరోహణ న్యాయములను జూడుము.

సౌభరిన్యాయము

"సౌభరేరభివినిర్మితవివిధదేహస్యాపర్యాయేణ మాన్ధాతృ కన్యాభిః పంచాశతా విహారః పౌరాణికైః స్మర్యతే."

పూర్వము సౌభరిమహర్షి మాంధాతృకన్యక లేబదిమందిని పెండ్లియాడి తాను నేబది సౌభరిరూపములు ధరించి వారితో విహార మొనరించియుండెను.

సర్వజ్ఞునకు ఉపాధియోగమే శూన్యము. అచ్ఛేద్యుఁడు కావున బ్రహ్మకును సంసారిత్వము ఘటింపదు. ఆయా ఉపాధుల నాశ్రయించియున్నను పరిశుద్ధబ్రహ్మతత్వమున కెట్టి బంధమోక్షములు నంటవు.

స్తనంధయన్యాయము

పాలు కుడిపి పరుండబెట్టిన శిశువు నిద్రపోవుచూ, జ్ఞాన శూన్యుఁడైనను మహానందమనుభవించువానివలె నిర్వి చారుఁడై పరుండి నిద్రాసుఖ మనుభవించును.

ఆనందస్వరూపుఁడవు పరబ్రహ్మయందు మనసును లీనము చేసి కనులుమూసి బ్రహ్మానంద మనుభవించు జ్ఞాని పైకి స్థాణువువలె నున్నను లోలోన అఖండబ్రహ్మానందరసమున తదేకనిష్ఠతో ఇతరవిచారములు లేక మునుకలాడు చుండును.

స్థవిరలగుడన్యాయము

ముసలివానిచే విడువఁ బడినకఱ్ఱ సరిగా లక్ష్యమును జేరక పోవుటయేగాక తననో చుట్టుప్రక్కలనున్నవారినో రూపుమాపును.

అసంగతవాక్యప్రయోగ మభిమతార్థము నీయకపోఁగా అపార్థమునిచ్చి కొంప గూల్చును.

స్థాలీపులాకన్యాయము

" పర్యాప్తో హ్యేకః పులాకః స్థాలీ నిదర్శనాయ "

అన్నము ఉడికినదో లేదో తెలిసికొనుటకు గిన్నెలోని ఒక మెతుకు పట్టుకొని చూచిన చాలును.

" లింగ మేకత్రాపి దృశ్యమానం తుల్యన్యాయానాం సర్వేషాం ధర్మవత్తాం జ్ఞాపయతి. "

ఒకానొకయెడ నొకమాఱు పరిదృశ్యమానమైన చిహ్న మొకటియే మిగిలినయన్నిలక్షణముల ధర్మములను దెలుపఁ గలదు.

స్థావరజంగమవిషన్యాయము

విషధర్మము ప్రాణహానిచేయుట. ఆవిషమునకును విషము నాశకమే అవును. అందు విషము రెండువిధములు— స్థావరము, జంగమము అని. అందేది నాశకము? ఏది నాశ్యము? అనునది ప్రశ్న.

అట్టియెడ— పూర్వాత్పూర్వబలీయస్త్వ న్యాయముచే పూర్వప్రయుక్తమైన స్థావరవిషము— అనగా వత్స నాభము, తెల్లఈశ్వరము మున్నగునవి— పరప్రయుక్త మైన జంగమవిషమును సర్పాది సంబంధమైనదానిని బాధించును. అనఁగా వత్సనాభాది మూలికాప్రయోగ ముచే పామువిషముకూడ ఉపశమించుట మనము చూచు విషయమే.

అట్లు స్థావరవిషము జంగమవిషమును రూపుమాపి తుదకు తానుకూడ విషసంపర్కముచే నశించును.
కావున పరస్పరబాధ్యబాధకవివక్షయందును, వస్త్వంత రము నుపశమింపఁజేసి తానుకూడ నుపశమించు విషయ మునను ఈన్యాయము ప్రవర్తిందును.

"సామాన్యేన పరస్పరబాధ్యబాధకవివక్షాయాం సుందోప సుందన్యాయవిషయేఽస్య ప్రవృత్తి; పూర్వం నివర్త్యాన్యస్య స్వయమేవ నివృత్తౌ వివక్షితాయాం దగ్ధేంధనవహ్ని న్యాయవిషయేఽస్యావతరణమ్॥"

స్థూణానిఖననన్యాయము

స్తంభము పాతిన పిదప అది జవ్వాడక దృఢముగా నుండుటకై చుట్టును మట్టికూరి యూపుచు మఱలమఱల దృఢము చేయుదురు.

ఒకవిషయమును తొలుత వచించి ప్రకారాంతరమున దానికి దార్ఢ్యమును గూర్చుపట్ల నీన్యాయము వర్తించును. "పునశ్చజగజ్జన్మాదిహేతుత్వ మీశ్వరస్యాక్షిప్య తే స్థూణానిఖననన్యాయేన ప్రతిజ్ఞాతస్యార్థస్య దృఢీకరణాయ."

స్థూలారుంధతీన్యాయము

వివాహసమయమున వధూవరులకు తేలికగ త్వరలో కనుఁగొనుటకు వీలుగ దగ్గఱనున్న పెద్దనక్షత్రమును జూపి ఆప్రక్కన మినుకుమినుకుమనునదియే అరుంధతీ నక్షత్రము, చూడుఁడు అని చూపించునట్లు.

రేఖాగవయన్యాయమును జూడుము.

స్నేహదీపన్యాయము

చమురు లేనిచో దీప మారిపోయినట్లు.

స్ఫటికలౌహిత్యన్యాయము

స్ఫటికము దగ్గఱ జపాపుష్పము నుంచిన స్ఫటికము ఎఱ్ఱగా కాన్పించును; ఆపుష్పమును తీసివైచిన స్ఫటికము మామూలుగనే యుండును.

అట్లే—ఉపాధిస్థితుఁడై ఆత్మ ఆయాఉపాధిగుణభావమున భావింపఁబడును. ఉపాధి నశించిన మఱల స్వస్వరూపమున వెలుగొందును.

"నానావిధవస్తూనాం వర్ణాన్ ధత్తే యథాఽమలః స్ఫటికః,
తద్వ దుపాధే ర్గుణభావితస్య భావం విభు ర్ధత్తే.
విగతోపాధిః స్ఫటికః స్వప్రభయా భాతి నిర్మలో యద్వత్, చిద్దీపః స్వప్రభయా తథా విభాతీహ నిరుపాధిః."

స్రోతోనిమ్నన్యాయము

నీరు పల్లమునకే పోవును.

"నీరు పల్ల మెఱుఁగు నిజము దేవుఁ డెఱుంగు"

స్వకుచమర్దనన్యాయము

తనకుచములు తానే పిసికికొనినట్లు.

తిమురున నుబిసిపడు తనకుచములను తానే పిసికికొని యువతి యెట్టిసుఖ మనుభవించును?

తనను తానే పొగడికొన్నట్లు.

దీనికి స్వకరకుచన్యాయమనియుఁ బేరు కలదు.

స్వదీపచుంబనన్యాయము

మనదీపమేకదా అని ముద్దు పెట్టుకొనిన మూతిమీసములు తెగకాలినట్లు.

"మునుకొని యింటిదీప మని ముద్దిడ మీసలు గాలకుండునే?"

స్వప్నవ్యాఘ్రన్యాయము

కలలో కనుపడిన పెద్దపులి భయపెట్టి గల్లంతు చేసినను మెలకువ కలిగినతోడనే కలతోఁబాటు కనుపడక నశించును.

అవిద్యావరణ మనివార్యమై దృఢముగ నున్నంతదనుక సంసారబంధము పెక్కు-బెడందలఁ బడఁద్రోచినను జ్ఞానము కలిగినవెంటనే అవిద్యావరణముతోఁబాటు సంసారబంధముసయితము దూరమవును.

స్వప్రకాశాశ్రయన్యాయము

వెలుతురునకును, తదాశ్రయమునకును భేదము లేనట్లు. సూర్యునిప్రకాశమునకును, సూర్యునకును భేదమిసుమంతయు లేదు. కాని ప్రకాశముచే మనము సూర్యుని గుర్తించుచున్నాము. సూర్యజ్ఞానమునకు ప్రకాశము సాధన మవుచున్నది.

సగుణ, నిర్గుణ బ్రహ్మలకు భేదము కాన్పింపదు. కాని, సగుణముద్వారా నిర్గుణమును కనుగొనుట సుకరము. కావున నిర్గుణపరబ్రహ్మము నెఱిఁగికొనుటకు సగుణ నిషేవణ మొక సాధన మవుచున్నది.

స్వభావసిద్ధన్యాయము

స్వభావముగఁ గలిగిన గుణములను వస్తువు లెన్నఁడును విడువనేఱవు.

మంచిగంధపుచెక్కను అరుగదీసినకొలఁది సువాసన వచ్చును; బంగారమును కాల్చినకొలఁది వన్నె హెచ్చును.

"స్వవిషమూర్ఛితో భుజంగ ఆత్మానమేవ దశతి" న్యాయము

విషాతిరేకమున నొడలు తెలియని పాము తననే కఱచికొనునట్లు.

స్వవచనమునకు కుయుక్తులచే తానే నిరర్థకత్వమును దెచ్చిపెట్టుకొనునపు డీన్యాయముపయోగింపఁ బడును. ఏడ్చి ఏడ్చి తనతల తానే గోడకు కొట్టుకొన్నట్టు.

స్వామిభృత్య న్యాయము

యజమానునకును భృత్యునకును గల సంబంధముమాదిరి. అన్నివిధముల సమానులయినవారలయందు పరస్పరోపకార్యోపకారకభావము ఘటింపనేఱదు. ఎందువలనన-వా రొకరి రొక రెందును తీసిపోరు.

రాజభృత్యసంబంధమున నట్లుగాదు. తనయజమాని యవుట రాజుపై భృత్యునకు భక్తిశ్రద్ధలపారముగను, నమ్మినబంటు కావున తగినభృత్యునిపై రాజునకు వాత్సల్యమును గలిగి వారు పరస్పరోపకార్యోపకారకభావమున నొప్పుదురు.

"తతశ్చ జీవేశ్వరయోర ప్యుపకారకభావాభ్యుపగమాత్కిం స్వామిభృత్యసంబంధ ఆహోస్వి దగ్నివిస్ఫులింగవదిత్యస్యాం విచికిత్సాయా మనియమో వా ప్రాప్నోతి"

స్వేదజనిమిత్తేన శాటకత్యాగన్యాయము

చెమటపోయు నను భయమున వస్త్రము మానినట్లు.

"యత్రోహ మనస్తాపత్యాపి దుర్జనచక్షుర్దోషభయా దవివేకాభి స్త్రీభి ర్వంధ్యేతి ప్రఖ్యాపితా లోకే మమైవాపత్యా న్యన్యజనాపత్యతయా గీయన్తే సోఽయం స్వేదజనిమిత్తేన శాటకత్యాగన్యాయః॥"

చెడుదృష్టికలవా రెవరేని వచ్చి చూచిన దృష్టిదోషము తగులునేమో యను భయమున చాలమంది పిల్లలు కలదే యైనను ఒకావిడ సంతానములేదు. గొడ్డురాలను అని లోకమునకు చెప్పుకొనుచు తనసంతానమునే చూచి వీరు నాపిల్లలుకారు; ఎవరిపిల్లలో అని చెప్పుకొన్నట్లు.

మృగభియా సన్యాసాశ్రయణన్యాయము, యూకాభియా కంథానాశ్రయణన్యాయమును జూడుము.

హంసకాకన్యాయము

హంస హంసే; కాకి కాకే.

కొండకొనను కూర్చుండిఉన్నా కాకి కాకే. ఇసుకతిన్నె మీఁద సంచారము చేసినను హంస హంసే.

ఏనుఁగు నెక్కి పోయినను మూఢుఁడు మూఢుఁడే. కాలి నడకను పోయినను పండితుఁడు పండితుఁడే.

పంజరములోపెట్టి పోషించినను కాకి కాకేగాని హంసతో సమానమవునా?

పంజరబకన్యాయమువలె.

హంసబకన్యాయము

హంస హంసే; కొంగ కొంగే.

"హంసః శ్వేతో బకః శ్వేతః కో భేదో బకహంసయోః,
క్షీరనీరపృథక్కారే హంసో హంసో బకో బకః."

హంస, కొంగ రెండును వర్ణమున తెలుపే. ఇంక వానిలో భేద మేమున్నది? పాలను నీటిని విడదీయుటలోమాత్రము హంస హంసే; కొంగ కొంగే;
దొరబిడ్డ దొరబిడ్డే; పకీరుబిడ్డ పకీరుబిడ్డే అన్నట్లు.

హస్తామలకన్యాయము

చేతిలోని ఉసిరికాయవలె. (స్పష్టముగ నున్నదని భావము) కరబదరన్యాయమును జూడుము.

హస్తిపదన్యాయము

ఏనుఁగుఅడుగులో అన్ని జంతువుల అడుగులు ఇముడునట్లు.
" సర్వం పదం హస్తిపదే నిమగ్నమ్. "
" హస్తిపదమున నడఁగవే యడుగులెల్ల "
" జంతుపదములెల్ల దంతిపదంబులో
నడఁగుక్రియ ... ... ..." (భారత. శాంతి. 5.145.)
అన్నిశక్తులు పరమాత్మయం దిమిడియున్నవి.

హస్తిమశకన్యాయము

ఏనుఁగకు, దోమకు నెక్కడ పోలిక ?
" నక్క యెడ దివిజాధ్యక్షాలయం బెడ !" అన్నట్లు.

హిరణ్యనిధిన్యాయము

"యద్యపి హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరన్తో న విన్దేయు రేవ మేవేమాః సర్వాః ప్రజా

అహరహ ర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం న విన్ద త్యనృతేన హి ప్రత్యూఢాః॥"

భూమిలో బంగారపు గనిఉన్నను దానిని తెలుసుకోనేఅని వారు దానిమీదుగ ననుదినము నడచుచునేయుందురు. తెలిసికొనువారు త్రవ్వి దానిని గ్రహింతురు.

అర్థే— అనృతప్రత్యూఢులవు మూఢులు బ్రహ్మలోకము తెలిసికొనఁ జాలరు.

మఱియు—

"కుత స్తజ్జ్ఞాన మితచే త్తద్ధి బన్ధపరిక్షయాత్,
అసా వపిచ భూతో వా భావీవా వర్తతేఽథవా.
హిరణ్యనిధిదృష్టాన్తా దిదమేవచ దర్శితమ్॥"

హేరంబనరసింహన్యాయము

ఏనుఁగు, మనుష్యుఁడు కలసి వినాయకుఁడుగాను; సింహము మనుష్యుఁడు కలసి నరసింహమూర్తిగా నైరి.

పరస్పరవిరుద్ధపదార్థములకు సయితము నొకప్పు డొకచో సంయోగము కలుగును.

హోలికాధికరణన్యాయము

హోలికోత్సవము వలె.

(ఇయ్యది మీమాంసాశాస్త్రన్యాయము)

హ్రదనక్రన్యాయము

మడుగును మొసలి; మొసలి మడుగును రక్షించుకొనుచుండును.

అన్యోన్యసంరక్షకత్వమున నీన్యాయప్రవృత్తి.
వనసింహ, వనవ్యాఘ్ర న్యాయములను జూడుము.
మడుగులోని మొసలివలె అని మఱొక యర్థము.
"నీటిలోనిమొసలి నిగిడి యేనుఁగుఁ దీయు
బైట కుక్కచేత భంగపడును" (వేమన)
శ్వానమకరన్యాయమును జూడుము.

క్షీరనింబన్యాయము

వేపచెట్టునకు పాలుపోసి పెంచినను చేదు పోదు.
ఎంత బోధించినను దుష్టుఁడు తనదౌష్ట్యము విడువఁడు.

క్షీరనీరన్యాయము

పాలు, నీరు కలసినట్లు.

ఉ. క్షీరము మున్ను నీటి కొసఁగెన్ స్వగుణంబును దన్ను
జేరుటన్ క్షీరము తప్తమౌట గని చిచ్చుఱికెన్ నెతచే
జలంబు దుర్వారవిపద్విపత్తి గని వహ్ని జొరంజనె
దుగ్ధ మంతలో నీరముగూడిశాంత మగు నిల్చుమహాత్ముల
మైత్రి యిద్ధరన్. (భర్తృహరి.)

క్షీరపాషాణన్యాయము

పాలకొఱకు ఱాల మోసినట్లు.
కావడిలో నొకప్రక్కను పాలకుండను బెట్టుకొని రెండవ
ప్రక్కను దానిబరువు సరితూఁగుటకై ఱాళ్లను బెట్టు
కొనుట మన మెఱింగిన యంశమే.

# అనుబంధము

అంకోలబీజన్యాయము

ఊడుగచెట్టుగింజలు విడిగా మొలకెత్తక ఉరిమినతోడనే చెట్టు కంటుకొనును.

"కామధియ స్త్వయి రచితా న పరమ రోహన్తి యథా కరమ్భబీజాని, జ్ఞానాత్మ న్యగుణమయే గుణగణతోఽస్య ద్వన్ద్వజాలాని."

భాగవ. స్కం. 6. అ. 16. శ్లో. 39.

విషయకామేనాపి కృతా త్వత్సేవా మోక్షఫలైవేత్యాహ-కామధియః విషయకామనా అపి హేపరమ త్వయి రచితాః, కృతాశ్చే న్నరోహన్తి దేహాన్తరోత్పత్తయే నభవన్తి కరమ్భబీజాని భర్జితబీజాని యథా । యతోఽస్య జీవస్య గుణగణాదేవ ద్వన్ద్వసమూహాః భవన్తి । అతః కామేనాపి నిర్గుణస్య తవ భజనా చ్ఛనై ర్నైర్గుణ్యం భవతీత్యర్థః॥

అంగారన్యాయము

బొగ్గును ముట్టుకొన్నట్లు.

కాలుచు ఉన్న బొగ్గును ముట్టుకొనిన చేయి కాలును. చల్లారినబొగ్గును ముట్టుకొనిన చేతికి మసి అంటుకొనును. ఏవిధముగానైనను బొగ్గును ముట్టుకొనుట అసంగతమే.

ఉదా:—దుష్టసాంగత్యము.

అండకుక్కుటీన్యాయము

గ్రుడ్డు లేనిదే కోడి రాదు; కోడి లేనిదే గ్రుడ్డురాదు. బీజాంకురన్యాయమును జూడుము.

అంధకవర్తకీయన్యాయము

గ్రుడ్డివానిచేతిలో పిచ్చుక పడినట్లు.

అప్రయత్నముగ కలిగిన లాభములయందీ న్యాయప్రవృత్తి కలుగును.

అంధచటకన్యాయము

పై అంధకవర్తకీయ న్యాయమును జూడుము.

అగతికగతిన్యాయము

గతిలేనివాఁ డేదోయొక గతి చూచుకొనునట్లు.

మగఁడు దొరకనప్పుడు అప్పమగఁడే గతి అన్నట్లు.

అగ్నిశిఖాన్యాయము

అగ్నిజ్వాల ఎటు త్రిప్పినను మీఁదికే పోవును.

అగ్నిహోత్రన్యాయము

"యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" "ప్రదోష మగ్నిహోత్రం హోతవ్యం వ్యుష్టాయాం ప్రాతః" ఇత్యాది వాక్యములచే దినదినము విధిగా అగ్నిహోత్రోపాసన చేయవలయునని శ్రుతులచే విధింపఁబడియున్నట్లు.

ఇతరకార్యములన్నియు వదలియైన నేదేనియొక ముఖ్య కార్యము నవశ్య మాచరింపవలయునని విధి గల తావుల నీన్యాయ ముపయుక్తము.

## ఆగ్న్యానయనన్యాయము

"నిప్పు తీసుకొనిరమ్ము" అనిన ఏదేనిపాత్రలో వేసుకొని అని వేఱె చెప్పవలెనా ?

జలానయనన్యాయమును జూడుము.

## అజాతపుత్రనామోత్కీర్తనన్యాయము

పుట్టని కొడుకుగుణములను పొగడుకొన్నట్లు.

ఆలు లేదు; చూలు లేదు; కొడుకుపేరు సోమలింగము అన్నట్లు.

## అజాయుద్ధన్యాయము

మేకలపోట్లాట మొదట ఆడంబరముగ నుండి తుదిని క్రియ శూన్యమవును.

"అజాయుద్ధే ఋషిశ్రాద్ధే ప్రభాతే మేఘడంబరే
దమ్పత్యోః కలహేచైవ బహ్వారమ్భో లఘుక్రియా."

ఆరంభశూరత్వము నీన్యాయము సూచించును.

మేషయుద్ధన్యాయ మనియు దీనికిఁ బేరు కలదు.

## అజ్ఝల్న్యాయము

అచ్చులు ప్రాణములు; హల్లులు ప్రాణులు. అచ్చుతో సంయోగ మున్నంతదనుక హల్లులకు స్ఫుటోచ్చారణ ముండును; లేనిచో హల్లున కుచ్చారణమే యుండదు.

అట్లే—ప్రాణ మున్నంతవఱకే దేహవ్యాపారము.

## అతిదేశన్యాయము

ఒకస్థానమున నున్నపుడు వస్తువున కాస్థానధర్మముల నారోపించునట్లు.

వాతావరణమును బట్టి భూమికి శైత్యోష్ణ్యాదులు సంభవించునట్లు.

## అతీతమహిషీస్నేహన్యాయము

గార్హస్థ్యములో నున్నపు డొకఁ డొకబఱ్ఱెను మహా ప్రేమతో పెంచెను. కాలాంతరమున నాతఁడు సన్యాసాశ్రమమును స్వీకరించి తత్త్వోపదేశమును పొందెను. అయినను వెనుకటిబుద్ధి మాఱక వాని కెపుడును ఆబఱ్ఱెయే మనసున స్ఫురించుచుండెడిదఁట.

అవస్థాభేదము సంభవించినను పూర్వావస్థయందలి వాసనలు వదలిపోనితావున నీన్యాయ ముపయుక్తము.
"కృతేఽపి కేశసంస్కారే భార్యాత్వం నైవ ముంచతి" అన్నట్లు.

## అదగ్ధదహనన్యాయము

అగ్ని కాలక పచ్చిగా నున్నదానినే కాల్చునుగాని కాలిపోయినదానిని కాల్చదు.

సంసారబంధము రాగాసక్తునికే గాని రాగరహితునకు తగుల్కొనదు,

అదితో౽ర్వణిజః ప్రతిదినం పత్రలిఖిత శ్వస్తనదినభణనన్యాయము
ఈయ నిచ్ఛలేని వర్తకుఁడు రేపురా మాపురా అని ప్రతి దినము చెప్పినట్లు.

"........ఏవం తర్హి ముద్గరాదిసన్నిధానేఽపి ఏషఏవ తస్య స్వభావ ఇతి పునర ప్యనేన తావన్తమేవ కాలం స్థాతవ్యమితి నైవం వినశ్యేదితి సోఽయ మదితో౽ర్వణిజః ప్రతిదినం పత్రలిఖితశ్వస్తనదినభణనన్యాయః."

అధికరణసిద్ధాన్తన్యాయము

ఒక సిద్ధాంతమునందు మఱొకఁడంతర్భూతమైయుండునట్లు. ఒకవిషయము నొకవిధముగా సిద్ధాంతీకరించుకొని దానిపై మఱల నింకొకరకమున నూహాపోహాలు సేయుట అని న్యాయాశయము.

సిద్ధాంతము నాలుగు విధములు—(1) సర్వతంత్రసిద్ధాంతము. (2) ప్రతితంత్రసిద్ధాంతము. (3) అధికరణసిద్ధాంతము. (4) అభ్యుపగమసిద్ధాంతము.

1 సర్వసామాన్యముగ వర్తించునది సర్వతంత్రసిద్ధాంతము.

2 కొందఱచేమాత్ర ముపయోగింపఁబడునది ప్రతితంత్ర సిద్ధాంతము.

3 ఊహాపోహాలతోనుండునది అధికరణసిద్ధాంతము.

4 వ్యతిరేకసిద్ధాంత మభ్యుపగమసిద్ధాంతము.

వ్యతిరేకమన— ఒకవాక్యమును చెప్పి తద్వ్యతిరేకవాక్యముచే మొదటివాక్యమందలిసిద్ధాంతమునే నుడువుట.

ఎట్లన—నీచాచారపరుఁడు నీచయోనులను బొందును; తదితరుఁడు అనఁగా నీచాచారపరుఁడు కానివాఁడు నీచ యోనులను పొందఁడు అన్నట్లు. ఇందు రెండవదివ్యతిరేక వాక్యము. రెండువాక్యముల తాత్పర్యము నొక్కటియే. (మొదటిదానికి వ్యతిరేకము రెండవది; రెండవదానికి వ్యతిరేకము మొదటిది.)

అధికారన్యాయము

ఒకకృత్యమునకుగల అధికారమువలె.

ఏదేనికర్మయందు ప్రవర్తింప దాని కనువవు నధికార మత్యవసరము. అట్లధికార ముండియు నాకృత్యమొక వాంఛతో నారంభింపఁబడును. "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనినపుడు జాతపుత్రత్వాద్యధికార సంపన్నుఁడయ్యు యజమానుఁడు స్వర్గకామనయా జ్యోతిష్టోమ, దర్శ పూర్ణమాసాదులయందు ప్రవర్తించునట్లు.

అధ్యారోపాపవాదన్యాయము

అన్యధర్మముల నొకదానియం దారోపించి అదియే అది అని బోధించి మఱల కాదనుచు తద్ద్వారా అభిమతవస్తువును తెలుపునట్లు.

అరుంధతీప్రదర్శన న్యాయమును జూడుము.

అనవస్థాన్యాయము

ఉపపాద్యోపపాదకములకు సంబంధము లేనట్లు.

## అనువృత్తిన్యాయము

పూర్వసూత్రమునుండి కొన్ని పదములు అర్థవివరణమునకై ఉత్తరసూత్రములోనికిఁ గొనిపోవుట అనువృత్తి అనఁబడును. (వ్యాకరణాదిసూత్రములయందీ అనువృత్తి సుస్పష్టము)

స్వప్రయోజనసాధనమునకై పూర్వాపూర్వాంశముల నాశ్రయించుపట్ల నీన్యాయ ముపయుక్తము.

అనువృత్తి ఆవృత్తికి రూపాంతరము. ఆవృత్తియన నుద్దిష్ట విషయమును మఱల మఱల వచించుట. అట్లొనర్చుటవలన పూర్వ విషయము సుదృఢ మవును.

"అభ్యాసం కూసు విద్య" అన్నట్లు.

## అన్యోన్యాశ్రయన్యాయము

ఒకదాని కొకటి ఆశ్రయ మవుట.

వనసింహ, వనవ్యాఘ్ర, హ్రదనక్ర, న్యాయములను జూడుము.

## అన్వయవ్యతిరేకన్యాయము

ఒకచో నొకవస్తు వుండిన నింకొకవస్తు వుండును. అది లేనిచో రెండవదియు నుండదు. వానిలో మొదటిది రెండవదానికి కారణమవును. దీనికే అన్వయ వ్యతిరేక మని పేరు.

"జన్మాద్యస్య యతోఽన్వయా దితరతః..."

భాగవతము.

## అపచ్ఛేదన్యాయము

"ఏకకర్తృకోఽపచ్ఛేదః" నలువురు కలసి ఏకముఖమున నొకపనిచేయునపుడు వారిలోనివాఁడే యొకఁడాపనికి భంగము కలిగించుటకు అపచ్ఛేదము అనిపేరు.

ఉదా:— జ్యోతిష్టోమసవన మందొకానొక సమయమున ఋత్విక్కులందఱు ఒకరినొకరు పట్టుకొని చీమల బారువలె నడువవలయును. అట్టితఱి వారిలోనివాఁడే యొకఁడు ప్రమాదవశముననే కానిండు అగ్రేసరుని గోచి విడచిపెట్టినఁ (కచ్ఛవిమోచన మొనరించిన) తత్కృత్య మంతయు భగ్నమగును. కావున—

పూర్వవస్తువువలన పరవస్తువునకు భంగము వాటిలునపు డీన్యాయము ప్రవర్తించును.

## అపవాదన్యాయము

పూర్వోదాహృతవిషయమునకు బాధకముగా నుడువఁబడు నుత్తరవాక్యమునకు అపవాదము అనిపేరు.

ఉదా:— కర్మప్రవృత్తులును భగవంతుని పొందగలరు. కామనయా కర్మప్రవృత్తులుమాత్ర మట్లు పొందనేఱరు. ఇందు సర్వసామాన్యముగ భగవత్ప్రాప్తిని వచించు మొదటివాక్యము (సామాన్యశాస్త్రము) నకు బాధకముగ కొంతవ్యవస్థ అనఁగా కామరహితముగ కర్మల యందు ప్రవర్తించువారలు అని కల్పించుచు ప్రవర్తించు రెండవవాక్యము అపవాద (శాస్త్ర)ము అని నుడువఁ బడుచున్నది.

అశ్లో—ఉత్తరాంశమువలనఁ బూర్వాంశమునకు బాధ కలుగు సందర్భమున నీన్యాయము ప్రవర్తించును. "అపవాదై రుత్సర్గా బాధ్యన్తే" అను పరిభాషనుండి యీన్యాయ ముత్పన్నమైనది. వ్యాకరణశాస్త్రమున నీ న్యాయమెక్కుడుగ నుపయోగింపఁబడును.

అపసారితాగ్నిభూతలన్యాయము

నిప్పు తీసివైచినను మొట్టమొదట ఆనిప్పు ఉంచఁబడిన స్థలమున ఆనిప్పుచే కలిగిన వేడిమాత్రము పోదు.

చంపకపట, రామఠకరండ న్యాయములను జూడుము.

అబ్ధిఫేనాదిన్యాయము

సముద్రములోని నీటిబుడగలు, నురుగు మున్నగునవి క్షణములో పుట్టి క్షణములో నశించుచుండును.

ఉదా:—సంసారసముద్రములో జీవులు.

అబ్భక్షన్యాయము

నీళ్ళు త్రాగి జీవించునట్లు.

వాయుభక్షణన్యాయమును జూడుము.

అభ్యుపగమసిద్ధాంతన్యాయము

అధికరణసిద్ధాంతన్యాయమున నీన్యాయముయొక్క స్వరూపము వివరింపఁబడినది.

అయాచితమండనన్యాయము

ఒకవస్తువు అయాచితముగ లభించి తుద కది అలంకారముగగూడ ఉపయోగించినట్లు.

ఉదా:—నీలఘటాదులు.

అరణ్యచంద్రికాన్యాయము

వనచంద్రికాన్యాయమును జూడుము.

అరుణైకహాయనీన్యాయము

ఒకసంవత్సరము వయసుగల ఎఱ్ఱని ఆవు అన్నట్లు.

అరుణశబ్దము అరుణగుణవాచకము. గుణివిషయికముగ ప్రయోగింపఁబడినపుడు ఆ అరుణశబ్దము అరుణగుణివాచకముగూడ నగుచున్నది.

ధర్మవాచకము ధర్మివిషయత్వముగఁ బ్రయోగింపఁబడి ధర్మివాచకమైనపు డీన్యాయ ముపయోగింపఁబడును.

అరుంధతీప్రదర్శనన్యాయము

అరుంధతిని చూపించినట్లు.

"యథారున్ధతీం దిదర్శయిషు స్తత్సమీపస్థాం స్థూలాం తారా మముఖ్యాం ప్రథమ మరున్ధతీతి గ్రాహయిత్వా తాం ప్రత్యాఖ్యాయ పశ్చా దరుంధతీమేవ గ్రాహయతి తద్వ న్నాయ మాత్మేతి బ్రూయాత్"

శాంకరబ్రహ్మసూత్రభాష్యమ్ ౧౧. ౮.

అరుంధతిని చూపవలయుననిన తొల్దొల్త అరుంధతీ నక్షత్రసమీపమున నున్న పెద్దనక్షత్రమును జూపి తత్ప్రత్యాఖ్యానముచేయుచు దానిసమీపముననున్న చిన్న నక్షత్ర మరుంధతి యని బోధించునట్లు.

అధ్యారోపాపవాద న్యాయమును జూడుము.

అర్ధకుక్కుటీన్యాయము

కోడిని కోసి సగభాగమును తినుటకును, తక్కినసగమును గ్రుడ్లు పెట్టించుట కుపయోగించుకొనవచ్చునని తలచి నట్లు.

అర్థలౌకికన్యాయము

అలౌకికములైన వేదాదులకు లౌకికగ్రంథసంచయము వలననే అర్థము గ్రహింపవలసియుండును.

అవిరావికన్యాయము

అవి అనఁగా గొఱ్ఱె; ఆవిక మనఁగా గొఱ్ఱెసంబంధమైన దని అర్థము. (ఒకటి విగ్రహవాచకము; రెండవది తదుత్పత్తివాచకము.)

"తత్ర ద్వయోః శబ్దయోః సమానార్థయో రేకేన విగ్రహోఽపరస్మా దుత్పత్తి ర్భవిష్య త్యవిరావికన్యాయేన తద్యథా—అవే ర్మాంస మితి విగృహ్య ఆవికశబ్దా దుత్పత్తి ర్భవతి ఆవికమితి"

అశోకవనికాన్యాయము

లంకలో సీతను రహస్యముగా నుంచుట కనేకస్థలము లున్నను రావణుఁడామెను అశోకవనములో నుంచుఁడని రాక్షసుల కానతిచ్చెను.

ఒకపనిని సాధించుట కనేకమార్గము లున్నను ఒకపద్ధతిని నిర్ణయించి వచించునపు డీన్యాయ ముపయుక్తము.

**అశ్వతరీగర్భన్యాయము**

కంచరగాడిదె చూడి మోసి ఈనినవెంటనే చనిపోవును.

వృశ్చికీగర్భన్యాయమును జూడుము.

**అశ్వభృత్యన్యాయము**

వీఁ డెవనిభృత్యుఁడో వానిది ఈగుఱ్ఱము; ఈగుఱ్ఱ మెవనిదో వానికి వీఁడు భృత్యుఁడు అని నిర్దేశించి చెప్పినట్లు.

**అసంజాతవిరోధిత్వన్యాయము**

పుట్టనివానిపై తనకు విరోధియని వైర మూనినట్లు.

అజాతపుత్రగుణోత్కీర్తనన్యాయమువలెనే.

**అసిధారామధులేహనన్యాయము**

కత్తిఅంచుననున్న తేనెను నాకినట్లు.

"కామైర్న తృప్తిః సంసారే క్షురధారామధూపమైః"

**అహినకులన్యాయము**

వ్యాలనకులన్యాయమును జూడుము.

**అహినిర్ల్వయినీన్యాయము**

పాముకుబుసముమాదిరి.

కుబుసము విడిపోక తన కంటియున్నంతదనుక పాము అది తనదేహామే అనుకొనును; విడిపోయినతరువాత పామునకు కుబుసము తనది అనే జ్ఞానమే ఉండదు.

జ్ఞానోదయమై అజ్ఞానావరణముతోబాటు దేహాభిమానము నశించినవెనువెంటన తొలుతఁ గల నాదేహము అను భ్రాంతియే జ్ఞానికి నశించును.

## అహిభుక్కైవర్తన్యాయము

నల్లమందుతినిన ఉన్మత్తుఁడు, జాలరివలె.

నల్లమందు తిని మతిపోయినవాఁ డొకఁడు పడవనెక్కి పోవుచు తక్కినమనుష్యులలో కలిసి మాఱుపడుదునేమో అనుభయమున తనకాలికిని పడవకును త్రాటితో కట్టివైచి కొని పరుండెను. వాఁడు గాఢనిద్రపోయినపిమ్మట పల్లెకారి పరిహాసమునకై ఆత్రాటిని విప్పి తనకాలికి కట్టివైచికొని పరుండెను. కొంతసేపటికి ఉన్మత్తుఁడు మేల్కొని తనకాలికి త్రాడు లేకుండుటయు, పల్లెవాని కాలు ఆత్రాటిచే కట్టబడియుండుటయుఁ జూచి వాఁడే నేను; నేనే వాఁడు అను తాదాత్మ్యాధ్యాసతో లేచి వానితో—ఓరీ! నేనే నీవు; నీవే నేను—అని వాదన పెట్టుకొనెనఁట

అట్లే—తాదాత్మ్యాధ్యాసయం దీన్యాయము ప్రవర్తించును.

## అహిమూషకన్యాయము

అహినకుల, వ్యాళనకుల న్యాయములట్లు.

తే. వినవె యహిమూషకన్యాయమున ధరిత్రి
నాక్రమంబున నమరేంద్ర యసురవిభుని
తోడ సంధింపు మని పంపెఁ దోయజాత
నాథుఁ డరుదెంచె వైకుంఠనగరమునకు."

దశావ. కూర్మా. 49. పు.

### అక్షికాణన్యాయము

కాణశబ్దమునకు కాయకంటివాఁడు అని అర్థము. అయినను "అక్షికాణ" అందురు.

వాజిమందురా, నీలేందీవర న్యాయములవలె.

### అక్షిపాత్రన్యాయము

లూతాతంతువులు కంటిలో పడిన గ్రుడ్డుకు బాధకలిగించునుగాని యితర అవయవములకు స్పృశించినను, మఱే మొఱర్చినను ఏమియు చేయజాలవు.

"ఊర్ణాపక్ష్మ యథైవహి కరతలసంస్థం న విద్యతే పుంభిః అక్షిగతం తు తదేవ హి జనయ త్యరతించ పీడాంచ. కరతలసదృశో బాలో న వేత్తి సంస్కారదుఃఖతాపక్ష్మ, అక్షిసదృశస్తు విద్వాన్ తేనై వోద్వేజతే గాఢమ్."

అతిసున్నితమై మిక్కిలి చుఱుకు (సూక్ష్మగ్రాహిత్వము) గలతావున నీన్యాయము ప్రవర్తించును.

### అకాశపరిచ్ఛన్నన్యాయము

అనంతమై ఏకమైనను ఆకాశము ఘటాదులయందు ప్రతిబింబించి పరిచ్ఛిన్నమై నానాత్వము నొందును.

పరబ్రహ్మ మనంతము, అద్వితీయము అయ్యు ఉపాధులయందు అనుప్రవిష్టమై పరిచ్ఛిన్నమై అనేకత్వమున భాసించును.

ఆఖ్వన్నపిటకన్యాయము

"ఘాతయితుమేవ నీచః పరకార్యం వేత్తి న ప్రసాధయితుమ్
పాతయితుమేవ శక్తి ర్నాఖో రుద్ధర్తు మన్నపిటమ్."

ఎలుక అన్నమును క్రింద పడవేయఁగలదు గాని ఎత్తలేదు. దుష్టుఁడు పరులకార్యమును చెడగొట్టఁగలడుగాని తిరిగి బాగుచేయలేఁడు.

" నాహం శక్తో గృహారంభే శక్తోహం గృహాభంజనే " అన్నట్లు.

ఆత్మాశ్రయన్యాయము

తనను తానే ఆశ్రయించికొని ఉన్నట్లు.

ఆదిత్యగతిన్యాయము

ఆకాశముమీఁద సూర్యుఁడు కదలుచున్నట్లే కనఁబడక కొంతసేపటిలో మఱొకచోఁ గనఁబడును.
తెలియకుండగనే మార్పు కనుపడుపట్ల నీన్యాయ ముప యోగించును.

ఆభాణకన్యాయము

ప్రతివారు మాటలమధ్య— ఏదో సామెత చెప్పినట్లు— అని ఉపయోగించుచుందురు. కాని ఆసామెత ఏదియో చెప్పరు.

ఆమోదషట్పదన్యాయము

వాసననుబట్టి తుమ్మెద పువ్వున్నచోటును గుర్తించును.

ఆరఘట్టఘటీన్యాయము

ఏతమునకు కట్టిన బాన క్రిందికి పోవుచు, పైకి లేచుచు నుండును.

అర్థము—పురుషులు వృద్ధిక్షయములయందుఁ దదనుగుణముగ ప్రవర్తింతురు.

ఘటీయంత్రన్యాయమును జూడుము.

ఆరోహావరోహణన్యాయము

ఎక్కినవరుసనే మెట్ల క్రిందికి దిగవలెను.

సోపానారోహణ, సోపానావరోహణ, సౌధసోపాన న్యాయములను జూడుము.

ఆశామోదకతృప్తన్యాయము

ఆశ అనే లడ్డూలతో తృప్తిపొందినవానివలె.

ఆశామోదకయుతులకు, ఉపార్జితమోదకవంతులకు గల భేదము తద్ద్వారా కలిగిన తృప్తియందును గలదు.

"ఆశామోదకతృప్తా యే యేచోపార్జితమోదకాః
రసవీర్యవిపాకాది తుల్యం తేషాం ప్రసజ్యతే."

"ఆశామోదకోపార్జితమోదకయో రస్త్యేవ స్వప్నేఽపి కియ ద్వైలక్షణ్యమ్."

"శా. ఆశామోదకభక్షణంబునకు నన్నా కోల్పితీభంగి."

కాకాని మల్లీశ్వరమాహాత్మ్యము.

(తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు)

ఇందుక్ష్వేడన్యాయము

ఈశ్వరుఁడు చంద్రుని, విషమును గ్రహించినను చంద్రుని తలపైనను, విషమును కంఠమందును ధరించినాఁడు.

అట్లే—బుద్ధిమంతుఁడు గుణదోషములను రెంటిని గ్రహించి గుణములను వెలువరించును; దోషములను అణచివేయును.

ఇంద్రజాలన్యాయము

కనుకట్టువిద్యవలన ఒకటి మఱొకటిగా కనఁబడునట్లు.

ఉదా: — మిథ్యాప్రపంచము.

ఇషుకారన్యాయము

బాణములుచేయువాని విధమున.

"ఇషుకారో నరః కశ్చి దిషా వాసక్తమానసః,

సమీపేనాపి గచ్ఛన్తం రాజానం నావబుద్ధవాన్."

బాణములు చేయువాఁ డొకఁ డాబాణములదృష్టిలోపడి తనదగ్గఱనుండియే పోవుచున్న రాజునుసైతము గుర్తించ లేదఁట. స్వకార్యవ్యగ్రతచే ముగ్ధుఁ డయ్యెనని భావము. అట్టిసందర్భముల నీన్యాయము ప్రవర్తించును.

ఇక్షుదండన్యాయము

చెఱకుగడలోని కణుపు లొకదానికన్న మఱొకటి రుచిగా నుండును.

ఉదా:—(జరిగినకొలఁది) సజ్జనమైత్రి.

ఉభయతస్పాశాబద్ధన్యాయము

రెండువైపుల త్రాళ్ళచే బంధింపఁబడి యున్నవాఁడు వలె. ఎటూ మెదలలేని స్థితి అని భావము.

ఊర్ణనాభిన్యాయము

లూతాతంతున్యాయమును జూఁడుము.

ఋతుమతీకన్యకాన్యాయము

ఋతుమతియైన కన్య తనతలిదండ్రులనుండి దృష్టి మఱల్చి భర్తపై ననురాగము, ప్రేమ జూపుచు సుఖమనుభవించుచు మహానందము నొందును.

సంసారత్యాగము చేసిన బ్రహ్మజ్ఞాని బ్రహ్మయందే తన మనోవాక్కాయముల నునిచి మహానంద మొందును.

ఏకవృంతగతఫలద్వయన్యాయము

ఒకే తొడిమను రెండు పండ్లున్నట్లు.

శ్లేషయందొకే పదమున రెండర్థములు స్ఫురించుచుండును.

ఏరండబీజన్యాయము

ఆముదపుగింజను (కాడనుండి విడదీసిన) నీటితోఁదడిపిన పైకెగురును.

జలతుంబికా, పంజరముక్తవిహంగోడ్డీన, పంజరముక్తపక్షి న్యాయములను జూడుము.

ఒతప్రోతన్యాయము

బట్టలో పడుగు పేకవలె.

"......యస్మి న్నోతప్రోత మిదం జగత్"

భాగవతము.

ఔపాధికాకాశభేదన్యాయము

ఆకాశపరిచ్ఛిన్నన్యాయమును జూడుము.

కంఠచామీకరన్యాయము

బంగారుగొలుసును కంఠములో వైచికొని మఱచి "అయ్యో! నాగొలుసు పోయినది" అని ఏడ్చుచు వెదకుకొను వాఁడు—అదిగో, నీగొలుసు నీమెడయందే ఉన్నది-అని ఒరులు చూపిన చూచి "ఉన్నది" అని ఊరడిల్లును. తనయందున్న ఆత్మను తెలిసికొనలేఁక తికమకబడువాఁడు గురూపదేశమున ఆత్మజ్ఞానము కలిగి స్వస్థచిత్తుఁ డవును.

కందుకన్యాయము

బంతిని క్రింద పడవైచిన మీఁది కెగరి తిరిగి క్రిందపడు చుండును.

ఉదా—హానివృద్ధులు.

కడారాన్యాయము

"కడారాః కర్మధారయే" అని పాణినీయసూత్రము. కడారాః అనుపదము బహువచన ప్రయోగముమాత్రము నన సూత్రమున ఆదిశబ్ద మప్రయుక్త మైనను కడారాదులు అను నర్థమిచ్చుచున్నది.

కేవలబహువచనాంతత్వమున ఆద్యర్థమును బోధించునెడ నీన్యాయప్రవృత్తి.

కదంబకోరకన్యాయము

గుండ్రనికడిమి చెట్టు (పూవు) నకు చుట్టు నొకేమాఱు మొగ్గలు పుట్టును.

ఒక్క-మాఱుగ సన్నితావుల ప్రసారముగలయెడ నీన్యాయము పయోగింపఁబడును.

కదళీఫలన్యాయము

అరటిచెట్టు గెలవేసి పండ్లు పండినవెనువెంటన కొట్టివేయఁబడును.

అశ్వతరీగర్భ, వృశ్చికీగర్భ న్యాయములను జూడుము.

కనకకుండలన్యాయము

బంగారమువలన కుండలములు తయారగుచున్నవి. కుండలములు చెడిపోయిన బంగారమే అగును. ఆదిమధ్యావసానములయందు బంగారమునకును, కుండలములకును రూపమాత్రమే కాని వేఱొండు భేదము లేదు.

ఉదా:— బ్రహ్మము, తత్సృష్టప్రపంచము.

కపింజలన్యాయము

"కపింజలా నాలభేత" తిత్తిరిపక్షులను విశసింపవలెను అని సూత్రము. అనుచో సూత్రమున నిన్నిపక్షులను అని నిర్ధారణ లేనందువలన ఎన్నిపక్షులను అను శంక రాఁగా

సూత్రమున బహువచనప్రయోగముచే మూఁడింటిని అని స్పష్ట మగుచున్నది.

"ఇహేదానీం చతుర్ణాం మహాభూతానాం సృష్టిసంహార విధి రుచ్యతే"

మహాభూతానా మి త్యుక్తే త్రయాణామేవ పరిగ్రహః కపింజలా నాలభేతేతివ ద్బహుత్వసంఖ్యాయా స్త్రావత్యేవ చరితార్థత్వాత్। అత శ్చతుర్ణా మిత్యుక్తమ్.

కమ్బలనిర్ణేజనన్యాయము

కంబళి కాళ్ళకు వేసి దులిపినట్లు.

కాళ్ళకు బాదుచు కంబళిని దులిపిన కంబళి బాగుపడు టయు, కాళ్ళదుమ్ము వదలుటయు రెండులాభములు కలుగుచున్నవి.

"ఏకా క్రియా ద్వ్యర్థకరీ" అన్నట్లు ఒకేపనివలన ఫల బాహుళ్యము సంభవించునపు డీన్యాయ ముపయోగింపఁ బడును.

"అపిచ దధి ఉభయ మసమర్థం కర్తుం ఫలం సాధయితుం హోమంచ నను కంబలనిర్ణేజనవ దేత ద్భవిష్యతి। నిర్ణే జనంహి ఉభయం కరోతి కంబలశుద్ధిం పాదయోశ్చ నిర్మలతామ్."

కరకంకణన్యాయము

కంకణము అనిన చేతి కలంకారముగ ధరించు భూషణము అని అర్థము. అయినను కరకంకణము అందురు.

వాజిమందురా, నీలేందీవర, కరిబృంహిత, గజఘటా, చంద్రజ్యోత్స్నా, పర్వతాధిత్యకా, పర్వతోపత్యకా, మృగువాగురా న్యాయములను జూడుము.

కరస్థబిల్వన్యాయము
కరవిన్యస్తబిల్వన్యాయము

చేతిలోని మారేడుకాయవలె.

స్పష్టముగనున్నదని భావము.

"నిశ్శేషోపనిషత్సార స్తదేత దితి సాంప్రతమ్,
ఉక్త్వావిప్రక్రియతే సాక్షా త్కరవిన్యస్తబిల్వవత్."

కరతలామలకన్యాయమును జూడుము.

కరిబృంహితన్యాయము

బృంహితమనిన ఏనుఁగుయొక్క ఘీంకారమని అర్థము. అయినను కరిబృంహితము అని ప్రయోగింతురు.

కరకంకణ,గజఘటాది న్యాయములను జూడుము.

కర్ణకౌంతేయన్యాయము

కర్ణుఁడు కుంతికొడుకే అయినను తెలియక రాధేయుడను (రాధకుమారుడను) అను నూహతో నుండెను. కృష్ణాదులవలన వాస్తవ మెఱింగిన పిదప కౌంతేయుఁ డను అని భావించెను.

సింహమేష, రాజపుత్రవ్యాధ న్యాయములను జూడుము.

## కలంజన్యాయము

కలంజము అనఁగా విషలిప్తబాణముచేఁ జంపఁబడిన మృగమాంసము అని అర్థము.

"న కలంజం భక్షయితవ్యం న లశునం నగృంజనం చ" కలంజము, ఉల్లిపాయ మున్నగువానిని తినగూడదు అని విధివాక్యము. ఇందు కొలఁదిభేదమును సాధించి మీమాంసాశాస్త్రజ్ఞులు "అభక్షణం కర్తవ్యం" అభక్షణము చేయవలయును అనియూ లేక "భక్షణం నకర్తవ్యమ్" భక్షింపరాదనియూ అని పూర్వపక్షు మొనరింప "న భక్షణం కర్తవ్యం" అని సిద్ధాంతీకరింపఁబడినది.

ఈషదంతరముచే ద్వివిధముగ శంకింపఁబడి యొకరకమున సిద్ధాంతీకరింపఁబడునెడ నీన్యాయము ప్రవర్తించును.

## కాంస్యభోజిన్యాయము

"నేననుదినము గురువుగారు భుజించఁగా మిగిలినిదానిని భుజింపవలెను; అందును కంచుకంచములో" అను నియమము గల శిష్యునిగూర్చి వచించిన, నాతనిగురువు కంచుకంచములో భుజించుచున్నాఁడు అని తెలియుచున్నదిగదా! "పాత్రలో భుజించఁగూడదు; అందును కంచుపాత్రలో అసలే నిషిద్ధము" అనునియమము గల గురువునొద్ద కాంస్యభోజి శిష్యుఁ డెట్లు మనఁగలఁడు ?

గురునియమమును పాటించిన శిష్యనియమమునకును, శిష్యనియమము పాటించిన గురునియమమునకును భంగము వాటిల్లును. కావున—

పరస్పరబాధ్యబాధకభావమున నీ న్యాయ ముపయుక్తము. సుందోపసుందన్యాయమును జూడుము.

కాకదధ్యుపఘాతకన్యాయము

"కాకేభ్యో రక్ష్యతాం సర్పి రితి బాలో௨పి చోదితః,
ఉపఘాతపరే వాక్యే న శ్వాదిభో న రక్షతి?"

ఈపెరుగును కాకులు ముట్టుకొనకుండ చూచుచుండుమని చెప్పిన, ఆబాలుఁడు కాకులను త్రోలి కుక్కలు ముట్టుకొనిన చూచుచు నూరకుండునా? ఉండఁడు; వానినికూడ త్రోలివేయును. కాకశబ్దముచేతనే శునకాదులుకూడ ఆక్షిప్తము లవుచున్నవి. అట్లే——

"యేత్వేమం విష్ణు మవ్యక్తం మాంచ దేవం మహేశ్వరమ్,
ఏకీభావేన పశ్యన్తి నతేషాం పునరుద్భవః"

అనిన విష్ణుమహేశ్వరపదములచే బ్రహ్మను ఏకత్వబుద్ధితోఁ జూచినను పునర్జన్మ కలుగదని బ్రహ్మపద మాక్షిప్తమవుచున్నది.

కాకాధికరణన్యాయము

ఫలానాయిల్లు ఏది అని అడిగిన ఆకాకి వాలియున్న యిల్లు అని చూపినట్లు.

ఉపలక్షణమును సూచించుచు పృష్టవస్తునిర్దేశము చేయునెడ నీన్యాయ ముపయుక్తము.

*కాకిణీన్యాయము

ఒక్క కాసీమూలమున అన్నదమ్ములకు తల్లిదండ్రులకు వైరము సంభవించి సర్వనాశనము సంభవించును.

కాచమణిన్యాయము

ఒకేరకముగ ప్రకాశించినను గాజు గాజే, మణి మణియే. కాకపికన్యాయమును జూడుము.

కాణ్డానుసమయన్యాయము

ఋత్విక్కులకు మధుపర్కాదు లొసంగుటలో రెండురకములు గలవు - పదార్థానుసమయము, కాండానుసమయము—అని.

వరణక్రమమున నెల్లఱకు నాసనమొసఁగి పిదప అర్ఘ్యము, పాద్యము, మున్నగునవి వరుసన యిచ్చుట పదార్థానుసమయము.

ముందొకనికి ఆసనము, పాద్యము, మధుపర్కము మున్నగునవన్నియు నిచ్చి తరువాత వేఱొకని కన్నియు వరుసన నిచ్చుచు ఈక్రమముననే ఎల్లఱకు నిచ్చుట.

అభీష్టవ్యవహారము ప్రత్యేకముగ ప్రతియొక వస్తువునకును క్రమముగ జరిగించునెడ నీన్యాయము ప్రవర్తించును.

కామాకులకామినీన్యాయము

కామవిహ్వలయైన కామిని ప్రియునికొఱకై పరితపించునట్లు.

కారణగుణప్రక్రమన్యాయము

కారణము ఎట్టిగుణముగలదై యున్న కార్య మట్టి గుణముతో నొప్పును.

నల్లనిమట్టివలన పుట్టిన ఘటాదులు నల్లగనే ఉండును.

కార్పాసరక్తతాన్యాయము

ఎఱ్ఱలక్కలో నానవేసిన పత్తివిత్తులను పాతిపెట్టిన ఆచెట్ల నుండి ఎఱ్ఱనిపత్తియే వచ్చును.

"యథా క్షీరావసేకా దమ్లత్వం పరిహృత్య మాధుర్య ముపాదాయానువర్తమానామలకీ కాలాన్తరేఽపిమాధుర్య మున్మీలయతి, లాక్షారసావసేకాద్వా ధవలిమాన మపహాయ రక్తతా ముపాదాయానువర్తమానం కార్పాస బీజం కుసుమేషు రక్తతామ్."

లాక్షారసావసిక్తకార్పాసబీజన్యాయమును జూడుము.

కీటభృంగన్యాయము

భ్రమరకీటన్యాయమును జూడుము.

కీటోద్ధారన్యాయము

ప్రవాహములో కొట్టుకొనిపోవు పురువులను తీసి ఒడ్డున పడవైచిన నవి యొకఆధారమును చూచుకొని సుఖించును.

కీలప్రతికీలన్యాయము

బండిని నడిపే ఇరుసుకు రెండువైపుల చక్రములు జారిపడి పోకుండ నుండుటకై రెండు మేకులు (శీలయమేకులు) బిగింతురు.

అర్థ్లే— ఉద్దిష్టార్థమును స్థిరముచేయు సిద్ధాంతమును దృఢీకరించుటకై మఱికొన్ని ప్రమాణవాక్యములను పొందుపరతురు.

కుంజరశౌచన్యాయము

గజస్నానన్యాయమును జూడుము.

కుండధారోపాస్తిన్యాయము

తనను ప్రార్థించు భక్తునకు వరములీఁ దనకు శక్తి చాలనందున కుండధారుఁడను దేవవిశేషుఁడు తనకంటె అధికుఁడవు దేవునిచే వరము లిప్పించెనఁట.

సత్పురుషులు తమకు శక్తిలేకున్నచో పరులచేనైన పరోపకారము చేయింతురు.

కుంభీధాన్యన్యాయము

కుంభీ అనిన కుండ. కుంభీధాన్యుఁడు అనిన వ్యుత్పత్తిచే కుండలో ధాన్యము పోసుకొనువాఁడు అనియు, రూఢమై శ్రోత్రియుఁడు అనియు నర్థములు గలవు. కుంభీధాన్యునకు గోవు నీయవలయు ననిన గౌణార్థమవు మొదటి వానికా లేక ముఖ్యార్థమవు శ్రోత్రియునకా అని శంక వొడమ గౌణముఖ్యములలో ముఖ్యార్థమే గ్రహింపఁబడవలయునని నిశ్చయింపఁ బడినది.

పంకజాదులవిధమున,

### కుక్కుటధ్వానన్యాయము

కోడికూత మొట్టమొదట స్వల్పముగ నుండి పోనుపోను దీర్ఘ మవును.

పరాహ్ణచ్ఛాయాన్యాయమును జూడుము.

### కుమారీకంకణన్యాయము

యువతిచేతికంకణము చాలగాజులతో మొఱయుచు అటు నిటునున్న గాజులనడుమ ఒరపిడివడుచు నుండును.

"బహూనాం కలహో నిత్యం ద్వాభ్యాం సంఘర్షణం
తథా! ఏకాకీ విచరిష్యామి కుమారీకంకణం యథా."

### కులకన్యాన్యాయము

కులకాంత సిగ్గు విడువనంతదనుక కీర్తి వడయును.

"క. ధాత్రిం దృప్తిం బొదలిన
ధాత్రీపతిగతి నతృప్తిఁ దగు పాఱుఁడు; సా
పత్రప రోఁచెలియటు నిర
పత్రప కులకాంత ఘెరయు భ్రష్టత్వమ్మున్."

వ్యాఖ్యాతల నీతిశాస్త్రము.

### కులాలచక్రన్యాయము

కొంతదనుక త్రిప్పి వదలివేయఁబడిన కుమ్మరిచక్రము తనంతన తా కొంతసేపు తిరిగి అగిపోవునట్లు.

కులాలచక్రకీటన్యాయము

కుమ్మరవానిచక్రముపై నున్న పురుగు ఆచక్రముతోఁబాటు వేగముగ తిరుగును.

సంసారచక్రమున దేహి జననమరణాదిభ్రమణవేగమున గిర్రున తిరుగుచుండును.

కుల్యాప్రణయనన్యాయము

కాలువలు నిర్మించినట్లు.

పొలములు బాగుగా పండుటకై కాలువలద్వారా నీటి వసతు లేర్పఱతుము. అట్లేర్పరుపఁబడిన కాలువలలోని నీరు త్రాగి ప్రాణధారణమునుకూడ చేయుదుము.

ఒకపనికై చేయఁబడిన కార్యము మఱొకదానికిఁగూడ నుపయోగించు నెడ నీన్యాయము ప్రవర్తించును.

"అత్రో న విధేయప్రత్యయే తాత్పర్యమితి కుల్యాప్రణయన న్యాయేనోభయార్థత్వావిధేయాత్ । యథా శాల్యర్థం కుల్యాః ప్రణీయన్తే తాభ్య ఏవ పానీయంచ పీయన్తే తద్వత్ ॥"

కుసుమస్తబకన్యాయము

పూలగుత్తి మత్తకాశినుల తలమీఁదనైన అలంకారముగా ప్రకాశించును; లేదా రాలి అయిన పోవును.

సజ్జనుఁడు ఊరిలో తలమానికముగానైన ఉండును; లేదా స్వస్థానమును వదలి అడవిలో తపస్సునకైన లేచిపోవును.

కుసూలధాన్యన్యాయము

గాదెలోనుండి కొంచెముకొంచెముగా తీయుచుండిన క్రమముగా ఉన్న ధాన్యమంతయు తగ్గిపోవును.

కూటకార్షాపణన్యాయము

తెలియక చెల్లని నాణెములను వాడినట్లు.

సంచిలోఁ బోసియుంచిన రూపాయలలో చెల్లనివికూడ నుండును. కాని మనము మామూలుగ తీసి వాడుచునే యుందుము. ఆవాడకములో చెల్లనినాణెములనుగూడ చూడక మంచివానివలెనే మామూలుగ వాడుదుము. తెలిసిన పిమ్మట వానిని తీసిపాఱవైతుము.

అట్లే— అజ్ఞానవశమున నొకఁడు అసాధుమార్గమున వ్యవహరించినను జ్ఞానము కలిగిన వెనువెంటన దానిని పరిత్యజించును.

కూపఖానకన్యాయము

"యథా కూపఖానకే పతితం పంకాది కూపా న్నిస్సృతే నాంభసా ప్రక్షాల్యతే తథా—"

నూయి త్రవ్వునప్పుడు ఒంటిపై పడిన మట్టి బురద మున్నగునవి ఆనూతిలోనుండి వచ్చిన నీటిచే కడిగికొని పరిశుభ్రము చేసికొనఁబడును. అట్లే—

"తత్తద్విగ్రహావచ్ఛిన్నేశభేదబుద్ధిజో దోష స్తదుపాసనాజన్య సుకృతమహిమోత్పన్నేనాద్వైతబోధేన సమూలం నివర్త్యత ఇతి జ్ఞేయమ్."

ఆయావిగ్రహములయందు రూఢమై జనించిన పరమేశ్వర భేదబుద్ధిజమవు దోష మాయావిగ్రహారాధనములవలనఁ గలిగిన సుకృతమహిమచే నుత్పన్నమవు నద్వైతబోధచే నశించును.

కృత్వాచిన్తాన్యాయము

"ఇత్యేవం కృత్వా చిన్త్యతే। కృత్వా చిన్తేయం"

ముందొకవిధముగ విధిని కల్పించుకొని చేసి పిమ్మట దానినే విచారించవలయునన్నట్లు.

కైదారికాన్యాయము

వ్యవసాయదారుఁడు నీటికాలువలోనుండి ఒకపొలమునకు నీరు పెట్టి ఆతూము మూసివైచి మఱొకచో తూముచేసి మఱొకపొలమునకు నీరు పెట్టుచుండునట్లు.

కోష్ఠపానన్యాయము

ఇంటికి తెప్పించుకొని కల్లుత్రాగినట్లు.

రహస్యముగ దుష్కార్యములను చేయుట అని భావము.

క్రమవిపర్యాసన్యాయము

ముందు వెనుక, వెనుక ముందు, క్రమభంగముగ పనులలో ప్రవర్తించుట.

ఖపుష్పన్యాయము

గగనకుసుమన్యాయమును జూడుము.

ఖరీవిషాణన్యాయము

గాడిదకొమ్ములలాగా.

శశవిషాణన్యాయమును జూడుము.

ఖలే కపోతన్యాయము

కళ్ళములో దిగిన పావురముల మాదిరి.

కళ్ళములో గింజలేరి తినుటకు దిగి వలలో దగుల్కొనిన పావురములు అన్నియు నొకటియై వలతో నెగిరి పోయి ప్రాణము దక్కించుకొనినవట.

ఒకపనినిసాధించుటకు సాధకము సముచ్చయముపైనున్నపు డీన్యాయము ప్రవర్తించును.

"సముచ్చయోఽయ మేకస్మిన్ సతి కార్యస్య సాధకే
ఖలే కపోతికాన్యాయా త్తత్కరః స్యా త్పరోఽపిచేత్॥"

ఖాదఘాతకన్యాయము

తినేవారే చంపేవారుకూడా అవుదురు.

చేపలను తినువారు చేపలను చంపేవారు కారు?

గగనారవిందన్యాయము

ఆకాశముమీఁద తామరపూలవలె.

ఖపుష్ప, గగనకుసుమ న్యాయములను జూడుము.

గజఘటాన్యాయము

గజ, ఘటా శబ్దములు రెండును గజవాచకములే. కాని రెంటిని కలిపి ఏనుఁగు అనునర్థమున నుపయోగింతురు.

కరకంకణ, కరిబృంహిత వాజిమందురా, నీలేందీవర న్యాయములను జూడుము.

## గణపతిన్యాయము

అన్ని పనులకు మొట్టమొదట మనము విధిగా గణపతిని పూజింతుము.

అందఱికన్న మొట్టమొదట ముఖ్యుఁడుగ నెన్నుకొనఁబడు వానివిషయమున నీన్యాయము ప్రవర్తించును.

## గన్ధర్వనగరన్యాయము

గంధర్వనగరము అనఁగా మాయాప్రపంచము-అసత్యమై సత్యముగా కనుపించుచు క్షణములో నశించుచు మఱల పుట్టుచు మఱల నశించుచు నుండునది.

ఉదా:-జగత్తు.

"......... గంధర్వనగరోపమైః ......"

భాగవతము.

## గర్గశతదండనన్యాయము

వందమంది గర్గులను చావమోదుము అన్నట్లు.

"గర్గాః శతం దండ్యంతాం" అన్నపుడు నూఱుగురు గర్గులను ఒకేమాఱు అనేకమాఱులు దండించుట దుర్ఘటము గావున ప్రత్యేకముగ ఒక్కొక్కరిని క్రమక్రమముగ దండించవలయు నని భావము.

ప్రత్యేకముగ నొక్కొక్కటిగ చేయుటయం దీన్యాయ
ముపయుక్తము.

కాణ్డానుసమయన్యాయమును జూడుము.

గర్తవర్తిగోధామాంసవిభజనన్యాయము

కన్నములోనున్న బల్లుల మాంసమును విభాగించినట్లు.
"అనవబుద్ధార్థే ప్రవృత్తి ర్బిలవర్తిగోధావిభజన న్యాయే
నాశక్యేతి ధ్వనితమ్"
కన్నములోనున్న బల్లులు కన్నులకు కన్పింపవుగావున
వాని మాంసమును నిరూపించి విభాగించు టశక్యము.
అట్లే—
అనవబుద్ధాంశమున ప్రవృత్తియుఁ దీన్యాయము ప్రవ
ర్తించును.

గర్తస్థమృతసర్పన్యాయము

కన్నములో చచ్చి ఎండిపోయిన పాము కన్నమందే
లీనమై యున్నట్లు.

సృష్టికి పూర్వము ప్రలయానంతరము పరమాత్మయందు
అడఁగిపోయిన ప్రపంచము వానియందే లీనమైయుండును.

"ప్రాక్సృష్టేః ప్రలయా దూర్ధ్వం నాసీత్కించిద్ద్విజోత్తమ"

గార్హపత్యన్యాయము

గార్హపత్యశబ్దార్థమువిధమున.
"నివేశనః సంగమనో వసూనా మిత్యైన్ద్ర్యా గార్హపత్య
ముపతిష్ఠతే" అని వైదికమంత్రము.

ఈమంత్రము గార్హపత్యమును గూర్చి నుడువుచున్నదా, లేక, ఇంద్రత్వమును గూర్చి చెప్పుచున్నదా అని ప్రశ్న రాఁగా శ్రుతిలింగాదులచే గార్హపత్యబోధకమే గాని ఇంద్రత్వబోధకము గాదని సిద్ధాంతీకరింపఁబడినది.

శ్రుతిలింగాదులచే విషయనిర్ధారణచేయు తావుల నీన్యాయము ప్రవర్తించును.

### గుడశ్లేష్మన్యాయము

శ్లేష్మరోగి బెల్లము తినిన తొలుత శ్లేష్మము ప్రకోపించి తుదకు వెనుకటిదానితోసహా వెలికివచ్చును.

### గుణవిరోధన్యాయము

గుణములు పరస్పరవిరుద్ధములుగానే యుండును.

వాతాదిన్యాయమును జూడుము.

### గుణోపసంహారన్యాయము

సామాన్యముచే విశేషమును సాధించునట్లు.

### గోగవయన్యాయము

గోవు, గవయమృగము రెండు నొకేమాదిరిగ నుండును. కాని పాలలో మాత్రము భేదము గలదు.

కాచమణి, కాకపిక, హంసబక, న్యాయములను జూడుము.

### గోదోహనన్యాయము

ఒకరకపుక్షీరపాత్రకు గోదోహనము అనిపేరు. పశువృద్ధి కామనయా చేయఁబడు క్రతువునందీ పాత్ర యుపయో

గింపఁబడును. ఆపాత్రతో క్షీరము, నీరు మున్నగు పదార్థములు నిర్దిష్టసమయమున తేవలసియుండును. కాని యీ క్షీరపాత్ర కేవల పశుక్రతువునందే యుపయోగింపఁబడును. ఇతరక్రతువులం దెచటను తత్ప్రసక్తియే లేదు. కావున — అనిత్యములుగ సర్వసామాన్యములు గాక నిర్దిష్ట సమయములందె తలఁచు వాడఁబడు వస్తుసముదాయమున నీన్యాయ ముపయుక్తము.

పర్ణమయీన్యాయమున కియ్యది విరుద్ధము.

## గోపగృహిణీన్యాయము

పూర్వము ఇరువురు రాజదంపతు లుండేవారు. వారికొక కుమారుఁడు. రాణి కొంచెము చీఁకటితప్పులమనిషి. ఆమెకు రాజుగారన్న అసహ్యము. ఒకనాఁ డామె రాజును విషము పెట్టి చంపి అంకుమగనియింటికి పోఁగా అతఁడు సర్పదష్టుఁడై చనిపోయెను. ఆమె దేశాంతరమునకు పోయి అచట వేశ్యావృత్తితో జీవించుచుండెను. కొన్నాళ్ళ కొకరాజపుత్రునకు నామెకు సంబంధము కలిగెను. ఇష్టాగోష్టిలో వారిరువురు తల్లి, కొడుకులని తెలియవచ్చి ఒకరి నొకరు వదలివైచి ఆపాపప్రాయశ్చిత్తికై చితిపేర్చుకొని దానిపై నెక్కిరి. రాజకుమారుఁడు చనిపోయెను. ఆమె మాత్రము చావక చితినుండి దొర్లి ప్రక్కనున్న నదిలో పడెను. నదీప్రవాహవశమున కొట్టుకొనిపోవుచుండఁగా నామెనొక గొల్లవాఁడు ఒడ్డునకు జేర్చి తనయింటికిఁ దీసికొనిపోయెను. వారిరువురును మహానురాగముతో ఆలు

మగలవలె మెలఁగఁజొచ్చిరి. ఒకనాఁడామె పెరుగమ్ముటకు పోవుచు త్రోవలో నెదురుదెబ్బతగిలి క్రిందపడెను. తలమీఁది పెరుగుబాన నేలపైఁబడి పగిలి పెరుగు నేలపాలయ్యెను. అది చూచి ఆరాణి యిట్లనుకొనుచు నేడువఁదొడఁగెను—

"హత్వా నృపం పతి మవాప్య భుజంగదష్టం
దేశాంతరే విధివశా ద్గణికాస్మి జాతా
పుత్త్రం స్వకం సమధిగమ్య చితాం ప్రవిష్టా
శోచామి గోపగృహిణీ కథ మద్య తక్రమ్ ?"

అంతకంతకు భ్రష్టత్వము నొంది ఆపదలంబడినవారి విషయమున నీన్యాయము ప్రవర్తించును.

గోమయవృశ్చికన్యాయము

సదృశా త్సదృశోద్భవన్యాయమును జూడుము.

గ్రహైకత్వన్యాయము

"దశాపవిత్రేణ గ్రహం సంమార్ష్టి" అనువాక్యమున "గ్రహం" అని ఏకవచనాన్తపదము ప్రయోగింపఁబడినది. "ఒకగ్రహమును" అని ఆ "గ్రహం" పదార్థము. అయినను— "గ్రహములను" అనునర్థము గ్రహింపఁబడుచున్నది.

అర్థము—ఏకవచనాంతపదముచేతనే తద్గుణకములవు ననేకములు గ్రహింపఁబడునపు డీన్యాయము ప్రవర్తించును.

ఘటప్రదీపన్యాయము

ఘటములోని దీపమున్నట్లు.

దీపద్వారమున ఘటము ప్రతీతమైనను దీపప్రకాశము నివర్తింపదు. అట్లే—

ఒకశబ్దమువలన వ్యంగ్యార్థము ప్రతీతమైనను వాచ్యార్థము దూరముకాదు.

"యథైవహి ప్రదీపద్వారేణ ఘటప్రతీతా వుత్పన్నాయాం న ప్రదీపప్రకాశో నివర్తతే తద్వ ద్వ్యంగ్య ప్రతీతౌ వాచ్యావభాసః॥"

ఘటారోహణన్యాయము

అభ్యాసముచేసిన కుండ పగిలిపోకుండ కుండపై నెక్క వచ్చును.

అభ్యాసం కూసువిద్య అన్నట్లు.

ఘటాల్పదర్పణన్యాయము

ఏనుఁగు చిన్న అద్దములో ఇమిడి చిన్నదిగా కనుపించును. మహాకాశము ఘటమందువలె.

ఘటీయంత్రస్థితఘటీన్యాయము

ఏతాముకుండలు ఒకటి క్రిందికి ఒకటి మీఁదికి పోవుచుండును.

ఉదా:— కలిమిలేములు, కావడికుండలు, వృద్ధిక్షయములు, పాపపుణ్యములు.

చందనన్యాయము

చందనగంధముచందమున.

"యథా హరిచందనబిందు శ్శరీరైకదేశసంబద్ధోఽపి సన్ సకలదేహవ్యాపిన మాహ్లాదం కరో త్యేవ మాత్మాపి దేహైకదేశస్థః సకలదేహవ్యాపినీ ముపలబ్ధిం కరిష్యతి" మంచిగంధపుబిందు వొకఁడు శరీరైకదేశమున నున్నను యావచ్ఛరీరమునకు నాహ్లాదము గూర్చునటులు శరీరములో నొకచో నున్నను ఆత్మ యావచ్ఛరీరవర్తియై భాసిల్లును.

చందనగుణన్యాయము

మంచిగంధపుచెక్కను అరుగ దీసినకొలఁది పరిమళము హెచ్చును.

సువర్ణన్యాయమును జూడుము.

చంద్రజ్యోత్స్నాన్యాయము

చంద్రచంద్రికా న్యాయమును జూడుము.

చంపకపటన్యాయము

సంపెంగపూవులను బట్టలో కొంతతడ వుంచి వానిని తీసి వేసినను సంపెంగవాసనమాత్రము పోదు.

రామఠకరండన్యాయమును జూడుము.

ఛుచుందరీసర్పన్యాయము

చుంచెలుకను పట్టుకొనిన పామువలె.

పాము పట్టుకొనినతరువాతగాని అది చుంచెలుక అని తెలిసికొన నేఱదు. చుంచెలుక అనిన పామునకు గిట్టదు. పైగా, అట్లు పట్టుకొని దానిని విడచిపెట్టిన పాముకు కండ్లు పోవునఁట. అందుకు వెఱచి తినిన పిచ్చియెక్కి పామునకు ప్రాణహాని సంభవించునఁట. అట్టి సమయమున పాము చేయవలసిన దేమి?

ముందు నుయ్యి, వెనుక గొయ్యి; ఎగదీసిన ఆత్మహత్య, దిగదీసిన గోహత్య వంటి స్థలములయందు ఈన్యాయము ప్రవర్తించును.

దశరథుఁడు అసత్యమునకు పాల్పడి కైక మాట త్రోసి వేయవలెనా? రాముని అరణ్యమునకు పంపివేయవలెనా?

## చౌరాపరాధా న్మాండవ్యనిగ్రహన్యాయము

దొంగలు చేసిన తప్పిదమువలన మాండవ్యునికి కొఱత సంభవించినట్లు.

"తస్మా న్న భేదప్రత్యక్షం సుపరిసర మితిచే త్కిం వస్తుస్వరూపభేదవాదినంప్రతి ఇమాని దూషణా న్యుద్ఘుష్యన్తే కింవా ధర్మభేదవాదినంప్రతి ప్రథమే చౌరాపరాధా న్మాండవ్యనిగ్రహన్యాయాపాతః"

## ఛాయాపిశాచీన్యాయము

ఒకఁడు తననీడను చూచి దయ్యమను భ్రాంతిచే భయపడుచుండ నాప్తుఁ డొకఁడు—ఇది దయ్యము కాదు; నీనీడ. చూచితివా, నీమెడలోని కంటె ఈ నీడ మెడలోను

కానిపించుచున్నది — అని చెప్పిన మీఁదట నతఁడా భ్రాంతిని వీడి స్థిరుఁడయ్యెనఁట.

ఒకవస్తువునందు అన్యవస్తుధర్మము లారోపించి భ్రమించి ఆప్తవాక్యముచే తద్భ్రమనివృత్తి కలిగినపు డీన్యాయము ప్రవర్తించును.

జలకతకరేణున్యాయము

చిల్లగింజ నరుగదీసి బురదనీటిలోఁ గలిపిన ఆగంధము నీటిని బురదనుండి వేఱుపఱచి తా నదృశ్య మవును.

"అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలమ్
కృత్వా జ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతకరేణువత్."

కతకరేణున్యాయమును జూడుము.

జాతేష్టిన్యాయము

జాతపుత్రుఁడు ఇష్టిచేయవలయును అన్నట్లు.

కొమరులు కలవాఁడు ఇష్టిచేయవలయు ననిన ఆచేయఁబడు నిష్ట్యాదులు కుమారుని క్షేమముకొఱకా లేక తండ్రిక్షేమము కొఱకా అని సందేహము కలుగ పుత్రసమవేతుఁడవు తండ్రిక్షేమముకొఱకే అని సమాధాన మొసఁగఁబడినది.

"నహి చైత్రానుష్ఠితాగ్నిహోత్రజనిత మపూర్వం చైత్రసమవేతం మైత్రం స్వర్గఫలభాగినం కర్తు ముత్సహతే పుత్రేష్టిపితృయజ్ఞవ దేత త్స్యాత్। న। తత్రాప్యతిశయస్య పుత్రాదిసమవేతత్వే నైవాభ్యుపగమాత్."

జామాతృశుద్ధిన్యాయము

అల్లుడు చేసిన పుస్తకపరిష్కారము విధమున.

ఒకరాజు తనకుమార్తెకు తగిన వరుని వెతకి తెమ్మని పురోహితునితో ననెను. ఆపురోహితుఁ డంతకుమున్న రాజకుమార్తెపై గల పగ సాధింప నెంచి బట్టలను మేపు కొను మూర్ఖు నొకనిని తెచ్చి యితఁడు నీకు తగిన అల్లుఁ డని చెప్పెను. రాజకుమార్తె వానితెలివి పరీక్షింపఁగోరి సభచేయించెను. ఆ సభలో పండితులు క్రొత్తగా రచింపఁ బడిన పుస్తకము వానిచేతికిచ్చి యిందు తప్పులు దిద్దు మనిరి. వాఁడు పురోహితుఁడు తనకంతకు మున్న చెప్పిన చొప్పున నోరు మెదల్పక ఊరక పుస్తకము తిరుగ వేయుచు ఉండిఉండి తోచక తనబొడ్డులో నున్న గోళ్ళు తీసుకొను కత్తితో అక్షరములను, గీతలను, తలకట్లను గీకివేయనారంభించెను. దానిని చూచియే రాజుకూతురు వానిమూర్ఖ్యమును గ్రహించెనఁట.

డమరుకమణిన్యాయము

డమరుకమునకు మధ్యగల మ్రోయించు సాధనమువలె.

శివుని చేతిలో నుండునది డమరుకము. ఆడమరుకమును వాయించుటకు మధ్యనొకకొయ్యముక్క కట్టియుంచఁ బడును. దానిని మణి అందురు. డమరుకమును కదలించి నపుడు మణి డమరుకమున కటు నిటు తగిలి డమరుకము మ్రోయించును. ఒకమణియే రెండువైపుల తాకి డమరుక మును మ్రోగించుట కుపయోగపడుచున్నది.

అర్థ:— ఒకేవస్తువుతో రెండురకముల ఉపయోగములు కలిగినపుడీన్యాయము ప్రవర్తించును.

ఉదా:—"నోత్సృష్ట మన్వార్థ మపోద్యతేచ" అను వార్తిక మందు—

అన్వార్థ మితి మధ్యవర్తి పదం డమరుకమణిన్యాయేనో భయత్రాపి సంబాధనీయమ్.

తటాదర్శిశకుంతపోతన్యాయము

ఒడ్డు తెలియని పక్షిపిల్లవలె.

సముద్రములో పడిపోయిన పక్షిపిల్ల ఒడ్డును జేరి బ్రతుకవలె నను నిచ్ఛతో నాకమాదిరిగ నెగిరి నలగెలంకులం గలయంజూచి అంతయు జలమయముగానే కనఁబడి ఒడ్డును చూడక మఱల తా నెగిరినచోటుననే పడిపోవును.

గత్యంతరాభావమున తొంటిస్థితినే ఆశ్రయించుతావున నీ న్యాయ ముపయోగింపఁబడును.

"...ఏవం త్రేఽపి కుతీర్థ్యాః ప్రాగుక్తపక్షత్రయేఽపి వస్తుసిద్ధి మనాసాదయన్త స్తదుక్తమేవ చతుర్థం భేదాభేద పక్ష మనిచ్ఛయాపి కక్షీకుర్వాణా స్తచ్ఛాసన మేవ ప్రతిపద్యన్తామ్."

తత్క్రతున్యాయము

తముద్దిష్టక్రతువు తత్ప్రతిపాదకమే అవునట్లు,

తముద్దేశవాక్యములకు తద్గ్రహణమందే తాత్పర్యము అని న్యాయభావము.

"......భవతు యత్రైవమాహాత్మ్యవాద ఉపలభ్యతే త్వభావే త్వౌత్సర్గికేణ తత్రక్రతున్యాయేన బ్రహ్మక్రతూనా మేవ తత్ప్రాప్తి ర్నేతరేషామితి గమ్యతే."

బ్రహ్మక్రతువే బ్రహ్మను పొందించును గాని అబ్రహ్మ క్రతువు బ్రహ్మగమకము కానేరదు.

తదంతాపకర్షన్యాయము

తదంతము అనఁగా అది అంతమందుగలది అని అర్థము. (బహువ్రీహిసమాసము.) తదంతసముదాయము నాకర్షించి నట్లు అని న్యాయార్థము.

విడదీయవీలు లేని యొకవస్తుసముదాయమున్న దనుకొనుఁడు. వానిలో నేది కదలించినను అన్నియుఁ గదలును. మొదలు కదలించిన చివర, చివర కదలించిన మొదలును కదలును. ఉదాహరణమునకు రైలును తీసికొనుఁడు. రైలుపెట్టెలలో నేకొన, లేక నడిమిభాగమును కదలించిన సముదాయము నంతయు నపకర్షించును.

అక్లే—అనుయాజాద్యుత్కర్ష ప్రయాజాన్తాపకర్షణాధికర ణము నెఱుంగునది.

అనుయాజ, ప్రయాజాదులు కొన్ని హోమవిశేషముల సముదాయము. వానికి అనుయాజాదులు మొదలు; ప్రయాజాదులు తుదియు. ఈసముదాయమున నేయొకటి గ్రహించిన నన్నియు క్రమమున వచ్చును.

కావున—ఒకటి గ్రహించిన తత్సంబద్ధసముదాయమంతయు దానిచే నపకర్షింపఁబడు నవసరమున నీన్యాయము ప్రవర్తించునని యెఱుంగునది.

తదాదితదంతన్యాయము

పై తదంతాపకర్ష న్యాయమును జూడుము.

తదాగమేహి తద్దృశ్యతేన్యాయము

ఒకదానిని చూచి తద్ద్వారా మఱొకదానిని స్మరించుట అని న్యాయముయొక్క భావము.

జాగ్రదాద్యవస్థలయందు బుద్ధివ్యాపారము సక్రమముగా నున్నపుడు దుఃఖాదులు వ్యక్తములై సుషుప్తిలో ఆబుద్ధి అడఁగిన దుఃఖాదులు ప్రతీయమానములు కాకుండుటయు, మఱల బుద్ధివ్యాపారము ప్రసరించిన సుషుప్తిలో నయితము సుఖదుఃఖాదులు "తదాగమేహి తద్దృశ్యతే" (అది యున్నపు డదియే చూడఁబడును) అను న్యాయమున బుద్ధిధర్మములే కాని ఆత్మధర్మములు కావని యెఱుంగునది.

తస్కరకందున్యాయము

దొంగ యింటిలో వంటవాఁడుగా నున్నట్లు.

ఒకఁడు దొంగతనమును చేసి తన దొంగరికమును మాపుకొనుటకై దాపుననున్న ఒకధనికునివంటయింటఁ జొచ్చెను. ఆధనికుఁడు వానిని దొంగగా గుర్తింపక వంటలవాఁడుగా నియమించెను. వానికోసమై వెతకుచున్న రాజభటులు లోక

నాఁడు ఆవంటయింటఁ బ్రవేశించి వంటపనియందు నేర్పు లేక తడబడు దొంగ ననుమానించి కొనిపోయి దొంగగా నిశ్చయించిరి. పాపము, వాఁడు చేసిన వంటపని వృథా ప్రయాస యయ్యెను.

అట్లే— వృథాప్రయాసకరములగు పనులయందీ న్యాయము ప్రవర్తించును. ఎట్లన—

"బ్రహ్మాజ్ఞానే నియుక్తోఽపి తస్య కర్తుమశక్యతాపి తత్కుర్వ స్స్వర్థక్లేశభాగీ భవేత్."

తుషకండనన్యాయము

ఊక దంపినట్లు.

నిష్ప్రయోజనము భావము.

"అవిచారయతో యుక్తికథనం తుషకండనమ్
నీచేషూపకృతం రాజన్ వాలుకాస్వివ మూత్రితమ్."

తుషాఘాతన్యాయమును జూడుము.

తృణభక్షణన్యాయము

గడ్డి తిన్నట్లు.

ఒకప్పుడు గడ్డికూడ పూజ్యమే అవును.

"వైరిణోఽపిహి ముచ్యన్తే ప్రాణాన్తే తృణభక్షణాత్,
తృణాహారాః సదైవైతే హన్యన్తే పశవః కథమ్?"

ప్రాణాపాయము సంభవించినపుడు శత్రురాజు తనపగకు తలయొగ్గఁ దలఁచిన వెనువెంటనే గడ్డిపరక నోటిలో

పెట్టుకొనును. అది చూచి వెంటనే ఎదిరిరాజు వానిని చంపక మానివేయును. ఇది యుద్ధధర్మము. కావున— ప్రాణాత్యయసమయమున గడ్డితినిన మహాశత్రువులు సయితము రక్షింపఁబడుదురు. ఎల్లకాలము గడ్డియే తిని బ్రతుకు జంతువులేల అకరుణముగ చంపఁబడుచున్న వోగదా!

## తైలపాత్రధరన్యాయము

నూనెకుండను మోయువానివలె.

నూనెకుండను నెత్తిపై నిడుకొని పోవువాఁడు కడుబాగ రూకతతో తదాయత్తచిత్తమున నూనె తొణికిపోకుండ అడుగులో అడుగులు వైచుచు పోవుచుండును.

"తైలపాత్రధరో యద్వ దసిహస్తై రధిష్ఠితః
స్ఖలితే మరణత్రాసా త్తత్పర స్స్యా త్తథా వ్రతీ."

స్ఖలిత మవునెడ ప్రాణాపాయము సంభవించు నను భయమున నూనెకుండ మోయువానివలె వ్రతనిష్ఠుఁడును తత్పరుఁడై యుండవలెను.

తదేకనిష్ఠయందీ న్యాయ ముపయుక్తము.

## దండిన్యాయము

ఫలానామనిషియని చూపుటకు ఆ "దండి" అనఁగా కఱ్ఱ పట్టుకొనిపోవువాఁడు అని చూపినట్లు.

ఛత్రిన్యాయమును జూడుము.

దీర్ఘశష్కులీభక్షణన్యాయము

శష్కులీ అనఁగా నేతితో కాల్చఁబడిన గోధుమరొట్టె. పెద్ద గోధుమరొట్టెను ఒకమూల మొదలిడి తినువానికి దానిఆకారము, దీర్ఘత్వము, మెత్తఁదనము, గట్టిదనము, ఉప్పదనము, తీపి, (రుచి అనిభావము) మున్నగు నవేక విషయములజ్ఞాన మొకమాఱు గలుగును.

అన్లే—యాగపద్యమున ననేకవస్తుజ్ఞానము కలుగునపు డీన్యాయ ముపయోగింపఁబడును.

"సుగంధిం శీతలాం దీర్ఘా మశ్నన్తః పూపశష్కులీమ్,
కపిలబ్రాహ్మణాస్సన్తి యుగప త్పంచబుద్ధయః"

దూరస్థవనస్పతిన్యాయము

చాలదూరమునుండి చూచిన వృక్షము, దానియందున్న వస్తువులు నొకటియై అభేదముగఁ గన్పట్టును.

"షడ్భిః ప్రకారై స్సతాం భావానా మనుపలబ్ధి ర్భవ త్యతిసన్నికర్షా దతివిప్రకర్షా న్మూ ర్త్యంతరవ్యవధానా త్తమసావృతత్వా దిన్ద్రియదౌర్బల్యా దతిప్రమాదా దితి."

దేవదత్తశౌర్యన్యాయము

దేవదత్తుని శౌర్యమువలె.

దేవదత్తునిశౌర్యము వాని దేశమునందు ప్రసిద్ధమే. అతఁడు దేశాంతరమున కేఁగిన అట నతఁ డవిజ్ఞాతుఁ డవుట వాని శౌర్యము వెల్లడికాదు. అంతమాత్రమున వానిశౌర్యము పోవునా? పోదు.

ఎట్టిస్థితియందైనను వస్తువులు తమధర్మమును బాయవు అని న్యాయముయొక్క ఆశయము.

తల గొరిగించి రుద్రాక్షలు వేసికొనినంతమాత్రమున చోరుఁడు తనచోరత్వమును కప్పిపుచ్చుఁగలఁడా? చూచిన వారెల్ల ఇతఁడు చోరుఁడు అనియే అందురు.

ధారావాహికన్యాయము

తైలాదిధారవలె అవిచ్ఛిన్నముగ నొకవస్తువు నెఱింగి కొనుట.

ఏవస్తువునుగూర్చి మనము విచారింపఁబూనుదుమో ఆవస్తువు కంటికి కగపడినను, లేకున్నను, క్షణములో నశించినను, నశించకపోయినను, మఱొకరకముగ స్వరూపభేదము నొందినను, లేకున్నను, ఎట్టిస్థితియందైన గానిండు- తద్విషయకవిచారముమాత్ర మవిచ్ఛిన్నముగ తదేకనిష్ఠగ కొనసాగుటను ధారావాహికన్యాయము తెలుపును.

తైలధారవలె అవిచ్ఛిన్నమై తదేకనిష్ఠతో నొనర్పఁబడు నేదేనియొకవస్తువిచారమున నీ న్యాయము ప్రవర్తించును.
ఉదా:— తైలధారావదవిచ్ఛిన్నపరమాత్మోపాస్తి.

నర్తకన్యాయము

నాట్యగాఁ డొకఁడే పలువుర కానందము కలిగించునట్లు.
ఒకేదీప మనేకులకు ప్రకాశము నిచ్చును.
నటి ఒకరితయే అనేకులను భ్రూభంగమున పులకితశరీరులఁ జేయును.

నాసికాగ్రేణ కర్ణమూలకర్షణన్యాయము

ముక్కుచివరతో చెవిమొదలిటెని లాగెనన్నట్లు.

అసంభావితార్థవాదములయం దీన్యాయము ప్రవర్తించును.

"సమస్తవ్యస్తతామేవం సతి వ్యాచక్షతేఽత్ర యే
కర్షన్తి నాసికాగ్రేణ కర్ణమూలం సుఖేన తే."

నిషాదస్థపతిన్యాయము

"నిషాదస్థపతిః" అను పదమునకు సమాసభేదములచే ననేకార్థములు చెప్ప వీలవును. ఎట్లన—

"నిషాదానాం స్థపతిః" అని షష్ఠీతత్పురుషము; 'నిషాద ఏవ స్థపతిః" అనికర్మధారయసమాసము. అట్టిచో "షష్ఠీసమాసాత్ కర్మధారయో బలీయాన్" అను నియమముచే "నిషాద ఏవ స్థపతిః = నిషాదస్థపతిః"అని స్వీకరింపవలయునని భాష్యకారులు నిర్ణయించిరి.

అట్లే—షష్ఠీకర్మధారయములకు పరస్పరసంఘర్షణము సంభవించినపు డీన్యాయము ప్రవర్తించును.

పంగ్వంధన్యాయము

అంధపంగు న్యాయమును జూడుము.

పంజరముక్తపక్షిన్యాయము

"ఊర్ధ్వగమనం జీవస్య స్వభావః......... యథా పంజరముక్తశుకస్య, యథావా వారినిర్భిన్నపరిణతైరండబీజస్య, యథావా దృఢపంకలిప్తజలనిమజ్జనప్రక్షీణపాకలేపశుష్కాలాబూఫలస్య."

పంజరమునుండి విడువఁబడి చిలుక త్రిన్నగా ఆకాశమున కెగిరిపోవును. అట్లే—

సంసార (దేహాది) బంధనిర్ముక్తజీవుఁడును ఊర్ధ్వగమనము నొందును.

ఏరండబీజ, జలతుంబికా న్యాయములను జూడుము.

పదార్థానుసమయన్యాయము

ఈ న్యాయవివరణము కాండానుసమయ న్యాయమున గావింపఁబడినది. (చూడుడు)

పర్ణమయీన్యాయము

పర్ణమయి అనఁగా మోదుగకఱ్ఱతో చేయఁబడిన స్రుక్కు. ఈస్రుక్కు ప్రతియొక యజ్ఞమునందును ఉపయోగింపఁబడును. అసలు స్రుక్కు లేనిదే యజ్ఞము జరుగదుకూడ. కావున విధిగ (అన్నికర్మలయందు) అన్నితావుల నుపయోగింపఁబడు సాధనవిశేషమున నీన్యాయ ముపయోగింపఁబడును.

గోదోహనన్యాయమున కియ్యది విరుద్ధము.

పాఠక్రమన్యాయము

సూత్రపఠితమైన పాఠక్రమము నతిక్రమింపక విధులయందు ప్రవర్తించునట్లు.

శ్రుతిక్రమము, అర్థక్రమము, పాఠక్రమము, ప్రవృత్తిక్రమము, స్థానక్రమము, ముఖ్యక్రమము అని క్రమము ఆఱువిధములు,

(1) ఇందు శ్రుత్యాదిష్టక్రమము ననుసరించుట శ్రుతి క్రమము.

(2) వాక్యములు వ్యత్యస్తములుగానున్నను అర్థమునుబట్టి విధియందు ప్రవర్తించుట అర్థక్రమము.

ఉదా:—అగ్నిహోత్రం జుహోత్యోదనం పచతి—మున్నగు వానివలె.

(3) సూక్తములయందు నుడువఁబడిన పాఠముయొక్క వరుస నతిక్రమింపక క్రమముగ విధులయందు ప్రవర్తించుట పాఠక్రమము.

ఉదా:—సమిథో యజతి; తనూనపాతం యజతి; ఇడో యజతి; బర్హిర్యజతి; స్వాహాకారం యజతి—మున్నగు వానివలె. ఇందు తొలుత సమిత్తు, తరువాత అగ్నిహోత్రుని. ఇట్లువరుసగ యజింపవలెను.

(4) అనుభవమును ఆచారమునుబట్టి విధులయందు ప్రవర్తించుట ప్రవృత్తిక్రమము.

ఏతావతా చెప్పినది చెప్పినట్లు క్రమము తప్పక పనుల యందు ప్రవర్తించునపు డీన్యాయము ప్రవర్తించునని యెఱుంగనగును.

పిత్రనుసృతస్తనంధయన్యాయము

తండ్రి ననుసరించిన బాలునివలె.

తత్త్వవేత్త ననుసరించిన అతత్త్వవేత్తయు వానివలెనె నుద్ధరింపఁ బడును.

రాజానుసృతవివాహప్రవృత్తభృత్యన్యాయమునుజూడుము. అంతియగాక—తండ్రిచే ననుసరింపఁబడిన కుఱ్ఱవానివలె—అని మఱొకపక్షము. ఎట్లన—

"అవిద్వదనుసారేణ వృత్తిర్బుద్ధస్య యుజ్యతే
స్తనంధయానుసారేణ వర్తతే తత్పితా యతః.
అధిక్షిప్త స్తాడితోవా బాలేన స్వపితా తదా
న క్లిశ్నాతి న కుప్యేచ్చ బాలం ప్రత్యుత లాలయేత్
నిన్దితః స్తూయమానోవా విద్వా నజ్ఞై ర్న నిందతి
న స్తౌతి కిన్తు తేషాం స్యా ద్యథా బోధ స్తథాచరేత్."

బాలుఁడు తనను కొట్టినను, తిట్టినను తండ్రి కోపింపక వాని నుపలాలించును. అట్లే—అజ్ఞులు తనను దూషించినను, భూషించినను వికారమును పొందక జ్ఞాని వారలకు తగురీతి జ్ఞానోపదేశము సేయును.

## ప్రతినిధిన్యాయము

ఒకరికి బదులుగా నుండువానికి, లేక నియమింపఁబడువానికి ప్రతినిధి యనిపేరు. వానివలె.

ఏదేని యొకవస్తువు లోపించినపుడుగాని, దొఱుకనపుడు గాని, తత్స్థానమున మఱొకవస్తువును కల్పించికొని ప్రారబ్ధక్రియాపరిసమాపనమునకుఁ గడఁగుట యని యీ న్యాయముయొక్క ఆశయము.

నిత్యకర్మణోఽనిత్యప్రారబ్ధకర్మణశ్చ ప్రతినిధినా సమాపనాధికరణమ్"

(జైమిని)

ప్రతినిధానన్యాయము

ప్రతినిధి, ప్రతినిధానశబ్దములు పర్యాయము లవుట నియ్యది పై ప్రతినిధిన్యాయరూపాంతరము.

"భోజనలోపేఽప్యద్భిర్వాన్యేనవా ద్రవ్యేణావిరుద్ధేన ప్రతినిధానన్యాయేన ప్రాణాగ్నిహోత్రస్యానుష్ఠానమ్."

కారణాంతరమున భోజన మకృతమైనపుడు నీటిచేఁగాని మఱొకఁ డవిరుద్ధపదార్థముచేఁగాని, ప్రతినిధానన్యాయమున (ప్రతినిధిగ కల్పించి) ప్రాణాగ్నిహోత్రమ నుపాసింపనగును.

ప్రపానకరసన్యాయము

పానకము, రసము మున్నగునవి తత్కారణములకంటె భిన్నము లైనట్లు.

"పదార్థేభ్యోఽన్య ఏవ వాక్యార్థః పానకాదివత్ । యథా పానకం శర్కరానాగకేసరమరీచాదిభ్యోఽర్థాంతరమేవ; యథాచ సిందూరహరితాలలాక్షాదిభ్యోఽర్థాంతరమేవ చిత్రం......తథా పదేభ్యో వాక్యం పదార్థేభ్యో వాక్యార్థః."

పంచదార, మిరియాలు మున్నగువానివలన తయారైనదే అయినను పానకము శర్కరాదులకంటెను; సిందూరము,

హారితాలము, లాతూదులవలన నేర్పడినను చిత్రము సిందూరాదులకంటెను భిన్నపదార్థమైనట్లే పదజన్యమైనను పదములకంటె వాక్యము; పదార్థముకంటె వాక్యార్థము భిన్నములు.

## ప్రవృత్తిక్రమన్యాయము

పాఠక్రమన్యాయమున నిద్దానియర్థము వివరింపఁబడినది. (చూడుఁడు.)

## ప్రస్తరప్రహరణన్యాయము

ప్రస్తరప్రహరణమన దర్భాగ్రములను హోమము చేయుట. అనవసరముగ దర్భలను దాచియుంచికొనక వానిని హోమము చేసి తద్ద్వారా ఉత్కృష్టఫలమును పొందుటయేగాక కర్మకాండానుసారిత్వము మున్నగు ననేక ప్రయోజనములను పొందునట్లు.

అనఁగా— దర్శపూర్ణమాసలయందు ప్రస్తరప్రహరణము సూక్తవాకములతో విధింపఁబడియున్నది. ఆప్రస్తరప్రహరణము (దర్భలతో హోమము) నకు ఫలితమేమన—ఒక హోమాదులకేగాక ఇంకెందును దర్భలకుఁ బ్రయోజనము కాన్పించదు. అట్టి నిరర్థకపదార్థములు గుట్టలు గుట్టలుగ నిలువగాకుండఁబోవుటయు, విధ్యనుసారిత్వము, దేవతాప్రీతి, కర్మాధికారిత్వము మున్నగు ఫలములు ఆహోమము వలన లభించుచున్నవి.

ప్రస్తరప్రహరణమున తాలు రువ్వుట యని మఱియొక యర్థము. తాలు రువ్వుటవలనను ననేకలాభాపత్తి దృష్టమవుచున్నది. అనుపయోగములయిన చిన్నిచిన్ని తాళ్ళు కాళ్లుకొట్టుకొనిపోవునట్లు వ్యర్థముగ నిలువగాక అందందు పారవేయఁబడుటయు, యనుద్దేశమున తాలు రువ్వనారంభించితిమా అయ్యది సిద్ధించుటయు, నెఱవేఱుచున్నవి. ఏతావతా ఆశయ మేమన "ఏకా క్రియా ద్వ్యర్థకరీ" అనునట్లు ఒకేకార్యమువలన ననేకార్థసిద్ధి యవుపట్ల నీన్యాయ ముపయోగింపఁబడును.

### ప్రావర్తికక్రమన్యాయము

ప్రవృత్తిక్రమన్యాయమును జూడుము.

### బర్హిర్న్యాయము

బర్హిస్సు అనఁగా కుశ. ఆకుశఖండమువలె.

"బర్హి ర్దేవసదనం దామి—దేవతలకై కుశను ఖండించుచున్నాను" అను వాక్యముపై నీన్యాయ మాధారపడియున్నది.

దేవసదనమునకు కుశయంతయు ననవసరము. దాని కొనముక్కయే చాలును. కావున ఖండమాత్రమే బర్హిస్సు గ్రహింపఁబడుచున్నది.

అట్లే—ముఖ్యభాగగ్రహణమున నీన్యాయప్రవృత్తి కలుగును.

భస్మన్యాజ్యాహుతిన్యాయము

బూడిదలో నేయి హోమము చేసినట్లు.

అకార్యకరణమున కుద్యుక్తుఁడవు మూర్ఖునకు బోధించుట నిష్ప్రయోజనము. అది కేవల మాయాసకారణము.

"నోపదేశశతేనాపి మూఢోఽకార్యాన్నివర్తతే
శతాంశగ్రసనాత్కేన రాహుర్వాక్యైర్నివారితః?
అకార్యవారణోద్యుక్తో మూఢే యః పరిఖిద్యతే
వాగ్విస్తరో వృథా తస్య భస్మన్యాజ్యాహుతిర్యథా."

భాండానుసారిస్నేహన్యాయము

కుండ కంటియున్న నూనెమాదిరి.

నూనెపోసినకుండను ఎంతతోమినను ఇంకకొంచెము నూనె దాని కంటియే యుండునుగాని పూర్తిగ పోదు.

వ్యతిరేకమున నుదాహరణము—

స్వకృతసుకృతఫలోపభోగమునకై చంద్రమండల మధిరోహించినపుణ్యాత్ములు కర్మఫల మనుభవించి స్వల్పకర్మావశేషమాత్రమున నూనెకుండకు నూనె వలె అచటనే నిలువఁజాలరు. (నూనెకుండకు నూనె అంటియుండునుగాని వారట్లు అచట నిలువఁజాలక తిరిగి మర్త్యలోకమునకు వత్తురు.)

భీమబాసదృఢన్యాయము

భీముఁడు, భాసుఁడు, దృఢుఁడు అనుముగ్గురు రాక్షసుల వలె. (వీరు శంబరునికి ఆప్తులు).

దామవ్యాలకటన్యాయమునుజూడుము.

ఉన్నతస్థితి నొందినను అజ్ఞుఁనకు కాలవశమున నతినీచదశా ప్రాప్తి తప్పక సంభవించునని దామవ్యాలకటన్యాయాశయము.

తత్త్వవేత్త యగునాత డెన్నఁడును స్వపదభ్రష్టుఁడు కానేఁడు అని భీమభాసదృఢన్యాయాశయము. అందువలననే-

"దామవ్యాలకటన్యాయో న తవ స్యాత్కదాచన,
భీమభాసదృఢన్యాయో నిత్య మస్తు తవానఘ!"
అని చెప్పఁబడినది.

వాలుకాన్యాయము

ఇసుకనలుసులవలె.

"యథా ప్రయాన్తి సంయాన్తి స్రోతోవేగేన వాలుకాః
సంయుజ్యన్తే వియుజ్యన్తే తథా కాలేన దేహినః."
భాగవ. స్కం. 6. అ. 15. శ్లో. 3

యే పూర్వజన్మని పిత్రాదిరూపేణ సంయుక్తా ఆసన్త ఏవ మరణేన వియుక్తాః సన్తో వర్తమానజన్మని కదాచి

త్తస్యైవాన్యస్యవా పుత్రాదయో భవన్తి, తే జన్మాన్తరే తస్యైవాన్యస్యవా కలత్రాదయః శత్రుమిత్రాదయోవా భవన్త్యతో నాయం నియమ ఇతి భావః॥ తమేవాభి ప్రాయం ప్రకటయతి యథేతి—స్రోతసః ప్రవాహస్య వేగేన యథా వాలుకాః ప్రయాన్తి ప్రయుజ్యన్తే సం యాన్తి సంయుజ్యన్తే తథా కాలవేగేన దేహినో జీవా అపి॥

ప్రవాహవేగమున నిసుక తెనుకచోఁ గూడి మఱల మఱల విడిపోవుచుండునటులే కాలవేగమున దేహధారు లొకచోఁ గూడి యెవరిత్రోవన వారు విడిపోవుచుందురు.

క్షతే క్షారన్యాయము

పుండుమీఁద ఉప్పు పెట్టినట్లు.

దుస్సహమని భావము

"క్షతే క్షారమివాసహ్యం జాతం తస్యైవ దర్శనమ్"

క్షీరదగ్ధజిహ్వాన్యాయము

వేడివేడిపాలవలనఁ గాలిన నాలుకవలె.

సుఖమునకు పోగా దుఃఖము సంభవించినపు డీన్యాయము ప్రవర్తించును.

క్షీరాబ్ధివాసిక్షీరకామన్యాయము

పాలసముద్రములో నివసించువాఁడు పాలకోసము వెదకు లాడినట్లు.

క్షీరోదకసంపృక్తన్యాయము

పాలు, నీరు కలిసినట్లు.

క్షీరనీరన్యాయమును జూడుము.



# పారిభాషికాది న్యాయములు

## అంగుల్యగ్రే మత్తమాతంగా శ్చరన్తి

నా వ్రేలికొనపై మదించిన యేనుఁగులు తిరుగుచున్నవి అని చెప్పినట్లు.

నమ్మఁదగనివి, గ్రహింపఁదగనివి అగు వాక్యములయం దీన్యాయము ప్రవర్తించును.

"అంగుల్యగ్రాదివాక్యవ దగ్రాహ్య మితి భావః"

నైషధవ్యాఖ్య.

"అంగుల్యగ్రే కరిణాం శతమ్; అంగుల్యగ్రే హస్తియూథ శత మాస్తే; మమ కర్ణకుహరం ప్రవిశ్య సింహః క్రీడతి; మమ కర్ణే ప్రవిశ్య గజో గర్జతి భేషజ ముచ్యతామ్" ఇత్యాదివాక్యముల వలె.

## అంగుల్యగ్రం న తేనైవాంగుల్యగ్రేణ స్పృశ్యతే

ఏదేని వ్రేలికొన ఆ వ్రేలికొనచేతనే స్పృశింపఁబడదు.

"అంగుల్యగ్రం యథాత్మానం నాత్మనా స్ప్రష్టుమర్హతి, స్వాంశేన జ్ఞానమ ప్యేవం నాత్మానం జ్ఞాతు మర్హతి."

అంగుల్యగ్రము తనచేతనే తాను స్పృశింపఁబడనట్లు జ్ఞానము కూడ తనయంశచేఁ దానెఱుంగఁబడ నేఱదు.

అంగులిదీపికయా ధ్వాంతధ్వంసవిధిః

మినుకు మినుకు మను నొక చిన్న దీపమును వ్రేళ్ళతోఁ బట్టుకొని కారుచీఁకటిని బోఁగొట్టఁ బ్రయత్నించినట్లు. స్వల్పసాధనముచే మహాకార్యము సాధింపఁ బూను కొనునపు డీన్యాయ ముపయోగింపఁబడును.

అంతతోఽశ్మాపి జీర్యతే

తుదకు ఱాయి కూడ జీర్ణించిపోవును.

"సర్వం నశ్వరం" అనుట కూతగ నియ్యది వాడఁబడును.

అంతరంగబహిరంగయో రంతరంగం బలీయః

"అసిద్ధం బహిరంగ మంతరంగే" బహిరంగశాస్త్రీయ నిమిత్తసముదాయమున నంతర్భూతములవు నంగములు (నిమిత్తములు) గల విధికార్య మంతరంగము. ఆ అంతరంగ నిమిత్త సముదాయముకన్న నావలనుండు నంగములు (నిమిత్తములు) గల విధికార్యము బహిరంగము. ఆ అంతరంగము ప్రవర్తించునపుడు బహిరంగకార్యము అసిద్ధమవును. అనఁగా—ప్రవర్తింపనేఱదు అను వ్యాకరణ పరిభాషనుండి పైన్యాయము వెలువడినది. అంతరంగబహిరంగ కార్యములయం దంతరంగము బలవత్తరము అని న్యాయముయొక్క అర్థము.

ఉదా—"కార్యస్య తావ దుపాదానాపేక్షా ప్రథమ ముత్పద్యతే, పశ్చా ద్విరోధిసంసర్గభావాపేక్షా। తథా చాంతరంగబహిరంగయో రంతరంగం బలవ దితి న్యాయే

నాంతరంగోపాదానవిషయత్వమేవ తయో ర్నాన్యాయ్యమ్॥"
ఏతావతా—ఒకేచోట రెండు విధులు ప్రవర్తించినపుడు ప్రథమప్రవృత్తవిధి పశ్చాత్ప్రవృత్తమవు విధిని బాధించి తాఁ బ్రవర్తించునని న్యాయాశయము.

అంత స్తాపో బహి శ్శీతమ్

లోపల మంట; పైకి చల్ల దనము.

పైకి ఆదరము; లోపల కుట్ర.

అంధస్యేవాంధలగ్నస్య వినిపాతః పదే పదే

గ్రుడ్డివానిని ఊఁతగాఁ గొనినగ్రుడ్డివాఁడు అడుగడుగున పడుచునే యుండునట్లు.

అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థోఽ గమ్యతే

నిమిత్తశబ్దము ప్రయోగింపఁబడకపోయినను నిమిత్తార్థము గోచరించుచునే యుండును.

"విషము మృత్యువు" అన్నట్లు.
విషము మృత్యువునకు నిమిత్తము అని అర్థము.

అకాలే కృత మకృతం స్యాత్

కానిసమయమునఁ జేయఁబడినది చేయఁబడనిదియే అవును. విహితకాలమున విహితకర్మ మాచరింపక అవిహిత కాలమున నయ్యదియే కర్మ మాచరింపఁ గడంగుట నిరర్థక మగుటయేగాక దానివలనఁ గొంత ప్రత్యవాయము కూడ సంభవింపఁగలదు.

అయ్యదియే గ్రంథకారులచే నుడువబడినది—

"స్వకాలే య దకుర్వం స్తత్కరో ద్య దచేతనః
ప్రత్యవాయోఽస్తి తేనైవ నాభావేన స జన్యతే."

అచింత్యాః ఖలు యే భావా న తాం స్తర్కేణ సాధయేత్

చింతింప వీలుపడని విషయములను వృథాతర్కములతో సాధింపఁజూచు టనవసరము.

అచేతనేష్వపి చేతనవ్యవహారో దృశ్యతే

అచేతనపదార్థములయందును చేతనపదార్థములందువలెనే వ్యవహారము లోకమునఁ గన్పట్టుచున్నది.

"గోడ తగిలినది" అన్నట్లు. గోడకు మొగము తగులవల యునుగాని సాక్షాత్తు గోడవచ్చి మొగమునకు తగులఁ జాలదుగదా!

అణు రపి విశేషోఽధ్యవసాయకరః

విశేషము (సాధనము) స్వల్పమయినను అయ్యదియే సంపూర్ణప్రయోజనకారి యగును.

పుష్టలగుడన్యాయమును జూడుము.

కొలఁది భేద మున్నను నయ్యది తత్సమమే యవును. అనఁగా ఒకేరకపు కొన్నివస్తువులయందు కొలఁదిపాటి భేదము కనుపించుచున్నను అవి యన్నియు సమానములే యవును గాని భేదింపవు.

అత్యన్తపరాజయా ద్వరం సంశయోఽపి

పూర్తిగా పరాజయము నొందుటకంటె సంశయాస్పద మైన స్థితికి వచ్చుట కొంతవఱకు శ్రేయస్కరము.

ఎట్లన —

ఇరువురు శాస్త్రార్థము చేయుచుండ నందులో నొకనికి పూర్వపక్షియొక్క పూర్వపక్షమునకు తగిన సమాధానము స్ఫురింపక నాలుక వ్రేలవేయవలసిన సమయము వచ్చినపు డతడు నోరు మెదల్చికాని, మఱొకవెఱ్ఱిచేష్టకు దిగికాని, పూర్తిగ నోడిపోవుటకన్న సంశయించుచున్న స్థితిలో నాలోచన నభినయించుచు నోరెత్తకుండుట కొంతవఱకు గౌరవము నిల్పుకొనఁ గారణ మవును.

"మరణాద్వరం వ్యాధిః; ప్రధానలోపాద్వర మంగలోపః" మున్నగు వాక్యములవలె.

అత్యన్తబలవన్తోఽపి పౌరజానపదా జనాః,
దుర్బలై రపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితైః.

మిక్కిలి బలవంతు లయినను పట్టణములయందును, పల్లెలయందు నుండు జనులు రాజాశ్రయముగల దుర్బలపురుషులచే బాధింపఁబడు చుందురు.

స్వతఃసిద్ధముగ దుర్బలుఁడైనను ప్రబలుఁడు సహాయముగఁ గల పురుషునిచే స్వభావముగ బలముగల పురుషుఁడు బాధింపఁబడుపట్ల నీన్యాయ ముపయోగింపఁబడును.

"రాజ్ఞా బలేనాల్పబలో బలీయాంసం కుటుంబినమ్
జేతు మాశంసతే తస్మా ద్ధర్మః స్యా ద్బలవత్తమః"

శ్రుతికన్న నత్యల్పమయ్యు స్మృతి ఆచమనరూప ప్రబల పదార్థాశ్రయము కలదవుట బలవత్తరమవుచున్నది.

**అత్యుచ్ఛ్రాయః పతనహేతుః**

మిక్కిలి ఉన్నతత్వము నొందుట పతనకారణమే.

"పెరుగుట విఱుగుటకొఱకే" అన్నట్లు.

**అథ సన్నిహితాదపి వ్యవహితం సాకాంక్షం బలవత్**

సంబంధింపక దగ్గఱనున్న పదముకంటె పదాంతరవ్యవహితమై సాకాంక్షమైన పదము (అర్థక్రమమున) బలీయమవును.

దగ్గఱనున్న ఉదాసీనునికంటె దూరముననున్న ఆప్తుఁడత్యంతోపయోగకరుఁ డవును.

**అనధీతే మహాభాష్యే వ్యర్థా స్యా త్పదమంజరీ;**

**అధీతేఽపి మహాభాష్యే వ్యర్థా స్యా త్పదమంజరీ.**

భాష్యము చదువనియెడల పదమంజరిని చదువుట వ్యర్థము; భాష్యము చదివినపిమ్మట పదమంజరి అసలే నిరుపయోగము.

"కౌముదీ యది కంఠస్థా వృథా భాష్యే పరిశ్రమః,
కౌముదీ య ద్యకంఠస్థా వృథా భాష్యే పరిశ్రమః."

అన్నట్లు.

అన్యోన్యాశ్రయము గలిగి ఒకదానిచే నింకొకదానికి వ్యాఘాతము కలిగినపు డీన్యాయము ప్రవర్తించును.

అనంతరస్య విధిర్వా భవతి ప్రతిషేధో వా

పదాంతరావ్యవహితమైన (మిక్కిలి సన్నిహితమైన) ప్రత్యయము (నఞ్) విధిని బోధింపవచ్చును; ప్రతిషేధమును గూడ బోధింపవచ్చును.

అనన్యలభ్యః శబ్దార్థః

శబ్దముయొక్క అర్థము ఆశబ్దమువలననే తెలిసికొనవలయును గాని మఱొకవిధముగ తెలిసికొన వలనుపడదు.

"యావా నేవ హి అనన్యలభ్యోఽర్థః శబ్దా ద్గమ్యతే స సర్వః శబ్దార్థః" అని తంత్రవార్తికము.

మఱియొకశబ్దముచే నలభ్యమై యొకశబ్దముచే పొందఁబడు నర్థమంతయు ఆశబ్దమునకే అర్థమగుచున్నది.

అనఁగా—ఏఅర్థమునఁ బ్రయోగింపఁబడు శబ్దము ఆ అర్థమునకే వాచకమగును; ఆ అర్థము ఆశబ్దముయొక్కయే వాచ్యమగును.

ఉదా—సుఖవిశేషమున నుపయోగింపఁబడిన స్వర్గశబ్దము సుఖవిశేషవాచకమును; ఆసుఖవిశేషము ప్రయుజ్యమాన స్వర్గశబ్దముయొక్క వాచ్యమును అవును.

"అనన్యలభ్యః శాస్త్రార్థః" అనునట్లు.

అనన్యలభ్యః శాస్త్రార్థః

శాస్త్రార్థము శాస్త్రముచేతనే యెఱుంగ వీలవును గాని, మఱొకదానిమూలమున నెఱుంగఁబడ నేఱదు.

"అనన్యలభ్యః శబ్దార్థః" వలె.

అనవయవే శాస్త్రార్థసంప్రత్యయః

శాస్త్రవిధి తద్విధిబోధకవాక్యమున నవయవములుగ ప్రయోగింపఁబడని విషయములయందును బ్రవర్తించును. "కల్లు త్రాగకూడదు" అనిన వాక్యమున నప్రయుజ్యమాన మైనను "సారాయిని కూడ త్రాగకూడదు" అని ఆవాక్యమే బోధించుచున్నది.

"కాకదధిఘాతకన్యాయము" వలె.

అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్యమ్

ఓదార్చువారు లేక మితిమీఱి దుఃఖించు మనసున కంతయు నసహ్యముగఁ దోఁచును.

అనిర్వేదప్రాప్యాణి శ్రేయాంసి

నిర్వేదమును వదలివైచియే శ్రేయస్సులను బొందవలెను.

అనిషిద్ధ మనుమతమ్

నిషేధింపఁ బడనిది అంగీకరింపఁబడినట్లే.

"*Silence gives consent*"

మౌన మంగీకారసూచక మనునట్లు.

అనుకరణం హి శిష్టస్య సాధు భవతి

సత్పురుషుల ననుకరించుట శ్రేయస్కరము.

"సమున్నయన్ భూతి మనార్యసంగమా
ద్వరం విరోధోఽపి మహాత్మభిః సమమ్".

అను భారవి వాక్యమువలె.

అనురాగ మనురాగేణ ప్రత్యేష్టవ్యః

తా ననురాగమును జూపి యితరులఅనురాగము తాను పొందవలెను.

"ఇచ్చి పుచ్చుకొ"మ్మనట్లు.

అన్యవేశ్మస్థితా ద్ధూమా న్న వేశ్మాంతర మగ్నిమత్

ఒకయింటిలోనుండి పొగవచ్చుటను చూచి మఱొక యింటిలో నిప్పున్నదని అనుకొనట్లు.

అన్యద్భుక్త మన్యద్వాంతమ్

ఒకఁడు తినఁగా మఱొకఁడు కక్కుకొన్నట్లు.

"కాచి న్నిషాదీ తనయం ప్రసూతే
కశ్చి న్నిషాదస్తు కషాయపాయీ"

అనుదానివలె.

అన్యార్థ మపి ప్రకృత మన్యార్థం భవతి

ఒకప్రయోజనమునకై కావింపబడిన యొకవస్తువు మఱొక ప్రయోజనమునకుగూడ ఉపయోగించును.

"యత్రాన్య దుచ్యతే న చాన్యార్థం ప్రకృత మన్యార్థం భవతీ త్యన్యార్థమపి ప్రకృత మన్యార్థం భవతి। తద్యథా- శాల్యర్థం కుల్యాః ప్రణీయన్తే తాభ్యశ్చ పానీయం పీయత ఉపస్పృశ్యతేచ శాలయశ్చ భావ్యన్తే."

ఉదా—చెంబులో తాను త్రాగుటకై తెచ్చి యుంచు కొనిన యుదకము యితరులకుకూడ నుపయోగించునట్లు. "కుల్యాప్రణయనన్యాయమును, జామాత్రర్థం శ్రపితస్య సూపాదే రతిథ్యుపకారకత్వమ్" అను న్యాయమును జూడుము.

అపంథానం తు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి

తప్పుత్రోవన పోవువానిని సోదరుఁడుకూడ వదలివైచును.

అపరాద్ధేషో రివ ధానుష్కస్య కంఠాడంబరః

బాణము గురి తప్పుచు ఉండు ధనుర్ధరునికి వాగాడంబరమువలె.

" అనిర్లోడితకార్యస్య వాగ్జాలం వాగ్మినో వృథా
నిమిత్తా దపరాద్ధేషో ర్ధానుష్కస్యేవ వల్గితమ్."

మాఘము.

కార్యశూరుఁడు కానివాని అధికప్రలాపము వ్యర్థమని భావము.

"ఒట్టిగొడ్డుకు అఱపు లెక్కువ." (ఆ అఱపులు కేవలము నిష్ప్రయోజనములు.)

## అపవాదై రుత్సర్గా బాధ్యన్తే

సామాన్యశాస్త్రములచే అపవాదశాస్త్రములు బాధింపఁబడును.

ఈయది వ్యాకరణపరిభాష. సామాన్యముగ చెప్పఁబడిన విధి (General rule) దాని కపవాదముగ అనఁగా బాధకముగా చెప్పబడిన మఱొకవిధి (Special rule)చే బాధింపఁబడును.

"లబ్ధప్రతిష్ఠాః ప్రథమం కిం యూయం బలవత్తరైః
అపవాదై రివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః"
కుమారసంభవము 2—27

"యః కశ్చన రఘూణాంహి పర మేకః పరంతపః,
అపవాద ఇవోత్సర్గం వ్యావర్తయితు మీశ్వరః"
రఘువంశము 15—7.

## అప్రాప్తే శాస్త్ర మర్థవత్

సరియగు నర్థము ప్రతీతము కానప్పుడును, మఱొకవిధమున నయ్యర్థమును సాధింప నవకాశము, గతి లేనప్పుడును శాస్త్రము అర్థవంత మగును అనఁగా— తదర్థబోధనమున శాస్త్రము ప్రవర్తించును.

"అనధిగతే శాస్త్ర మర్థవత్" అనియు నీన్యాయమునకు పాఠముక గలదు.

అభ్యంతరాశ్చ సముదాయేఽవయవాః

ఒకసముదాయమున నంతర్భూతములవు పదార్థములు తదవయవములే యగును.

కావున—తత్సముదాయాభిహితార్థము తదంతర్భూతావయవములకును సంబంధించును.

ఉదా:— రైలు పోవుచున్నది అనిన దానిచక్రములు కూడదొర్లిపోవుచున్నవి అని వేఱ చెప్పనక్కఱ లేదుకదా!

అభ్యర్హితం పూర్వమ్

ప్రశస్తమైనది, ప్రధానమైనది, ముందు ప్రవర్తించును.

అనఁగా- అగ్రస్థానము దానికే యీయఁబడును.

"మాతాపితరౌ - తల్లిదండ్రులు" అనునట్లు.

"ప్రధానవాదస్యైవ ప్రాధాన్యేన నిరాసే హేత్వంతర మాహ సచేతి। న కేవల మభ్యర్హితత్వాత్తస్య ప్రాధాన్యం స్మృతిమూలత్వా త్తదపీత్యాహ॥"

బ్రహ్మసూత్ర (ఆనందగిరి) భాష్యమ్ 1-4-28

అమ్బుని మజ్జం త్యలాబూని గ్రావాణః ప్లవన్తే

మజ్జం త్యలాబూని శిలాః ప్లవన్తే
ముహ్యన్తి నావోంభసి శశ్వదేవ."

ఒకప్పుడు నీటిలో సొరకాయలు మునుఁగుచున్నవి; ఱాళ్ళు తేలిపోవుచున్నవి అన్నట్లు.

"ఏవం జాతీయకం ప్రమాణవిరుద్ధం వచన మప్రమాణమ్।
అమ్బని మజ్జన్త్యలాబూని గ్రావాణః ప్లవన్త ఇతియథా"
లౌకికముగా వచ్చుచు ప్రమాణవిరుద్ధ మయిన వాక్యము
ప్రమాణము కానేఱదు.

అయ మపరో గండస్యోపరి స్ఫోటః

కాలుటచేఁ గలిగిన పుండుపై ఈబొబ్బ యింకొకటికూడ.

"తదో గణ్డస్స ఉవరి పిణ్డిఆ సంవుత్తా
తదా గణ్డస్యోపరి పిణ్డికా (పిటకా) సంవృత్తా
అభిజ్ఞానశాకుంతలమ్.

"ఉన్న దుండఁగా పైన ఉపాకర్మ యింకొకటి" అని
తెనుగుసామెత.

అర్కే చే న్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్

అర్కము (ఒకానొకచెట్టు) నందె తేనె దొఱకునెడల
తేనెకై పర్వతముల కేల వెళ్ళవలయును ?

"కేవలా చ్చేత్ జ్ఞానా త్పురుషార్థసిద్ధిః స్యా త్కిమర్థ
మనేకాయాససమన్వితాని కర్మాణి తే కుర్యుః? అర్కే
చే న్మధు విన్దేత కిమర్థం పర్వతం వ్రజేదితి న్యాయాత్"

కేవలజ్ఞానముననే పురుషార్థసిద్ధి యవునెడ ననేకాయాస
కరములవు నితరకర్మలు చేయనేల?

అర్థీ సమర్థో విద్వా నధిక్రియతే

అర్థవంతుఁడు, సమర్థుఁడు విద్వాంసుఁడు అధికారము గల వాఁ డవుచున్నాఁడు.

"శాస్త్రం హ్యవిశేష ప్రవృత్తమపి మనుష్యానేవాధి కరోతి శక్తత్వా దర్థిత్వా దపర్యుదస్తత్వా దుపనయనాది శాస్త్రాచ్చేతి వర్ణిత మేత దధికారలక్షణే."

శంకరభాష్యమ్.

అధికారన్యాయమును జూడుము.

అధికారన్యాయమున కామనయా కర్మప్రవృత్తి సూచిత మవును. కాని, యిం దది లేదు; కేవల మొకానొక క్రియ కధికారము మాత్రమే సూచింపఁ బడును.

అవతప్తే నకులస్థితమ్

వేడిప్రదేశమున ముంగిసల నిలుకడవలె.

వెచ్చని చోట ముంగిస లుండక వెంటనే ఆవలకుపోవును.

"యథావతప్తే నకులా న చిరం స్థాతారో భవ న్త్యేవం కార్యాణ్యారభ్య యో న చిరం తిష్ఠతి స ఉచ్యతే ఽవతప్తే నకులస్థితం త ఏత దితి."

మహాభాష్యమ్.

తప్తస్థలమున నకులములు చాలకాల ముండనట్లే కార్యములను ప్రారంభించి పట్టుదలతో నాకృత్యములందు నిలువక వెంటనే వదలివైచుటకు అవతప్తే నకులస్థిత న్యాయోదాహరణమును గైకొందురు.

తీర్థకాకన్యాయమువలెనే.

అవయవప్రసిద్ధేః సముదాయప్రసిద్ధి ర్బలీయసీ

అవయవసిద్ధార్థముకన్న సముదాయసిద్ధార్థముబలవత్తరము. "పంకజమ్" అనిన నత్తగుల్లగాక పద్మము అని అర్థము చెప్పునట్లు.

"గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః" అను పరిభాషవలె.

అవయవా ఏవార్థవన్తో న సముదాయః

ఒకవాక్యమందలి అవయవభూతములవు పదము లర్థవంతములై ఒకఅర్థమును సముదాయము (వాక్యము)నకు కలిగించునుగాని ప్రత్యేకముగ సముదాయమునన కాక అర్థముండదు.

ఈనియమమునే మఱొకవిధముగఁ గూడ నుడువుదురు. "అవయవార్థవత్త్వా త్సముదాయార్థవత్త్వమ్" అని. అవయవము లర్థవంతము లయిన సముదాయ మర్థవంతమవును; లేనిచో నిరర్థక మవును. అని దీని అర్థము.

అవశ్యాపేక్షితానపేక్షితయో రపేక్షితం స్మరణీయమ్

అవసరము, అనవసరము ఐనవానిలో ప్రస్తుతము తనకవసరమైనదానినే కోరుకొనుట శ్రేయస్కరము.

అశక్తా స్తత్పదం గంతుం తతో నిందాం ప్రకుర్వతే

ఆకాస్తదూరము పోలేనివారు అంతకన్న దూరముననున్న ప్రదేశమును "అబ్బ! దీనిమచ్చమాయ, ఇంకా ఇంత దూర మున్నది" అంటూ నిందింతురు.

అశ్వారూఢాః కథం చాశ్వాన్ విస్మరేయుః సచేతనాః ?

గుఱ్ఱము నెక్కినవారు సచేతనులై యుండి తా మెక్కిన గుఱ్ఱము నెట్లు మఱచిపోదురు ?

అట్లు మఱచుట ఆత్మవంచన మవును.

ఉదా.—వేదప్రమాణత్వమును దృఢీకరింపఁ బోయి తానే వేదమున కప్రామాణ్యము ప్రతిపాదించుచు తనవాదమును తప్పినట్లు.

అసాధారణ్యేన వ్యపదేశా భవన్తి

సర్వసాధారణము గాని యొక ప్రత్యేకతచే నామాదులీయఁబడును.

అసిద్ధం బహిరంగ మంతరంగే

చూడుము-"అంతరంగబహిరంగయోరంతరంగం బలీయః"

అస్త్ర మస్త్రేణ శామ్యతి

అస్త్రము అస్త్రము చేతనే శాంతింపఁ జేయఁబడును.

"విషం విషేణ వ్యథతే; వజ్రం వజ్రేణ భిద్యతే;
గజేన్ద్రో దృష్టసారేణ గజేన్ద్రేణైవ బధ్యతే."

వ్యతిరేకమున—డబ్బుసంపాదనకు డబ్బే కావలయు—ననువిధమున.

అస్నేహదీపన్యాయము

చమురు లేని దీపము వలె.

క్రమక్రమముగ తనలో తాను లీనమై పోవుట నీన్యాయము సూచించును.

అహృదయవచసా మహృదయ ముత్తరమ్

హృదయపూర్వకములు గాని మాటలకు హృదయపూర్వకము గాని సమాధానమే యీయఁబడును.

"యాదృశో యక్షః స్తాదృశో బలిః" యక్షుఁ డెట్టివాఁడో అట్టిదే బలికూడ.

"గంతకు తగిన బొంత" అని తెనుఁగుసామెత.

అజ్ఞాతకులశీలస్య వాసో దేయో కస్యచిత్

ఊరు, పేరు, కులము, శీలము తెలియని యితరపురుషున కెవనికిని యింటిలో నాశ్రయ మీఁగూడదు.

(అ ట్లిచ్చుట ప్రమాదము.)

అఖ్యాతానా మర్థం బ్రువతాం శక్తిః సహకారిణీ

"అఖ్యాతానా మర్థం బోధయతా మధికారిశక్తిః సహకారిణీ" అని మఞ్జూకరకమునఁగూడ నీన్యాయము వాడఁబడును.

ఉద్దిష్టశబ్దముల కర్థము నుడువునపు డాశబ్దములశక్తి సహాయకారిణి యవును.

తాదృశార్థావబోధకశక్తి ఆశబ్దముల కుండుటంజేసియే ఆ అర్థము నుడువఁబడును.

కామ్యాదికర్మానుష్ఠానమునఁ దదనుష్ఠానమునకు శక్తుఁడవు నధికారియొక్క తచ్ఛక్తతాశక్తి తదనుష్ఠానమునఁ దోఁపడును. కాని, అనుష్ఠానమున కామ్యాదికర్మములు తోఁడుపడవు.

ఆత్మచ్ఛిద్రం న పశ్యన్తి పరచ్ఛిద్రానుసారిణః

"తప్పు లెన్నువారు తమతప్పు లెఱుఁగరు."

ఆదా వన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా

ఆదియందు, నంతమందు లేనిది వర్తమానమందును అట్టిదియే (లేనిదే) అవును.

ఆమ్రాన్ పృష్టః కోవిదారా నాచష్టే

మామిడిచెట్లున్నవా అని అడిగిన ఆ. ఉన్నవండి, కోవిదార చెట్లు అని చెప్పినట్లు.

పృచ్ఛకుని ప్రశ్నకు వలయు సమాధానమీక అజిజ్ఞాసితవ్యమై, అప్రస్తుతమైన వస్తువునుగుఱించి సమాధానముగఁ జెప్పునప్పు డీన్యాయము ప్రవర్తించును.

"పెసలున్నవా అనిన చాల చక్కని మొదటినంబరు మినుము లున్నవండీ" అని షాహుకారు సమాధానము చెప్పునట్లు.

ఆమ్రే ఫలార్థే నిమిత్తే ఛాయా గన్ధ ఇత్యనూత్పద్యేతే

ఫలములనిమిత్తము నాటఁబడిన తీయమామిడిచెట్టువలన పరిమళము, నీడయు అడుగకయే లభించుచున్నవి.

ఫలవత్సహకారన్యాయమును జూడుము.

ఆయుర్ఘృతమ్

నెయ్యి ఆయుర్దాయము అనినట్లు.

నెయ్యియే ఆయువు కానేఱదు. కాని, నేయి ఆయువు అనిన నేయి ఆయువునకు నిమిత్తము అని అర్థము నుడువఁబడుచున్నది.

"అయుర్ఘృతం నదీ పుణ్యాం భయం చోరః సుఖం ప్రియా వైరం ద్యూతం గురు జ్ఞానం శ్రేయో బ్రాహ్మణపూజనమ్."

ఇత్యాదు లెఱుంగునది.

చూడుము— "దధిత్రపుసం ప్రత్యక్షో జ్వరః"

"అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థో గమ్యతే" అను న్యాయమున నిందు ఘృతాదులు నిమిత్తార్థబోధకము లవుచున్నవి.

ఆర్ద్రం వస్త్రం సమన్తా ద్వాతానీతం రేణుజాత ముపాదత్తే

తడిగుడ్డ నలుమూలలనుండి వాయువుచేఁ గొనిరాఁబడిన పరాగరేణువులను గ్రహించి తనపై నిలువజేయును.

అట్లే – కషాయజలార్ద్రి మవు నాత్మ యోగానీతకర్మ విశేషము నంతట గ్రహించును.

ఎట్లుగాఁ గాల్చి నీటిలో వేయఁబడిన యినుపముద్ద నీటిని తనస్వరూపమున నన్నిప్రదేశములయందు తీసికొనును. అట్లే—కషాయోష్ణజీవుఁడు యోగానీతకర్మము నంతట స్వీకరించును.

ఆషాఢవాతే చలతి ద్వీపేన్ద్రే చక్రీవతో వారిధిరేవ కాష్ఠా

"ఆషాఢవాయుసంబద్ధే ద్వీపేన్ద్రే గజేన్ద్రే చలతి ఇతస్తతో దోలాయమానే సతి చక్రీవతో రాసభస్య వారిధిః సముద్రఏవ కాష్ఠా విశ్రామావధి రిత్యర్థః"

వానతో భయంకరమైన ఆషాడమాసమందలి విసురు గాలిలో కట్టివేయఁబడియున్న ఏనుఁగే చలించిపోయి అస్తవ్యస్త మవుచున్నపుడు గాడిదకు సముద్రమేగతి.

"మహాగజాః పలాయన్తే మశకానాంతు కా గతిః" బ్రహ్మణ్యులయిన వామదేవాదులకే ముక్తి దురాపమవు చుండ, నిఁక సామాన్యులవిషయమునఁ జెప్పవలసిన దేమున్నది ?

ఇతో వ్యాఘ్ర ఇత స్తటీ

ఇటు పెద్దపులి, అటు నది.

ముందు నుయ్యి, వెనుక గొయ్యి అన్నట్లు.

సర్పచుచుందరీన్యాయమును జూడుము.

ఇష్యమాణస్యైవ ప్రాధాన్యం న త్విచ్ఛాయాః

ఇష్యమాణవస్తువే ప్రధానముగాని ఇచ్ఛ ప్రధానముగాదు.
"జ్ఞాతు మిచ్ఛా జిజ్ఞాసా । ఇచ్ఛాయా ఇష్యమాణప్రధానత్వా దిష్యమాణం జ్ఞాన మిహ విధీయతే."
తెలిసికొనవలయునను ఇచ్ఛ జిజ్ఞాస. ఇష్యమాణము జ్ఞానము. వీనిలో పైన్యాయమువలన నిష్యమాణ విజ్ఞానమే యిట విధింపఁబడుచున్నది.

ఉక్తార్థానా మప్రయోగః

ఒకమాఱు వచింపఁబడినవానికి మఱల ప్రయోగము కలుగనేఱదు.

చెప్పినదానినే చెప్పు టనవసరము.

ఉత్కృష్టదృష్టి ర్నికృష్టేఽధ్యసితవ్యా

పెద్దచూపు చిన్నదానియందును ఉంచవచ్చును.
బ్రహ్మదృష్టి నాదిత్యాదులయందువలె.
"నికృష్టదృష్టి ర్నోత్కృష్టే" అనున్యాయమున కియ్యది విరుద్ధము.
తక్కువదృష్టిని అధికునియందునుంచు టసంగతము.
"ఉత్కృష్టే హి రాజని భృత్యదృష్టిః ప్రత్యవాయకరీ, భృత్యేతు రాజదృష్టి రభ్యుదయాయ."
అధికుఁడవు రాజునందు భృత్యదృష్టి అసంగతము, ప్రత్యవాయకరమును; భృత్యునియందు రాజదృష్టి శ్రేయస్కారణమే. అని పైరెండున్యాయముల అర్థము.

ఉత్తీర్ణేచ జలే పారే నౌకయా కిం ప్రయోజనమ్ ?

నది దాఁటి యావలియొడ్డు సేరినవెనుక నావతో నవసర మేమి ?

ఉత్పతితో హి చణకః శక్తః కిం భ్రాష్ట్రికం భంక్తుమ్ ?

కాలినమంగలములో వేయఁబడి క్రిందికిమీఁదికి నెగురు శనగగింజ మంగలమును బ్రద్దలుచేయఁగలదా ?

ఉదా—అల్పునిమిడిసిపాటు.

తప్తభ్రాష్ట్రతిలన్యాయమును జూడుము.

ఉదరే భృతే కోశో భృతః

పొట్ట నింపుకొనిన ధనపుకొట్లు నింపుకొనినంతఫలము.

ఇంత దారిద్ర్యము ననుభవించుచు—పొట్టనింపుకోఁగలుగు చున్నాను. అదియే చాలు. కొట్లకొలఁది గడించి కోశాగారములు నింపినంత భాగ్యము.

ఉద్దీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ?

కొంప తగుల బడుచుండఁగా బావి త్రవ్వ ప్రయత్నించు టెటులుండును ?

ఉపజీవ్యవిరోధస్యాయుక్తత్వమ్

ఉపజీవ్యము అనఁగా కారణము ; (కార్యమునకు) విరుద్ధ ముగా నుండఁగూడదు.

ఉపయ న్నపయన్ ధర్మో వికరోతి హి ధర్మిణమ్

ప్రవర్తించుచు, నివృత్తమై ప్రవర్తింపకయు నటు నిటు నుండు ధర్మము ధర్మిని వికారము నొందించును.

ఒకపు డొకరకపుధర్మము, మఱొకపు డింకొకరకపు ధర్మము చెప్పు వస్తుధర్మము ధర్మిని (ఆలక్షణముగలవస్తువును) మఱొకరకపురూపముగలదానిని జేసివైచును.

దీనినే—ధర్మో వికరోతి హి ధర్మిణమ్—అనియుకూడ వాడుదురు.

ఉపవాసా ద్వరం భిక్షా

ఉపవాసము చేయుటకన్న బిచ్చమెత్తుకొనుట మేలు.

అజ్ఞానముచే భేదత్వకల్పన మొనరించికొని భ్రష్టుఁడవుట కన్న తనకభిమానముగల మూర్త్యంతరమున మనసు నిలిపి ధ్యానించుట శ్రేయస్కరము.

"మరణా ద్వరం వ్యాధిః" అనినట్లు.

ఉపసంజనిష్యమాణనిమిత్తోఽప్యపవాద ఉపసంజాతనిమిత్తమ ప్యుత్సర్గం బాధతే

ప్రవృత్తికి నిమిత్తములు కలిగినదైనను, తొలుత వచింపఁబడిన సామాన్యశాస్త్రమును, స్వయంప్రవృత్తికి నిమిత్తములు కల తరువాతి అపవాదశాస్త్రము బాధించి తాను ప్రవర్తించును.

తనకృత్యము పూర్వమే ముగిసి, తరువాత తత్ప్రవృత్తి చేతను ఫలము కలుగని సందర్భమున నీన్యాయము ప్రవర్తించును.

దేవదత్తహంతృహతన్యాయమును జూడుము.

ఉపోషితస్య వ్యాఘ్రస్య పారణం పశుమారణమ్

వ్యాఘ్రోపవాసన్యాయమును జూడుము.

ఉష్ణ ముష్ణేన శీతలమ్

వేడి వేడిచేత చల్లబడును.

ఋజుమార్గేణ సిధ్యతోఽర్థస్య వక్రేణ సాధనాయోగః

తిన్నని మార్గమున సిద్ధించుచుండఁగా నొకపని క్లిష్టమైన వంకరమార్గముచే సాధింప యత్నింపఁబడదు.

"అర్కే చే న్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్" వలె.

ఋణవ్రణకలంకానాం కాలే లోపో భవిష్యతి

అప్పు, పుండు, నింద ఇవి ఒకప్పుడు (తగిన కాలము వచ్చినపుడు) సమసిపోవును.

ఏకం చిత్తం ద్వయో రేవ కి మసాధ్యమ్?

ఇరువురిమనసు ఒకటైన నసాధ్య మే ముండును?

ఏకదేశవికృత మనన్యవత్

ఒకవస్తువున కొకభాగమున వికారము (మార్పు) కలిగినను అది ఆవస్తువే అగునుగాని మఱొండు కానేఱదు.

"శ్వా కర్ణే వా పుచ్ఛే వా ఛిన్నే శ్వైవ భవతి నాశ్వో న గర్దభః" అను న్యాయమువిధమున.

ఏకః పాపాని కురుతే ఫలం భుంక్తే మహాజనః

ఒకఁడు పాపము చేసిన సంఘమున కంతకును తత్ఫలము సంభవించును.

ఏక మనుసన్ధిత్సతోఽపరం ప్రచ్యవతే

ఒకవిషయమున నభిసంధి కలిగి నిమగ్నుఁడై యున్నవానికి రెండవది నశించును.

ఉదా—సుఖవంతునకు దుఃఖము; దుఃఖవంతునకు సుఖము.

ఏకసంబంధిదర్శనేఽన్యసమ్బన్ధిస్మరణమ్

ఒకవస్తువును చూచినపుడు అద్దానికి సంబంధించిన మఱొక వస్తువునుగూడ స్మరించుట.

"యథా హస్తిపకదర్శనం హస్తిస్మారకం తథా నద్యాదిజ్ఞానస్య కుశకాశజలతుంబికాజలూకానాం తత్సంబంధినాం స్మరణహేతుత్వమ్"

మావటివానిం జూచుట వానికి సంబంధించిన ఏనుఁగును గూడ స్మరింపఁజేయునట్లు నద్యాదిజ్ఞానము తత్సంబంధములగు తెల్లు, తెల్లుపూవు, నీటిలోని జలగలు, చేపలు మున్నగు వానినికూడ స్మరింప హేతు వవును.

"ఏకసంబంధిజ్ఞాన మపరసంబంధిస్మారకమ్"; "ఏకసంబంధి దర్శన మన్యసంబంధిస్మారకమ్" అను నీరెండును పైన్యాయముయొక్క రూపాంతరములు.

ఏకస్యాఽప్యనేకశక్తిసమ్భవా దనేకార్థప్రత్యాయన మవిరుద్ధమ్

ఒకవస్తువు అనేకరకముల శక్తులు కలిగియున్నపుడు అది అనేకప్రయోజనములను సాధింప ప్రవర్తించుట విరుద్ధము కానేఱదు.

అనేకార్థములు గల శబ్దము ప్రయుక్తమై అనేకార్థములు స్ఫురింపఁజేయుటలో నాశ్చర్యము లేదుగదా!

ఏకాకినీ ప్రతిజ్ఞా హి ప్రతిజ్ఞాతం న సాధయేత్

కేవలప్రతిజ్ఞామాత్రము ప్రతిజ్ఞాతార్థమును సాధింపనేఱదు. (పతిజ్ఞచేసినంతమాత్రమున అర్థము సిద్ధింపదు.)

"న హి ప్రతిజ్ఞామాత్రేణార్థసిద్ధిః" "నచ ప్రతిజ్ఞా ప్రతిజ్ఞాతం సాధయతి" అను నవి రెండు నీన్యాయరూపాంతరములు.

ఏకా క్రియా ద్వ్యర్థకరీ

ఒకే పని; రెండు ప్రయోజనములు.

యజ్ఞాదులవలన స్వర్గమేకాక రంభాసంభోగము, ఇంద్రప్రీతి, వర్షములు కురియుట, జగత్క్షేమము మున్నగునవి కూడ కలుగునట్లు.

*Two birds at one shot*

ఏకా మసిద్ధిం పరిహరతో ద్వితీయాపద్యతే

అసిద్ధి అనఁ దనయాశయము నెఱవేఱకపోవుట. ఆశ్రయాసిద్ధి, స్వరూపాసిద్ధి, వ్యాప్యతాసిద్ధి అని అసిద్ధి మూఁడు విధములు.

ఒకరకపు అసిద్ధిని ఎట్లో దాఁటిన వెనువెంటనే రెండవది ఆపాదించినట్లు అని న్యాయముయొక్క అర్థము.

"అంకురాద్యకర్తృకం శరీ ర్యజన్యత్వాత్" అను స్థలమున "శరీరీ" అను విశేషణముచే స్వరూపాసిద్ధిని నివృత్తిచేయు బౌద్ధునికి వ్యాప్యతాసిద్ధి సంభవించినట్లు.

ఒక అనర్థమును తప్పించుకొనిన మఱొక అనర్థము పైఁబడి నట్లు అని న్యాయలౌకికప్రవృత్తి.

ఏకోఽపి హన్తి గుణలక్ష మపీహ దోషః

లక్షసద్గుణములను ఒక దోషము తుడిచివేయును.

నూఱు వ్రతములు ఒకఅంకుతో పోయినట్లు అని తెనుఁగు సామెత.

కడవెఁడు పాలు ఒకవిషబిందువుతో పాడయినట్లు.

ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః

సుగుణములు కుప్పలు కుప్పలుగా నున్నపుడు ఒకదోషమున్నను అది వానిలో మునిఁగి కలిసిపోవును గాని వస్తువునకు కళంకము తెచ్చిపెట్టనేఱదు.

ఉదా—సుధాకరుని కిరణములయందు నల్లనిమచ్చ.

అనన్తరత్నప్రభవస్య యస్య
హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్,
ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః''

కుమారసంభవము.

కటకగవోదాహరణమ్

కొట్టములో కట్టివేయబడిన ఆవువలె.

కొట్టములో కట్టివేయఁబడిన ఆవు పరుగెత్తుచున్న తోడి పశువులతోపాటు కాలిపలుపుతో సహా పారిపోవును.

త్రోటిపశువులదోషమువలన ఆ ఆవుకూడ పరుగిడ నారంభించును— చౌరాపరాధా న్మాండవ్యనిగ్రహః—అను దానివలె.

కొట్టమునుండి వెడలగొట్టఁబడిన గోవు తిరిగి కొట్టముననే వచ్చును గాని వేఱొకచోటికి పోదు.

కఫోణిగుడన్యాయము

మోచేతిపై బెల్లమున్నదని నాకినట్లు.

వస్తువు లేకున్నను ఉన్నదను నాశచే పోయి మఱొక యవస్థనుపొందునపు డీన్యాయము ప్రవర్తించును.

కర్మభూయస్త్వా త్ఫలభూయస్త్వమ్

కర్మములు మఱలమఱల చేయుచున్నఁ దత్ఫలముగూడ మఱలమఱల సంభవించుచునే యుండును.

ఇయ్యదియే గ్రంథాంతరములందు—అంగభూయస్త్వాత్ఫలభూయస్త్వమ్—అని యుపయోగింపఁబడినది.

కలశపురస్సరప్రాసాదనిర్మాణతుల్యమ్

కలశపురస్సరముగ దేవాలయ, ధనికాగారములను నిర్మించునట్లు.

ప్రాసాదముపై స్వర్ణకుంభ (కలశ), ధ్వజ, ముఖ్యములు స్థాపింపఁబడుట సుప్రసిద్ధము.

కాకోలూకనిశావత్

కాకులకు రాత్రి గుడ్లగూబలకు పగలును, గుడ్లగూబలకు రాత్రి కాకులకు పగలును అవును.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః."
భగవద్గీత—2—69

అట్లే సర్వభూతములకు రాత్రి మహాయోగికి పగలును; మహాయోగికి రాత్రి సర్వభూతములకు పగలును అవును.

"కాకోలూకనిశేవాయం సంసారోఽజ్ఞాత్మవేదినోః,
యా నిశా సర్వభూతానా మిత్యవోచ త్స్వయం హరిః."
సురేశ్వరవార్తికము.

దీనిపై నానందగిరివ్యాఖ్య యిటు లున్నది—

"కాకేతి—యా కాకాదీనాం ప్రసిద్ధా నిశా తస్యా ములూకో జాగర్తీతి తద్దృష్ట్యా సాపలిప్యతే । యదాచ కాకాదయో జాగ్రతి తదా నక్తంచరో నిశేతి కాకాది దృష్ట్యా సాపహ్నూయతే యథేత్యర్థః । ఏవ మజ్ఞస్యాయం మాత్రాదిః సంసారో యదా వివర్తతే తదా తద్దృష్ట్యా తత్త్వస్యాసత్కల్పనా। యదా విదుష స్తత్త్వానుభవ స్తదా తద్దృష్ట్యా మాత్రాదే రసత్త్వమితి॥"

కాచి న్నిషాదీ తనయం ప్రసూతే కశ్చి న్నిషాదస్తు కషాయపాయీ

ఒక నిషాదాంగన కుమారుని కనఁగా నొక నిషాదుఁడు తాను కషాయము త్రాగినాఁడఁట.

చూడుము. "అన్యద్భుక్త మన్యద్వాంతం"

కారణనాశే కార్యనాశః

కారణము నశించిన కార్యము కూడ నశించును

అట్లే—కార్యనాశే కారణనాశః—కార్యము నశించిన కారణముకూడ నశించిపోవును.

కారయితుః కర్తృత్వమ్

చేయించువాఁడు చేయువాఁడుకూడ అవును.

ఖూనీ చేయించువాఁడు చేయువాఁడు కాఁడా ?

ఖాదఘాతకన్యాయమును జూడుము.

కార్యేణ కారణసమ్ప్రత్యయః

కార్యమును బట్టి కారణము నెఱుంగనగును.

కిఙ్కరస్థానే కిఙ్కరద్వయనివేశనమ్

ఒకసేవకుఁడు చాలినచోట ఇరువురుసేవకులను నియమించినట్లు.

ప్రయాణమునకు సంసిద్ధుఁడై యున్న యొక యజమాని సేవకునితో "ఓరీ రైలు కింక నెంత వేళ యున్నది?" అని అడుగఁగా నాతఁడు "సరిగా పది నిమిషము లున్న" దని చెప్పెను. అంత యజమాని "రైలుదగ్గఱకు కారెంత సేపటిలో పోగలదు?" అని ప్రశ్నింప — పది నిమిషములలో పోగలదండీ—అని సేవకుఁడు బదులాడెను. అంత నాతఁడు—సరే, త్వరగా పోయి రెండుకార్లు తీసికొని రమ్ము; యింకను త్వరగా పోవచ్చు—నని చెప్పెనఁట.

కి మజ్ఞస్య దుష్కరమ్

మూర్ఖుఁడు చేయలేని దేమున్నది?
ప్రతిపనికి తెగించునని భావము.

కి మార్దరికవణిజో వహిత్రచిన్తయా

అల్లపువ్యాపారికి పడవలవిచారణ ఎందులకు ?

కుబ్జోపి చిత్రం శయితుం సమీహతే

మరిగుజ్జువాఁడుకూడా కాళ్లు ముడిచికొని పడుకొన నిచ్ఛగించును.

చూఁడుము— భేకోఽపి పాదప్రసారణాయ చేష్టతే.

కుఠార శ్ఛేద్యతాం కుర్యా న్నఖచ్ఛేద్యం న పణ్డితః

పండితుఁ డైనవాఁడు గోటితో త్రుంపివేయఁదగినదాని
నెన్నఁడును గొడ్డలితో నఱుకవలసివచ్చు స్థితికిఁ బోనీయఁడు.

కుడ్యం వినా చిత్రకర్మేవ

గోడ లేకుండ రంగులపనివలె.

గోడయే లేనపుడు రంగుపని యెక్కడనుండివచ్చును ?

ఆకాశకుసుమమే శశవిషాణ మైనపుడు అద్దానిపరిమళ
మిట్టిట్టిదను నాలోచనమేల ?

కృతే కార్యే కిం ముహూర్తప్రశ్నేన

వలసినకార్యము ముగిసిన వెనుక ముహూర్తమడుగు
టెందులకు ?

అయిపోయిన పెండ్లికి మేళము లెందుకు అన్నట్లు.

కృతక్షౌరస్య నక్షత్రపరీక్షా

క్షౌరము చేయించుకొనిన పిదప నక్షత్రము మంచిదా, కాదా అని విచారించినట్లు.

దీనినే—ముండితశిరో నక్షత్రాన్వేషణమ్—అందురు.

"అనిశ్చిత ప్రామాణ్యస్య తు ప్రవృత్తౌ పశ్చాత్తన్నిర్ణయో భవన్నపి కృతక్షౌరస్య నక్షత్రపరీక్షావ దఫల ఏవేత్యుక్తమ్"

కృతాత్యయేఽనుశయవాన్

చేసినపని చెడిపోయినతరువాత ఈ పని నేనెందుకు చేసితినా అని పరితాపపడువానివలె.

కృత్రిమాఽకృత్రిమయోః కృత్రిమే కార్య సమ్ప్రత్యయః

కృత్రిమ మన స్వతఃసిద్ధము కానిది. అకృత్రిమమన స్వతః సిద్ధము. కృత్రిమాకృత్రిమార్థములుగల శబ్దములలో విధీయమానకార్యము కృత్రిమశబ్దమున వర్తించును గాని అకృత్రిమశబ్దమున వర్తింపదు.

"లోకే—గోపాలక మానయ, కటజక మానయేతి యస్యైషా సంజ్ఞా భవతి స ఆనీయతే న యో గాః పాలయతి యోవా కటే జాతః"

"గోపాలక మానయ, కటజక మానయ" అని నపుడు గోపాల, కటజశబ్దములు సంజ్ఞావాచకములు, పురుష వాచకములును. "గాః పాలయతీతి గోపాలః" అనువ్యుత్పత్తిచే ఆలకాపరి యనియు, "కటే జాత ఇతి కటజః" అను వ్యుత్పత్తిచే మంచముపై పుట్టినవాఁడు అనియు ఆ గో

పాలక కటజ శబ్దములు అర్థము నిచ్చును. శబ్దస్వరూప నిష్పత్తికిమాత్ర మా వ్యుత్పత్తిసిద్ధార్థములే మూలకారణములు. సంజ్ఞావాచకము లైనపుడు గోపాల కటజ శబ్దములు శ్రవణమాత్రమునన ఒకే రూఢ్యర్థమును నిరూపింపక మరియొక సందిగ్ధార్థమునుగూడ స్ఫురింపఁజేయుచున్నవి. కాన గోపాల, కటజశబ్దములు కృత్రిమములవుచున్నవి. ఇఁక, గోపాలుని, కటజుని తీసుకొని రమ్ము అనిన గోపాల, కటజ నామము గలవారలనే తీసుకొనివత్తుముగాని, శబ్దస్వతఃసిద్ధార్థము లవు ఆలకాఁపరిని, మంచముమీఁద పుట్టినవానిని తీసికొని రాము.

కేవలై ర్వచనై ర్నిర్ధనాధమర్ణిక ఇవ సాధూ౯ భ్రామయ౯

ఋణము తీర్చుకొనక మఱొకచో ఋణము గూడ పుట్టక చిక్కువడి ఋణదాతను కేవలము మాటలతో నటు నిటు త్రిప్పు ధనము లేని నిఱుపేదవలె.

పరస్పరాశ్రయదోషమును, స్వవచనవ్యాఘాతమును గమనింపక ఊరక యుక్తిపై యుక్తులుగ మాటలాడు వానియందీదృష్టాంతము ప్రవర్తించును.

క్రియా హి వికల్ప్యతే న వస్తు

ఒకవస్తువును గుఱించిన క్రియమాత్ర మనేకరకములుగ నుండవచ్చును. ఆవస్తువుమాత్రము వికల్పము నొందనేఱదు.

"కర్తు మకర్తు మన్యథా వా కర్తుం శక్యం లౌకికం వైదికంచ కర్మ । యథాశ్వేన గచ్ఛతి పద్భ్యా మన్యథావా న

వా గచ్ఛతీతి ......నతు వస్త్వేవం నైవ మస్తి నాస్తి తివా వికల్ప్యతే॥"

శాంకరభాష్యమ్.

నడిచి వెళ్ళినను, కారుపై వెళ్ళినను, బండిపై, మఱొక సాధనముపై వెళ్ళినను, తుదకు వెళ్ళకున్నను గమ్యస్థానముమాత్రము మాఱదు. గమనము మాత్రమే రూపాంతరముల నొందునది.

క్వోష్ట్రిః క్వచ నీరాజనా ?

ఎక్కడ ఒంటె; ఎక్కడ నీరాజన ?

ఒంటెకును, నీరాజనకును సంబంధ మెక్కడ? అని అర్థము. వాజినీరాజనావిధివిధమున నసందర్భపు పనులయం దీన్యాయమునకుఁ బ్రవృత్తి కలుగును.

గన్ధాశ్మరజసా స్పృష్టో నష్టో దీపః పున ర్జ్వలేత్

గంధకపురజనుతో తాకినయెడల దీపము మొట్టమొదట తగ్గి మఱల మామూలుకన్న నధికముగ వెలుగును.

సంస్కృత్యవస్థాసిద్ధమైన దుఃఖము ననుభవించి దుఃఖముక్తుడైన వాని కాదుఃఖము గంధకపురజనుతో ముట్టుకొనబడిన దీపమువలె తాత్కాలికముగ నష్టమైనను అంకురము వోక కాలమున మఱల పొడసూపును.

గిరి ముత్పాట్య మూషికోద్ధృతా

కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు.

## గృహార్థ మారోపితస్య దీపస్య రథ్యోపకారకత్వమ్

ఇంటి వెలుతురుకోసమై వాకిటఁ బెట్టఁబడిన దీపము బజారుఁబోవువారికికూడ ఉపకారము చేయును. "జామాత్రర్థం శ్రపితస్య సూపస్య అతిథ్యుపకారకత్వమ్"—అన్నట్లు.

## గృహీత్వార్థం గతా శ్చోరాః క స్తా నాచ్ఛేత్తు మర్హతి?

దొంగలు డబ్బు దోచుకొనిపోయిన పిదప వారి నెవఁడు పట్టి బంధిపఁగలఁడు; ఆధనమును వారిచేతినుండి గ్రహింపఁగలఁడు?

"నహి శుక్తికాజ్ఞానం రజతజ్ఞానస్య రజతవిషయతా మపహర్తు ముత్సహతే జాతం హి తద్రజతం విషయీకృత్య। యథాహుః —గృహీత్వార్థం గతా శ్చోరాః క స్తా నాచ్ఛేత్తు మర్హతీతి"

## గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసమ్ప్రత్యయః

గౌణ, ముఖ్యార్థములలో ముఖ్యార్థము బలీయము.

"గుణేభ్యో భవః గౌణః" గుణములు అనఁగా అవయవముల వలన—వ్యుత్పత్తిద్వారా సంభవించిన అర్థము గౌణార్థము.

లోకవ్యవహారసిద్ధమై రూఢమై యున్న అర్థము ముఖ్యార్థము.

పంకజమునకు పద్మము అనునర్థమువలె.

గ్రావ్ణి రేఖేవ

రాతిమీద రేఖలవలె.

శిలాక్షరములమాదిరి.

ఘృతస్య పాత్ర మాధారోవా పాత్రస్య ఘృత మాధారోవా?

నేతికి గిన్నె ఆధారమా, గిన్నెకు నేయి ఆధారమా? అని తర్కించి తర్కించి యొకతిక్కతార్కికుఁడు తుదకు నేతి గిన్నె బోర్లించిచూచి నాఁడఁట.

తల తోక లేని కుతర్కముల నియ్యది సూచించును.

చటకమాంసం భాగశతమ్

పిచ్చుకమాంసమును నూఱు భాగములు చేసినట్లు.

చర్మతన్త్రౌ మహిషీం హన్తి

తోలుతిత్తికోసమై బఱ్ఱెను చంపినట్లు.

చర్మము దొఱుకకపోఁగా బఱ్ఱె చచ్చినది.

నడిసముద్రములో ప్రయాణము చేయుచు లోహము కావలసి నావికుఁ డొకఁడు ఓడ బ్రద్దలుకొట్టినాఁడఁట.

చూ — వృద్ధిమిష్టవతో మూలమపి తే నష్టమ్

చిన్తామణిం పరిత్యజ్య కాచమణిగ్రహణన్యాయః

చింతామణిని వదలి గాజుముక్కను కొనినట్లు.

బంగారునాగలితో పొలము దున్ని జిల్లేడుమొక్కలు, ఆరిగలు నాటినట్లు.

నడివయసున నున్న సుందరాంగిని వదలి పశువును మోహించినట్లు.

చేతనస్య యత్నహీన స్యోర్ధ్వగతి శ్చేతనా న్తరాధీనా

చేతనుఁడయినను యత్నహీనుని ఊర్ధ్వగమనము చేతనాంతరమున నాధారపడియుండును.

"చేతనస్య యత్నహీన స్యోర్ధ్వగతి శ్చేతనాంతరాధీనేతి లౌకికన్యాయేన యత్నహీనానాం గన్తౄణాం గమయితారో௨ర్చిరాదయ శ్చేతనాః స్యురితి సూత్రయోజనయా బ్రూతే."

చోరాన్వేషణే చోర ఏవ ప్రయో క్తవ్యః

దొంగను వెతకుటకు దొంగనే నియమించవలెను.

"వజ్రం వజ్రేణ భిద్యతే; అస్త్ర మస్త్రేణ శామ్యతి" మున్నగువానివలె.

ఛిద్రే ష్వనర్థా బహూలీభవ న్తి

కష్టములలోనే కష్టములు విశేషముగా కలుగును.

ఛిన్నపుచ్ఛశ్వదృష్టాన్తః

తోక తెగిన కుక్కపోలిక.

తోక తెగిపోయినను కుక్క కుక్కే అవునుగాని వేఱొండు గాదు.

"శ్వా కర్ణేవా పుచ్ఛే వా ఛిన్నే శ్వైవ భవతి నాశ్వో న గర్దభః; న హి గో ర్గదుని జాతే విషాణే వా భగ్నే గోత్వం తిరోధీయతే; న హి కేవలభోజీ దేవదత్తోఽన్యైః సహ పంక్త్యాం భుంజానోఽన్యత్వం ప్రపద్యతే; ఏకదేశవికృత మనన్యవత్" మున్నగు చోటులం జూడుము.

జానపదన్యాయము

"అత్యన్త బలవన్తోఽపి పౌరజానపదా జనాః
దుర్బలై రపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితైః"

అను దానిని చూడుము.

జామాత్రర్థం శ్రపితస్య సూపస్యాఽతిథ్యుపకారకత్వమ్

అల్లునికొఱకు వండఁబడిన పప్పు అతిథులకుఁ గూడ నుపకరించునట్లు.

"దేహలీదీప, గృహార్థ మారోపితస్య దీపస్య రథ్యోపకారకత్వ" న్యాయములను జూడుము.

జ్ఞాన మజ్ఞానస్యైవ నివర్తకమ్

జ్ఞాన మజ్ఞానమును నివర్తింపఁ జేయును.

గాలిలోని దీపమువలె, చమురు ఇగిరిపోయిన తరువాత దీపమువలె, జ్ఞానోదయమైన వెనువెంటనె అజ్ఞానము తనంతన తా నివర్తించును.

జ్వరహరతక్షకచూడారత్నాలఙ్కారోపదేశవత్

జ్వరముతో బాధపడువానికి తక్షకుని నెత్తిపైనున్న మణిని తీసికొనివచ్చిన జ్వరము తగ్గిపోవునని వచించినట్లు.

తక్షకుని శిరముపై నున్న మణిని తీసికొనివచ్చుట అసంభవము. అట్టి అసంభవమైన వచనమును నుడువుట కాకదంత పరీక్షవలె నిరర్థకమగును. కావున అసంభవార్థమై నిరర్థకమైన వాక్యప్రయోగము గల తావుల నీన్యాయ మవతరించును.

తత్స్థానాపన్నే తద్ధర్మలాభః

ఏస్థానమును పొందినపుడు ఆస్థానమునకు సంబంధించిన ధర్మములు వానికిఁ జెందును.

"స్థానివ దాదేశః = తత్స్థానస్థితవర్ణమువలెనే ఆదేశము వచ్చును" అను పాణినిసూత్రము ననుసరించి యీ న్యాయము ప్రవృత్తమైనది.

ఉపాధ్యాయునిశిష్యుఁడు యాజ్యకులమున కరిగి ఉపాధ్యాయునికిఁ దగిన అగ్రాసనాధిపత్యమును తాను పొందునట్లు.

తదభిన్నాభిన్నస్య తదభిన్నత్వమ్

ఒకవస్తువుకంటె భిన్నముకాని వస్తువునకు విరుద్ధముకాక అభిన్నపదార్థము మొదటివస్తువుకంటె అభిన్నమే అవును.

తపనీయ మపనీయ వాససి గ్రన్థికర్తార ముపహససి స్వయం చ కనక ముపాదాయ గగనాఞ్చలే గ్రన్థిం కరోషి

తనదగ్గఱనున్న బంగారమును పోగొట్టుకొని వట్టి గుడ్డను ముడివైచుచున్నవానిం జూచి పరిహాసింతు వేల? నీ తెలివేమి మండినది? దగ్గఱ నున్న బంగారమును ఆకాశపు కొంగున మూటగట్టుచున్నావే!

తప్తం తప్తేన సమ్బధ్యతే

కాల్చఁబడిన యినుము కాల్చఁబడిన యినుముతో కలుసుకొనిపోవును.

"సాధారణోఽయ ముభయోః ప్రణయః స్మరస్య
తప్తేన తప్త మయసా ఘటనాయ యోగ్యమ్"

విక్రమోర్వశీయమ్

తప్తాయఃపీతామ్బువత్

కాల్చిన యినుముచే త్రాగఁబడిన నీరువలె.

"సంతప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న జ్ఞాయతే"
తప్తాయఃపిండమునఁ బోయఁబడిన నీరు ఊరు పేరు లేకుండ నశించును.

అట్లే — నామరూపాదులు లేకుండ వస్తునాశనము కలుగునపుడీ న్యాయ ముపయోగింపఁబడును.

"న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" అనఁగా నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారముగల మహనీయుని ప్రాణములు సర్వమాన

వృలప్రాణములవలె నూర్ధ్వగమనము నొందక ప్రత్యగ్బ్ర హ్మయందు తప్తాయఃపీతాంబువులవలె లీనము లవును.

జీవన్ముక్తుని దేహత్యాగసమయమున ప్రాణాఖ్యమైన లింగశరీరము తప్తాయఃపీతాంబువులవలె ప్రత్యగభిన్న పరమానందస్వరూపుఁడవు పరబ్రహ్మమందు లీనమవును.

తరతమభావాపన్నసాధనాయత్తం ఫలం తరతమభావాపన్నమ్

తరతమ భావములతో నున్న సాధనములయం దాయత్తమైన ఫలము తరతమభావము నొందియే యుండును.

ఎట్టి సాధనములతో సాధించినఁ దత్ఫలము నయితము తద నుకూలముగనే యుండును.

తస్కరస్య పురస్తాత్కక్షే సువర్ణ ముపేత్య సర్వాఙ్గోద్ఘాటనమ్

దొంగవానిచంకలో (దొంగిలింపఁబడిన) బంగారము ఎదురుగ కనుపడుచుండగా అచట మాని తక్కిన అవయవము లన్నియు పరీక్షించినట్లు.

తాతస్య కూపోఽయ మితి బ్రువాణాః క్షారం జలం కాపురుషా పిబన్తి

మా తాత త్రవ్వించిన బావి యిది అని తెలివితక్కువవారు ఆబావిలోని ఉప్పునీరే త్రాగుచుందురు.

తీర్థకాకన్యాయము

"యథా తీర్థే కాకా న చిరం స్థాతారో భవన్త్యేవం యో గురుకులాని గత్వా న చిరం తిష్ఠతి స ఉచ్యతే తీర్థకాక ఇతి."

తీర్థమున కాకి నిలుకడ లేక వెంటనే వేఱొక తావున కరుగును. అట్లే గురుకులమున కేఁగి నిలుకడ లేక వెంటనే స్వగృహమునకు తిరిగివచ్చునాతనికి "తీర్థకాక" దృష్టాంతము నుడువఁబడును.

అవతప్తే నకులస్థిత న్యాయము వలె.

తైలకలుషితశాలిబీజా దఙ్కురానుదయనియమః

నూనెలో నానిన వడ్లగింజనుండి మొలకెత్తుటసంభవము. పైపై లక్షణము లన్నియు నున్నను పుంస్త్వహీనులవు షండాదులవలన సంతానోత్పత్తి కానేఱదనుట లోక ప్రసిద్ధము.

త్యజే దేకం కులస్యార్థే

ఒకదుష్టునివలన కులమున కంతకుచు కళంక మాపాదింప నున్నప్పుడు కులమును రక్షించుకొనుటకై ఆయొకనిని త్యజించివైచుట లెస్స.

"త్యజే దేకం కులస్యార్థే, గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే, ఆత్మార్థే పృథివీం త్యజేత్."

అను శ్లోకమునుండి యీ వాక్యము గ్రహింపఁబడినది.

పై శ్లోకము వ్యాఖ్యాతలనీతిశాస్త్రమున నిట్లు తెనిగింపఁ బడియున్నది.

తే. ఉర్వి వంగడమునకయి యొక్కనరుని;
గొటికలెస్సకుఁ జెచ్చెరఁ గొలమునెల్ల;

రాష్ట్రసౌఖ్యంబు వాంఛించి గ్రామ మెల్ల;
ధర్మవు న్నిల్ప పీడనౌ ధరణియెల్ల."

బ్రహ్మసూత్రభాష్యమున పై న్యాయ మిట్లు ప్రయోగింపఁ బడియున్నది. చూడుడు—

"త్యజే దేకం కులస్యార్థ ఇతి న్యాయా ద్భూయసీనాం బ్రహ్మలింగశ్రుతీనా మనుగ్రహా యాకాశశ్రుతే రేకస్యా బాధ ఇత్యాహ."

దత్త మేకథా సహస్రగుణ ముపలభతే

ఒకవు డొకమారీయఁబడినది ఉత్తరత్ర వేయిమడుంగులుగా పొందఁబడును.

పర్వసమయమున క్షేత్రాదులయం దొకమారీయఁబడిన దానాదికము ఉత్తరజన్మమున వేయిమడుంగు లధికముగ ఫల మీనోపునని పురాణవచనప్రసిద్ధి.

దత్తార్ణాధమర్ణ ఇవ స్వప్

ఇచ్చివేయఁబడిన ఋణముగల ఋణగ్రస్తునివలె నిద్రించుట.

తనవనితయొక్క దౌఃశీల్య చింతం బాసి యొకఁడు దత్తార్ణాధమర్ణుని తెఱఁగున సుఖనిద్రం జెందెను.

దధిత్రపుసం ప్రత్యక్షో జ్వరః

సీసపుగిన్నెలోని పెరుగు సాక్షాత్తు జ్వరమే.

జ్వరకారణ మగునని భావము.

"అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థో గమ్యతే; ఆయుర్ఘృతమ్, లాంగలం జీవనమ్" మున్నగువాని జూడుము.

దర్దురా యత్ర వక్తార స్తత్ర మౌనం హి శోభనమ్

కప్పలు వక్తలుగా నున్నతావున మాట్లాడక మౌనము వహించుటయే సేమము.

దవదాహస్య వేత్రబీజనాశకత్వం, రూపాన్తరజనకత్వంచ

దావాగ్ని పేముచెట్లపైఁ బడి వాని బీజములను నశింపఁజేసి ఆ పేముచెట్లకు రూపాంతరము కలిగించును.

దవాగ్నిదగ్ధములయిన వేత్రములనుండి రంభాంకురములు పుట్టునని లోకప్రసిద్ధి.

అట్లే — దోషములు యథార్థజ్ఞానమును నశింపఁజేసి, అయథార్థజ్ఞానమును జనింపఁజేయును.

దూరస్థాః పర్వతా రమ్యాః సమీపస్థా స్తు బర్బరాః

దూరపుకొండలు నునుపు; దగ్గఱకుబోయిన చెట్లులు, పుట్టలును.

దూరగిరిన్యాయమును జూడుము.

దేశకాలవయోవస్థాబుద్ధిశక్త్యనురూపతః

ధర్మోపదేశో భైషజ్యం వక్తవ్యం ధర్మపారగైః.

ధర్మమును, వైద్యమును దేశ, కాల, వయోఽవస్థా, బుద్ధి, శక్తుల కనురూపముగ చెప్పవలయును.

ద్విర్బద్ధం సుబద్ధం భవతి

రెండుసారులు కట్టఁబడినది బాగుగ గట్టిగా కట్టఁబడిన దవును.

ధనక్షయే వర్ధతి జాఠరాగ్నిః

ధనము తఱిగినపుడు ఆఁకలిబాధ యెక్కువగును.

దరిద్రునికి ఆఁక లెక్కువ అని తెనుఁగుసామెత.

న ఖలు శాలగ్రామే కిరాతశతసఙ్కీర్ణే ప్రతివసన్నపి బ్రాహ్మణః కిరాతో న భవతి

కిరాతశతసంకీర్ణమైన శాలిగ్రామమను పేరుగల పల్లెలో నివసించుచున్నను బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడే యవును గాని కిరాతుఁడు కాఁజాలఁడు.

న చ ప్రయోజన మన్తరా చాణక్యః స్వప్నేపి చేష్టతే

ఉపయోగము లేనిదే ఎవఁడును కలలోనైన నెట్టిపనికిని బ్రయత్నింపఁడు.

"లాభము లేని శెట్టి వఱదన పోవునా" అన్నట్లు.

న చ సర్వత్ర తుల్యత్వం స్యాత్ప్రయోజకకర్మణామ్

ప్రయోజకక్రియలన్నియు నొకేవిధముగ నెన్నఁడు నుండవు.

సేనాపతి మాటలచే భృత్యులను నియోగించును; యోధుఁడు శత్రుకృంతనమునకై చలనముతో శస్త్ర ప్రయోగము చేయును; రాజు దగ్గఱనుండియే అందఱను

యుద్ధకర్మయందు నియోగించును. ఈతీరున అందఱి అభి ప్రాయము యుద్ధమందు విజయమేయైనను ఒకరొకరి పని యొక్కొక్కరకముగ నుండును.

నడ్వలోదకం పాదరోగః

ఒకరకమైన గడ్డి మొలచిన నీరు పాదరోగము.

పాదరోగకారణ మని భావము.

దధిత్రపుసం ప్రత్యక్షో జ్వరః; ఆయు ర్ఘృతమ్; లాంగలం జీవనమ్ మున్నగువానిని జూడుము.

న దాహజ్వరను త్త్యర్థ మగ్నినా స్వా ద్భిషక్క్రియా

దాహజ్వరమును పోఁగొట్టుటకు అగ్నితో వైద్యము కావింపఁబడునా? (చేయఁబడదు.)

న యద్గిరిశృంగ మారుహ్య గృహ్యతే తదప్రత్యక్షమ్

గిరిశృంగము నధిరోహించి గమనింపఁబడిన వస్తువు ప్రత్య క్షము గాకపోదు.

అనగా పెద్దమెట్టెక్కిన వానికి అడుగుననున్న యంశములు అప్రయత్నముగనే తెలియవచ్చును అని భావము. వ్యాకరణశాస్త్రపండితునకు విన్నంతమాత్రమునన శబ్ద సాధుత్వాసాధుత్వములు తెలియవచ్చునటులు.

న హి కఠోరకణ్ఠీరవస్య కురఙ్గశాబః ప్రతిభటో భవతి

భయంకరమైన సింహము నెదిరి లేడిపిల్ల పోరాడఁగలదా? "నాల్పీయసాం మహాతోఽభిభవః సంభవతి"ని జూడుము.

న హి కరకఙ్కణదర్శనాయాదర్శాపేక్షా

చేతికంకణమును జూచుకొనుట కద్దముకావలెనా ?

న హి కళ్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి

మంచిపని చేయువాఁ డెవఁడును అధోగతి నొందఁడు.

న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్

ఏదో యొక పని చేయకుండ ఎవ్వఁడును క్షణమైన నుండఁడు.

న హి కాకిన్యాం నష్టాయాం తదన్వేషణం కార్షాపణేన క్రియతే

కానీ పోయిన యెడల రూపాయి ఖర్చు చేసి దానిని వెత కుదురా ?

"దమ్మిడీముండకు ఏగాని క్షౌరమా?" అన్నట్లు.

న హి కేవలభోజీ దేవదత్తోఽన్యైః సహ పంక్త్యాం భుంజానో ఽన్యత్వం ప్రపద్యతే

ఒంటరిగ భుజించు దేవదత్తుఁ డితరులతో కలిసి పంక్తి యందుఁ గూర్చుండి భుజించుచున్నను దేవదత్తుఁడే అవును గాని, దేవదత్తాన్యత్వము నొందనేఱఁడు.

"ఏకదేశవికృత మనన్యవత్; ఛిన్నపుచ్ఛశ్వదృష్టాన్తః; న హి గో ర్గఢుని జాతే విషాణేవా భగ్నే గోత్వం తిరోధీయతే; శ్వా కర్ణే పుచ్ఛేవా ఛిన్నే శ్వైవ భవతి నాశ్వో న గర్దభః" మన్నగువానిని జూడుము.

న హి కృత ముపకారం సాధవో విస్మరంతి

,సత్పురుషులు చేసిన ఉపకారమును మఱువరు.

న హి క్వచి దశ్రవణ మన్యత్ర శ్రుతం నివారయితు ముత్సహతే

ఒకచో వినఁబడనిది మఱొకచో వినఁబడిన యంశమును నివారింప నుత్సహింపదుగదా ?

కొన్ని స్థలములయందు ప్రాణోత్పత్తి వినఁబడుటలేదు. అయినను ప్రదేశాంతరములయందు శ్రుత మవుటవలన నయ్యది అయుక్తమే అవుచున్నది.

(బ్రహ్మసూత్రభాష్యము)

న హి ఖదిరగోచరే పరశౌ పలాశే ద్వైధీభావో భవతి

చండ్రచెట్టును నఱికివేయఁగల గండ్రగొడ్డలి మోదుగచెట్టును నఱుకఁబోవ రెండు తునుఁక లవునా ?

న హి గోధా సర్పన్తీ సర్పణా దహి ర్భవతి

బల్లి ప్రాఁకుచున్నను, ప్రాఁకినంతమాత్రమున పా మగునా?
"న ఖల్వప్యన్యత్ప్రకృత మనువర్తనా దన్య ద్భవతి న హి గోధా సర్పన్తీ సర్పణా దహి ర్భవతి"

మహాభాష్యమ్

న హి గో గణ్డుని జాతే విషాణే వా భగ్నే గోత్వం తిరోధీయతే

కణితి పుట్టినను లేక కొమ్ములుపోయి బోడిదయినను గోవుకు గోత్వము పోదు. (అది గోవే అగును.)

"ఏకదేశవికృత మనన్యవత్; ఛిన్నపుచ్ఛశ్వదృష్టాన్తః; నహి కేవలభోజీ దేవదత్తోఽన్యైఃసహ పంక్త్యాంభుంజానోఽన్యత్వం ప్రపద్యతే; శ్వాకర్ణేవా పుచ్ఛేవా ఛిన్నే శ్వైవ భవతి నాశ్వో నగర్దభః" ఇత్యాదులఁ జూడుము.

న హి గ్రామస్థః కదా గ్రామం ప్రాప్నుయా మి త్యరణ్యస్థ ఇవా శాస్తే

గ్రామములో నున్నవాఁడు అరణ్యములో నున్నవానివలె ఎన్నఁడు గ్రామమును జేరుదునా అని కోరుచుండఁడు.

న హి త్రిపుత్రో ద్విపుత్ర ఇతి కథ్యతే

ముగ్గురు కుమారులు గలవాఁడు ఇరువురు కుమారులు గలవాఁడుగా నుడువఁబడఁడు.

"ఛాదేర్ఘేఽద్వ్యుపసర్గస్య 6-4-96" అను పాణినిసూత్రమున పై న్యాయము ననుసరించి "అద్విప్రభృత్యుపసర్గస్య" అని వ్యాఖ్యానము కావింపఁబడినది.

న హి దీపౌ పరస్పర ముపకురుతః

రెండు దీపములు పరస్పర ముపకారకరములు కావు. వెలుతురు నిచ్చుటకు ఒకదీపమునకు మఱొకదీపపు టవసరమే- శూన్యము.

న హి దృష్టేఽనుపపన్నమ్

కంటికి కనఁబడుచున్నదాని విషయమై ఉన్నది లేదు అని ప్రమాణ వాక్యములు, వాదనలు నెందులకు ?

"న హి కరకంకణదర్శనాయాదర్శాపేక్షా" అను దానిం జూడుము.

న హి ధీమతాం కశ్చి దవిషయో నామ

బుద్ధిమంతుల బుద్ధికి గోచరముకాని యంశమే లేదు.

న హి నారికేలద్వీపవాసినోఽప్రసిద్ధగోశ్రవణా త్కకుదాదిమదర్థ ప్రతిపత్తి ర్భవతి

ఎచటనో నారికేలద్వీపమున అప్రసిద్ధమైన నొక యెద్దు కలదని వినినపుడు దానికి మూపురము, గంగడోలు యింతింత యున్నవి; యింత అందముగ నున్నవి అను విచారణయే యుండదు.

నారికేల ద్వీపమున గోజాతియే లేదు అట్టివానిం గూర్చి "అఁట, అఁట" అని చివరచేర్చుచు వృథాలోచన మొనరింపఁబడదు.

న హి నిన్దా నిన్ద్యం నిన్దితుం ప్రయుజ్యతే కిం తర్హి నిన్దితా దితర త్ప్రశంసితుమ్?

నింద నింద్యమైనదానిని నిందించుటకు మాత్రమే ప్రవర్తింపదు; అనింద్యమై ప్రకృతనిందితేతరమవు వస్తువును ప్రశంసించుటకుఁగూడ నుపకరించును.

నింద్యమును నిందించుట లోకస్వభావమే. కాని, ఆనింద యొక్కొకచో నిందింపఁదగని వస్తువులయందు నింద సూచించుచు అభిమతార్థశ్రేష్ఠప్రతిపాదనకుఁగూడ ఉపయోగింపఁబడును.

'వేదములన్నిటియందు సామవేదము: పురాణములలో భారతము శ్రేష్ఠములు' అనినప్పుడు సామేతర వేదములు, భారతేతర పురాణములు నింద్యములు కావు. కాని, పై వాక్యము ననుసరించి సామభారత శ్రైష్ఠ్యప్రకటనమునకై వానియందించుక కించుదన మాపాదింపబడినది.

న హి పద్భ్యాం పలాయితుం పారయమాణో జానుభ్యాం రంహితు మర్హతి

పాదములతో వడిగఁ బరుగెత్తిపోఁగలవాఁడు జానువులతో దేకులాడుచు పోవ యత్నించునా ?

"తస్మా త్కర్మైవ శీలోపలక్షిత మనుశయభూతం యోన్యాపత్తౌ కారణ మితి కార్ష్ణాజినే ర్మతమ్। న హి కర్మణి సంభవతి శీలా ద్యోన్యాపత్తి ర్యుక్తా। న హి పద్భ్యాం పలాయితుం పారయమాణో జానుభ్యాం రంహితు మర్హతి"

శాంకరబ్రహ్మసూత్రభాష్యమ్ 3-1-10.

న హి పంగో ర్విష్ణుక్రమాద్యుపేతే కర్మ ణ్యధికారః

ప్రదక్షిణప్రక్రమాదిసహితమయిన కర్మమున కుంటివాని కధికారము లేదు.

చూడుము—నహ్యశ్రద్ధస్యాజ్యావేక్షణోపేతే కర్మ ణ్యధికారోఽస్తి.

న హి పూతం స్యాద్గోక్షీరం శ్వదృతౌ ధృతమ్

కల్లుకుండలో పోసిన ఆవుపాలు పవిత్రమవునా ?

"శ్వదృతినిక్షిప్తగోక్షీరవ దనుపయోగ్యమ్"

న హి పూర్వజో మూఢ ఆసీ దిత్యాత్మనోపి మూఢేనైవ భవితవ్య మితి కించి దస్తి ప్రమాణమ్

"యేనాఽస్య పితరో యాతా యేనయాతాః పితామహాః
తేన యాయా త్సతాం మార్గం తేన గచ్ఛన్ న రిష్యతే."

తనపితృపితామహు లేయే మార్గముల నేయేరీతి ననుసరించి యెట్లుండిరో ఆమార్గముల నట్లే వర్తించు మనుజుఁడు క్షేమము నొందును. అట్లే నడువవలయునుగూడ అనుమనుస్మృతిశ్లోకమున కపార్థము కల్పించి దయానందుని పూర్వపక్షమువలె—నాపూర్వుడొకఁడు మూఢుడై యుండెను గాన నేనుగూడ మూఢుఁడనే యై యుండవలెనను ప్రమాణ మెంతయును లేదు.

న హి ప్రతిజ్ఞామాత్రేణార్థసిద్ధిః

ప్రతిజ్ఞ చేసినంతమాత్రమున కార్యము నెఱవేఱదు.
"ఏకాకినీ ప్రతిజ్ఞా హి ప్రతిజ్ఞాతం న సాధయేత్"ను చూడుము.

న హి ప్రత్యక్షవిరుద్ధం శాస్త్రసహస్రేణాపి బోద్ధుం శక్యమ్

కంటి కగపడని విషయమును వేయిశాస్త్రములచే నైనను బోధించుట శక్యముగాదు.

న హి ప్రమాణం జంతూనా ముత్తరక్షణజీవనే

మఱుక్షణమందు జీవములు జీవించియుండఁగలవని ప్రమాణ మెంతయును లేదు.

"జాతస్య మరణం ధ్రువమ్" అని ఆచార్యోక్తి.

న హి ప్రియం ప్రవక్తు మిచ్ఛన్తి మృషా హితైషిణః

హితమునుగోరువారు వ్యర్థముగా ప్రియములైన అబద్ధపు మాటలాడరు.

న హి భవతి కుణ్డం బదరమ్

వంటకుండ అగ్నికుండము కాఁజాలదు.

కుండయందే అన్నము వండఁబడుచున్నను దానికి తగువేడి నిచ్చునది పొయ్యి, దాలి, కుంపటి మున్నగు నగ్నికుండము. పదార్థ మగ్నియందుఁ బడిపోకుండ సాధనమే గాని కుండ కావేడినిచ్చు సామర్థ్యము లేదు.

న హి భవతి తరక్షుః ప్రతిపక్షో హరిణశాబకస్య

పెద్దపులి లేడిపిల్లతో నెదిరి పోరాడ నుద్యమించదు. తుల్యబలులు పరస్పరము ప్రతిపక్షులై పోరాడుదురుగాని దుర్బలోత్తమబలు లట్లుగాదు.

న హి భిక్షుకాః సన్తీతి స్థాల్యో నాధిశ్రీయన్తే? న చ మృగాః సన్తీతి యవా నోప్యన్తే?

బిచ్చగాండ్రున్నారని వంటచేసికొనుట; మృగము లున్న వని పైరువేయుట మానుదురా?

"భిక్షుకభియాస్థాల్యనధిశ్రయణ; మృగభియా సస్యానాశ్రయణ; మత్కుణభియా కంథానధిశ్రయణ" న్యాయములను జూడుము.

న హి భిక్షుకో భిక్షుకాన్తరం యాచితు మర్హతి స త్యన్యస్మి న్నభిక్షుకే

భిక్షుకుఁడు కాని ధనవంతుఁడు ప్రక్కనుండఁగా భిక్షుకుఁడు భిక్షుకుని యాచించఁడు. (ధనవంతుని యాచించును.)

న హి భూమా వంభోరుహం సదితి దుష్టాక్షస్యాపి నభసి తదవ భాసతే

నేలపై నున్న తామరకమలము కంటిజబ్బుగలవానికి ఆకాశముమీఁద నున్నట్లు కనుపించునుగాక, అది నేలపైననే యుండును.

న హి మరుమరీచికాసరోమ్భః క్రమశః శుష్యతి

ఎండమావులనుసరసులోనినీరు క్రమక్రమముగ నింకిపోదు. ఎండ పోయిన మఱునిముసముననే అంతయు మాయమవును.

న హి మోహయతి ప్రాజ్ఞం లక్ష్మీ ర్మరుమరీచికా

ఎండమావివంటి లక్ష్మి ప్రాజ్ఞులను మోహపెట్టనేఱదు.

న హి య ద్దేవదత్తస్య యుధ్యమానస్య స్థాన మవగతం తదేవ భుంజానస్యాఽపి భవతి

దేవదత్తుఁడు యుద్ధము చేయుచుండఁగా తెలిసికొనఁబడిన వాని స్థానమే ఆతఁడు భుజించుచుండు నపుడును గాదు. దేవదత్తుఁడు యుద్ధము చేయుచుండునపు డుండుస్థానము వేఱు; భుజించునప్పటి స్థానము వేఱు; మఱొక పని చేయు

నప్పటి తావు, మఱొకటి. అట్లే—కార్యాంతరములను బట్టి స్థానములును మాఱుచుండును. అన్ని వేళల నొకే స్థానముండదు. కాని, దేవదత్తుఁడుమాత్రము వేఱుకాఁడు. కావున—

"కార్యప్రయుక్తా హి స్థానవిశేషాదయో న స్వరూపప్రయుక్తాః"

స్థానవిశేషాదులు కార్యములం బట్టి సంభవించునవే కాని స్వరూపమునుబట్టి సంభవించునవి కావు.

న హి వటాంకురః కుటజబీజా జ్జాయతే

గిరిమల్లెవిత్తనమునుండి మఱ్ఱిమొక్క పుట్టదు.

"అన్య దుప్తం జాత మన్య దిత్యేత న్నోపపద్యతే,
ఉప్యతే యద్ధి యద్బీజం తత్తదేవ ప్రరోహతి."

ఏవిత్తనమున కాచెట్టు.

"న హి శ్యామాకబీజం పరికర్మసహస్రేణాఽపి కలమాంకురాయ కల్పతే" అనుదానిం జూడుము.

న హి వరఘాతాయ కన్యోద్వాహః

కన్య నిచ్చి పెండ్లిచేయుట వరుని చంపుటకొఱకుఁగాదు. విషపూరితమైన కన్య వరింపఁబడి వరునికి హాని సంభవించునెడల నీన్యాయము ప్రవర్తించును.

అనిష్టాన్తరావాప్తి సూచితమవుచున్న యెడల నిష్టవస్తువును సయితము త్యజింపవలయునేగాని దానిని కోరఁగూడదని న్యాయాశయము.

"న హి వరఘాతాయ కన్యా ముద్వాహయతి" "న హి వరఘాతాయ కన్యావరణమ్" అనియు నీన్యాయము అచటచట ప్రయోగింపఁబడియున్నది.

న హి విధిశతేనాపి తథా పురుషః ప్రవర్తతే యథా లోభేన

లోభముచేఁ బ్రవర్తించినట్టులు పూరుషుఁడు మఱి నూఱు రకముల విధులచేనైన నట్టి ప్రవృత్తికిఁ గడంగఁడు.

"ఋత్విక్కులకు దక్షిణ యీయవలయును" అనిన తాను ఋత్విక్కుల కీయవలయునని యే ఆవాక్యమున కర్థముగాని వారలనుండి తాను గ్రహింపవలెనని కాదు. ఒకవేళ నట్టి అర్థము గ్రహించినను వెంటనే అధిక్షేపింపవచ్చును. కాని ఒకఁడు ఋత్విక్కుల కిచ్చుట మాని తానే వారినుండి గ్రహించెనఁట. దానికి కారణము కేవలము లోభము. లోభమువలన నెట్టి నీచకార్యములలోనైనఁ బ్రవర్తింప వీలవునుగాని మఱి యేవిధియు నట్టి ప్రవర్తనకు పురికొల్పదు.

న హి వివాహానన్తరం వరపరీక్షా

పెండ్లి అయినతరువాతవరపరీక్ష చేయుదురా? (అట్లుచేసిన ప్రయోజనము ?)

న హి శ్యామాకబీజం పరికర్మసహస్రేణాపి కలమాంకురాయకల్పతే

శ్యామాకములు అన చామలు అను నొకరకపు ధాన్యము. ఎన్నియో వేలరకముల సాధనములు చేసినను చామవిత్తనములనుండి చామమొలకలే బయలుదేరునుగాని వరిపైరు మొలవదు.

"న హి వటాంకురః కుటజబీజా జ్జాయతే" అను దానిం జూడుము.

న హి సర్వః సర్వం జానాతి

ప్రతివాఁడు సర్వము నెఱుంగఁడు.

"యావ త్తైలం తావ ద్వ్యాఖ్యానమ్; యావత్స్నాతా తావ త్పుణ్యమ్" అన్నట్లు—స్నానముచేయువార లున్నకొలఁది పుణ్యనద్యాదులు పుణ్యము నిచ్చుచుండునటులే తఱచి తఱచి వ్యాఖ్యానము చేయుచున్నకొలఁది నూతనాంశములు పొడకట్టుచునే యుండును. ఇంకను కొన్ని వానిలో మిగిలియేయుండును. లేనపుడు పొడకట్టుటయే అసంభవము. కావున నింకను నంశములుమిగిలియుండు నపుడు తన శక్తికిఁ దగినట్లు తెలిసికొనినవాఁడు సర్వజ్ఞుఁడే కాఁడు.

న హి సహస్రేణాప్యన్ధైః పాటచ్చరేభ్యో గృహం రక్ష్యతే

వేయిమంది యైనను గ్రుడ్డివారు దొంగలబారినుండి గృహము రక్షింపఁజాలరు.

న హి సామాన్యవాచీ శబ్దో విశేషా నభివదతి

సామాన్యవాచక మైన శబ్దము విశేషములను నుడువ జాలదు.

"సామాన్యవిధి రస్పష్టః" అనుదానిం జూడుము.

న హి సార్వభౌమానంద మనుభవన్ రాజా గ్రామాధిపతిసుఖం తుచ్ఛ మపేక్షతే

సార్వభౌమానందసుఖ మనుభవించు రాజు తుచ్ఛమైన గ్రామమునసబుపదవి నపేక్షించునా ?

"........................

మృదులపాకము దిను మీవంటినరుల
కరయఁ బూరి దినంగ నదుకునే కోర్కి ?

యురుయాగములలోన నొగిఁ బురోడాశ
ముల మెక్కు నిర్జరుల్ భూలోకజనుల
కలమాన్న ముం దినఁ గాంక్ష సేయుదురె ?

కనకాసనముపైని గాంక్షఁ గూర్చుండు
జననాథుఁ డవనిపైఁ జదికిలంబడునె ?

మెత్తని మెత్తపై మిత్రుల మోదమున
నత్తమిల్లెడువార లస లున్న చోటఁ
జివురాకుబోంట్లతోఁ జెలఁగి యేరైనఁ
బవళింప మనమున వాంఛ సేయుదురె? "

వ్యాఖ్యాతల "కవుఁగిలి" నుండి.

న హి సుఖప్రతీతి ర్వినా దుఃఖైః

దుఃఖములు లేనిదే సుఖప్రతీతి కానేరదు.

న హి సుతీక్ష్ణాప్యసిధారా స్వయం ఛేత్తు మాహితవ్యాపారా

చాల పదును గలదైనను కత్తిఅంచు తనను దాను ఖండింప నేరదు.

చూడుము—అంగుల్యగ్రం న తేనైవాంగుల్యగ్రేణ స్పృశ్యతే.

న హి సుశిక్షితోపి నటవటుః స్వస్కన్ధ మధిరోఢుం పటుః

ఎంత కట్టు దిట్టముగ నేర్పినను నాట్యము నేర్చుకొను కుఱ్ఱవాఁడు తనబుజము తా నెక్క నేరఁడు.

"న హి పటుతరోఽపి నటవటుః స్వస్కన్ధ మధిరుహ్య నరీనర్తి" అనియు, "న హి నటః శిక్షితః సన్ స్వస్కంధ మధిరోక్ష్యతి" అనియు ననేకవిధముల నీన్యాయము గ్రంథాంతరములం దుపయోగింపఁబడి యున్నది.

న హి సోపానత్కే పాదే పునరపి సోపానహ ముపాదత్తే

చెప్పులు తొడిగియున్న కాలికే మఱల చెప్పులు తొడగరు.

న హి స్వతోఽసతీ శక్తిః కర్తు మన్యేన శక్యతే

ఒకవస్తువునకు స్వాభావికముగ తనవలన కలుగని యొక విశిష్టధర్మము, అన్యవస్తు సాధర్మ్యమువలనఁ గూడ గలుగ నేరదు.

న హి స్వల్పో దోషోఽమితగుణబాధకః

ఈషద్దోషము గుణబాహుల్యమును బాధింపదు.

"ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"
కుమారసంభవము.

న హ్యన్ధస్యాజ్యావేక్షణోపేతే కర్మ ణ్యధికారోఽస్తి

ఆజ్యహోమాదులతోఁ గూడిన కర్మమున గ్రుడ్డివాని కధికారము లేదు.

చూడుము—న హి పంగో ర్విష్ణు క్రమాద్యుపేతే కర్మ ణ్యధి కారః.

న హ్యన్యస్య వితథభావేఽన్యస్య వైతథ్యం భవతి

ఒకటి వ్యర్థమైనపుడు మఱొకటియు వ్యర్థము కాదు.

"న హి దేవదత్తస్య శ్యామత్వే యజ్ఞదత్తస్యాఽపి శ్యామత్వం భవతి"

దేవదత్తుఁడు నల్లనివాఁడు అనిన యజ్ఞదత్తుఁడు సయితము నల్లనివాఁడే కావలయు నను నియమము లేదుకదా!

న హ్యప్రాప్యః ప్రదీపః ప్రకాశ్యం ప్రకాశయతి

అలభ్యమైన దీపము ప్రకాశ్యవస్తువును ప్రకాశింపఁ జేయ నేఱదు.

దీపమే లేనపుడు వెలుతు రిచ్చు టెక్కడ ?

ఉదా—దాహ్యవస్తువును పొందక అగ్నిమాత్రము దహింపనేఱను. (కట్టె లంటించిననేకదా అగ్నిహోత్రము మండుట.) అశ్లో—

"అప్రాప్యైవ ప్రదీపేన యది వా నిహతం తమః,
ఇహస్థః సర్వలోకస్థం స తమో నిహనిష్యతి."

న హ్యేష స్థాణో రపరాధో య దేన మంధో న పశ్యతి

గ్రుడ్డివాఁడు తన కెదురుగ నున్న స్తంభమును చూడఁ జాలక మొగము కొట్టుకొనిన నది ఆ స్తంభముయొక్క తప్పిదమా ?

అజ్ఞానాంధులై పరమేశ్వరుని గుఱుతింపకున్న నయ్యది పరమేశ్వరునిలోపమా ? ఈశ్వరప్రతిపాదక ప్రమాణ వాక్యములపై నప్రామాణ్యబుద్ధిం బలు పోకలు పోయి భ్రష్టులవు వారిదికాని.

నాగృహీతే విశేషణే విశిష్టబుద్ధి రుదేతి

విశేషణము గ్రహింపఁబడనియెడల విశిష్ట (విశేష్య) బుద్ధి ఉదయింపదు.

దీనిని—"అగృహీతవిశేషణా విశిష్టబుద్ధి ర్న దృష్టా; నాగృహీతవిశేషణా విశిష్టబుద్ధిః; నాగృహీతవిశేషణా విశేష్యబుద్ధిః; నాజ్ఞాతవిశేషణా విశిష్టబుద్ధి ర్విశేష్యం సంక్రామతి; నాగృహీతవిశేషణన్యాయః" ఇత్యాద్యనేక రీతుల వ్యవహరింతురు.

నాదత్త ముపతిష్ఠతి

ఈయనిది రాదు.

"పెట్టి పుట్టలేదు" "పెట్టినమ్మకు పెట్టినంత" అని తెనుఁగు సామెతలు.

నాన్యదృష్టం స్మరత్యన్యః

ఒకఁడు చూచిన మఱొకఁడు జ్ఞాపక ముంచుకొనఁడు. ఒకేవస్తువును జూచువాఁ డొకఁడును స్మరించువాఁ డింకొకఁడు గాఁడు.

నారికేలద్వీపవాసినా మపక్వాన్నేనైవ దేహధారణమ్

నారికేలద్వీపములో నున్నవారు అపక్వాన్నమును దినియే దేహధారణ మొనర్తురు.

చూడుము—"న హి నారికేలద్వీపవాసినోఽప్రసిద్ధగో శ్రవణాత్కకుదాదిమదర్థప్రతిపత్తి ర్భవతి."

నాల్పీయసా మహతోఽభిభవః సంభవతి

అల్పునివలన శ్రేష్ఠునికి పరాభవము సంభవింపనేరదు.

" న హి కఠోరకంఠీరవస్య కురంగశాబః ప్రతిభటో భవతి" అనుదానిం జూడుము.

నాశ్మని స్యాత్ క్షురక్రియా

చట్రాతికి క్షౌరము చేయుదురా ?

నాసాధితం కరణమ్

అసాధితమైన ధాత్వర్థము కరణము (కరణార్థ బోధకము) కానేరదు.

"నాసాధితే హి ధాత్వర్థే కరణత్వం తతోఽస్య సా
సాధ్యతాం వక్తి సంస్కారో నైవాశంక్యః ప్రియాత్వతః"
తత్ప్రఖ్యన్యాయమువలెనే.

నిమిత్తాభావే నైమిత్తికస్యాప్యభావః

నిమిత్తము (కారణము) లేనపుడు అనిమిత్తమును పురస్కరించుకొని సంభవించు ఫలితము సయితము రహితమగును.

"నడ్వలోదకం పాదరోగః" అనినపుడు పాదరోగమునకు నడ్వలోదకము (చూడుము—నడ్వలోదకం పాదరోగః) నిమిత్తము. పాదరోగము నైమిత్తికము. అగుచోఁ నడ్వలోదకమును స్పృశించుటయే శూన్యమయిన పాదరోగమసలేయుండదుకదా!

నికృష్టదృష్టి రోత్కృష్టే

గొప్పవానియందు తక్కువదృష్టి ప్రత్యవాయకారణము. చూడుము — ఉత్కృష్టదృష్టి ర్నికృష్టేఽధ్యసితవ్యా.

నిరస్తపాదపే దేశే ఏరండోపి ద్రుమాయతే

చెట్టు లేని ఊరిలో ఆముదపుచెట్టే మహావృక్షము.
"ఆవు లేని ఊరిలో బఱ్ఱెయే శ్రీమహాలక్ష్మి" అన్నట్లు.

నిరామయస్య కి మాయుర్వేదవిదా

రోగము లేని వానికి ఆయుర్వేదశాస్త్రమును క్షుణ్ణముగా చదివిన ఘనవైద్యునితో నేమి పని?

నిర్విమర్శా హి భీరవః

భయపడే స్వభావము గలవారు విచారశూన్యు లవుదురు. కన బడువస్తువు భయకారణమా ? కాదా?అను విచారమే లేకుండ వారు భయమున గడగడ వణకిపోదురు.

నిసర్గనిపుణాః స్త్రియః

స్త్రీలు సహజముగ జాణలు.

నీచాః కలహ మిచ్ఛన్తి సంధి మిచ్ఛన్తి సాధవః

నీచులు పోట్లాటకే చూచుచుందురు; సత్పురుషులు పోట్లాట సమసిపోవు ప్రయత్నమునకు దిగుదురు.

నీచాశ్రయోహి మహతా మవమాన భూమిః

నీచులను ఆశ్రయించు గొప్పవారు అవమానము నొందు దురు.

నీచాశ్రయో న కర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః

ఆశ్రయించిన గొప్పవారినే ఆశ్రయించవలెను గాని నీచుల నాశ్రయింపరాదు.

నీచై ర్గచ్ఛ త్యుపరి హి దశా చక్రనేమిక్రమేణ

తిరుగుతూఉన్న చక్రపు అంచువలె మానవుల దశ క్రింది, మీఁదవుచుండును.

సుఖదుఃఖములు; పతనాపతనములు; భాగ్యదారిద్ర్యములు; ఒకదానివెంబడి మఱల మఱల కలుగుచుండును. అని పైవాక్యాశయము.

నీచో వదతి న కురుతే; న వదతి కురుతే సజ్జనః

నీచుఁడు చేసినట్లుగానే డంబములు పలుకును. కాని క్రియ శూన్యము. సత్పురుషుఁడు పలుకఁడు; కాని చేసిచూపును.

నైవాశ్రితేషు గుణదోషవిచారణా స్యాత్

ఆశ్రితులయందలి లోపాలోపములను సాధువులు విచారింపరు.

నో ఖ ల్వన్ధాః సహస్రమపి పాన్థాః పన్థానం విదన్తి

మార్గమునఁబోవు గ్రుడ్డివారొక వేయిమంది యైనను మార్గమును తెలిసికొననేఱరు.

నోపకారం వినా ప్రీతిః కథంచిత్ కస్యచి ద్భవేత్

ఉపకారము లేనిదే ఒకనికి మఱొకనియం దెవ్విధముగ నైనను ప్రీతి జనింపదు.

పండక ముద్వాహ్య ముగ్ధాయాః పుత్రప్రార్థనమ్

ఒక తెలివితక్కువస్త్రీ నపుంసకుని పెండ్లియాడి పుత్రులు కలుగలేదని పరితపించినదఁట.

ఇందొకకథయుఁగలదు — ఒకతె నపుంసకుని పెండ్లాడి చాలకాలము పుత్రులు లేక పరితపించి ఒకరోజున భర్తను నాకు పుత్రసంతానము కలిగింపరా అని ప్రార్థింప అతఁడు—విచారింపకుము, నేను త్వరలో చనిపోయి నీకు కుమారులను కలిగింతును—అని సమాధానము చెప్పెనఁట.

పండితా మూర్ఖజీవినః

పండితులకు మూర్ఖులు జీవనాధార మవుదురు.

పటాటోపో భయంకరః

కట్టిన బట్టల ఆడంబరముమాత్రము భయంకరముగనే యున్నది.

పతంత మనుధావతో గతః

ఒకని వెంట నొకఁడు పరువెత్తు చుండఁగా ముందు పరువెత్తు వాఁడు పోయి పోయి యొక గుంటలో ధావనవేగ మాపు కొనలేకపడెను. వెనుకవాఁడును వానితోపాటం దేకూలెను.

పతనాంతాః సముచ్ఛ్రయాః

ఉత్పతనమునకు పతనమే పరిణామము.

"పెరుగుట విఱుగుటకొఱకే"

పతితః పర్వతో లఘుః

కూలిన పర్వతమును జూచి " అది చాల తేలికది. అందు వలననే అది కూలినది" అనుకొన్నట్లు.

పత్తనే విద్యమానేఽపి గ్రామే రత్నపరీక్షా

దాఁపుననే పట్టణ ముండఁగా నొక విలువగల రత్నమును పరీక్షింప ఊరు పేరు లేని పల్లెకు తీసికొని పోయినట్లు.

పరతంత్రం బహి ర్మనః

బాహ్యవ్యాపారమందు మనస్సు పరతంత్రము (స్వాతంత్ర్యము లేనిది) అవును.

బాహ్యవ్యాపారమందు మనస్సునకు ప్రసరణము లేదు అని అర్థము.

ఎట్లన—శు క్తిరజతజ్ఞానము మానసికమా ? లేక ఇంద్రియకమా ? అనిన బహిఃపదార్థములయందు మనస్సునకు వ్యాపారము లేదు కావున ఆశు క్తిరజతజ్ఞానము చక్షురింద్రియజనితమే కాని మానసికము కాదని సిద్ధాంతీకరింపఁబడినది.

పరస్పరవిరోధే హి న ప్రకారా న్తరస్థితిః

రెండు వాక్యములకు పరస్పరవిరోధము సంభవించినపుడు తదన్యప్రకారస్థితి యుండదు. (తదన్యతరస్థితిమాత్రము సంభవించును.)

పరస్పరవిరుద్ధములుగ నుడువఁబడిన వాక్యముల కెన్నఁడును ఐక్యము కుదురదు. వానివలన విశిష్టరూప మింకొకఁడు ఘటించును అని భావము.

"......ప్రకారాన్తరస్థితిః—న ప్రకారాన్తరస్య తాభ్యా మన్యస్య ప్రకారస్య స్థితిః కిన్తు తదన్యతరస్యేత్యర్థః" అని పై న్యాయవ్యాఖ్య.

పరస్పరప్రతిస్పర్ధినో రన్యతరనిషేధేఽన్యతరవ్యవస్థా

పరస్పరవిరుద్ధవాక్యములు రెంటియం దొకటి నిషిద్ధమైన తదన్యతరవ్యవస్థ యయ్యెడ గలుగును.

పై "పరస్పరవిరోధే హి న ప్రకారాన్తరస్థితిః" అను దానిం జూడుము.

పర్జన్యవత్

మేఘమువలె.

పర్జన్య న్యాయమును జూడుము.

పలాలకూటస్య సాదృశ్యం కుంజరాదినా

వడ్లరాశికి ఏనుఁగుమున్నగువానితో సాదృశ్యము చెప్పినట్లు. దూరముననుండి చూచి—ఆవడ్లరాశి ఏనుఁగులాగా ఉన్నది అని పోల్చి చెప్పి సమీపించిచూచిన తనపోలికకును పోల్పఁబడిన ధాన్యపురాశికిని సాదృశ్యమే లేక కుంజరసాదృశ్య మాభాసయగును.

అట్లే—దూరమున నొకటిగా కన్పడి యొకపోలికకు అవకాశమిచ్చుచు దగ్గఱకు వచ్చిన తదాభాస ఘటించు తావుల నీన్యాయ మవతరించును.

దూరస్థవనస్పతి, దూరగిరి న్యాయములను జూడుము.

పశ్య స్యద్రౌ జ్వలదగ్నిం నపునః పాదయో రఘః

కొండమీఁద మండుచున్న అగ్నినే చూచుచున్నావుగాని నీకాలిక్రింద మండుచున్న అగ్నిని గమనించుటలేదు.

ఇతరులకు బుద్ధి చెప్పుచున్నావు గాని నీకు నీవు బుద్ధి చెప్పుకొనుటలేదు.

ఇతరులకు నీతులు బోధించి మంచిత్రోవన నడువ ప్రయత్నించువారు కారు పూరుషులన; తమకు తాము నీతులుపదేశించుకొని తమ మనసు సరియైనత్రోవన నడుపఁజూచువారే పూరుషులు.

పాటచ్చరలుంఠితే వేశ్మని యామికజాగరణమ్

దొంగ లిల్లు దోచుకొని పోయినపిమ్మట కావలివారు మేలుకొనినట్లు.

ప్రయోజనములేని సమయమున స్వరూపత్రోఁ వస్థితి "పాటచ్చరలుంఠితే వేశ్మని యామికజాగరణ" మ్మనునట్లుండును.

పాటన మ స్త్రరేణ విషవ్రణానాం నోప శాన్తిః

విషవ్రణములు శస్త్రచికిత్స చేయనిదే శాంతింపవు. దుష్కరమైన తపఃక్రియ లేనిదే దుఃఖప్రదమైన పాపముపశమింపదు.

పాత్రాఽపాత్రవిచారస్తు ధేనుపన్నగయో రివ

ఆవు పాములలోవలె పాత్రాపాత్రవిచారము చేయవలెను. (దానాదిసమయమందు.)

ఆవును చక్కఁగ పోషించిన అమృతతుల్యము లైన పాలి చ్చును; పామును పెంచిన భయంకరమగు విషమును గ్రక్కును.

పాదప్రసారికా

భిక్షుకపాదప్రసారణన్యాయమును జూడుము.

పాపాత్మనాం పాపశతేనా కింవా?

పాపాత్ములు మఱి నూఱు పాపములు చేయుట కైనను వెనుదీయరు.

పాపీ పాపేన హన్యతే

పాపాత్ముఁడు తాను చేసిన పాపముచేతనే చంపఁబడును.

పాపీ చిరాయుః సుకృతీ గతాయుః

పాపాత్ముఁడు చిరకాలము బ్రదుకును; పుణ్యాత్ముఁడు త్వరలో మేను వాయును.

పిండ ముత్సృజ్య కరం లేఢి

అపూపమును పాఱవైచి చేయి నాకినట్లు.

చూడుము — క్షీరం విహాయారోచకగ్రస్తః సౌవీరరుచి మనుభవతి.

పిణ్యాకయాచనార్థం గతస్య ఖారికాతైలదాతృత్వాభ్యుపగమః

తెలకపిండి అడుగఁబోయినవానికి పుట్టెఁడునూనె యిచ్చు వాఁడు లభించునట్లు.

"శ్రేయ స్తైలం పిణ్యాకాత్" పిట్టుకంటె నూనె శ్రేష్ఠము కావున— స్వల్పఫలావాప్తికై ప్రయత్నించు నపు డుత్కృష్టఫలావాప్తి సంభవించినపు డీన్యాయ మవత రించును.

పిత్తం యది శర్కరయా శామ్యతి కోర్థః పటోలేన?

పైత్యరోగము చక్కెరతో పోవునపుడు చేదుమందు లెందుకు ?

పిశాచానాం పిశాచభాషయై వోత్తరం దేయమ్

పిశాచములకు పిశాచభాషతోనే సమాధానము చెప్ప వలెను.

"యథైవానుకూలో బలిః; యాదృశో యక్ష స్తాదృశో బలిః; యాదృశీ శీతలా దేవీ తాదృశం ఖరవాహనమ్" అన్నట్లు. ఉదా—"ఖలం ఖలేన వంచయేత్" మూర్ఖుని మూర్ఖపు పనిచేతనే వశముచేసికొనవలెను.

పుత్త్రీలిప్సయా దేవం భజంత్యా భర్తాపి నష్టః

పుత్రుని పొందవలె నను వాంఛతో దేవుని భజించుచున్న యొకవనితకు మగఁడుకూడ చనిపోయెనఁట.

పురస్తా దపవాదా అనన్తరాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్

ఇయ్యది వ్యాకరణ పరిభాష.
ముంగలి అపవాదములు అవ్యవహితములై అనంతరమున

నున్న విధులనే బాధింపఁగలవుగాని తదుత్తరవిధులను బాధింపఁజాలవు.

పూర్వం హ్యపవాదా అభినివిశన్తే పశ్చాదుత్సర్గాః

తొలుత అపవాదములు (Special rules) ప్రవేశపెట్టఁబడును (అనఁగా—విచారణీయములుగా గ్రహింపఁబడును.) ఆపిమ్మట సామాన్యశాస్త్రములు (General rules) గ్రహింపఁబడును.

ఇయ్యదియు వ్యాకరణపరిభాషయే. ఇద్దాని ప్రయోగమంను సుస్పష్టము. చూచునది.

పృష్ఠతాడనా ద్దన్తభఙ్గః

ముడ్డిమీఁద కొట్టిన మూతిపళ్ళు ఊడినట్లు.

ప్రకల్ప్య వాఽపవాద విషయం తత ఉత్సర్గోఽభినివిశతే

అపవాదవిషయమును మొట్టమొదట కల్పించి ఆపిమ్మట ఉత్సర్గము ప్రవర్తించును.

చూడుము పై—పూర్వం హ్యపవాదా అభినివిశన్తే పశ్చాదుత్సర్గాః.

ప్రకృతిప్రత్యయౌ ప్రత్యయార్థం సహ బ్రూతః

ప్రకృతిప్రత్యయములు రెండును కలసి ప్రత్యయార్థమును బోధించును. (విడివిడిగా ప్రత్యయార్థమును) బోధింపఁగల సామర్థ్య మా ప్రకృతిప్రత్యయములకు లేదు.

"ప్రకృతిప్రత్యయౌ పరస్పరాపేక్షౌ మర్థ మభిదధాతే నచ ప్రకృత్యా ప్రత్యయార్థోఽభిధీయతే......)

ప్రత్యయార్థము అన "భావన" అని శాస్త్రవ్యవహారము.

"ప్రత్యయార్థం సహా బ్రూతః ప్రకృతిప్రత్యయౌ సదా ప్రాధాన్యా ద్భావనా తేన ప్రత్యయార్థోఽవధార్యతే."

ప్రకృతిప్రత్యయౌ ప్రత్యయార్థం సహ బ్రూతః ప్రాధాన్యేన

పై—ప్రకృతిప్రత్యయౌ ప్రత్యయార్థం సహ బ్రూతః—అనుదానిం జూడుము.

ప్రకృతివ దనుకరణం భవతి

ఒకదాని ననుకరించుట అద్దానిప్రకృతి (అనుసరింపఁబడినది) వలెనే యుండును (గాని ప్రకృతి, అనుకృతులకు భేద మిసుమంతయు నుండదు.)

ఉదా—మాఱుమ్రోత.

ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరా దస్పర్శనం వరమ్

బురద (త్రొక్కి) కడుగుకొనుట కంటె మొట్టమొదటనే దానికి దూరముగ నుండుట మంచిది.

"అడుసు త్రొక్క నేల ? కాలుఁ కడుగ నేల ?"

పంకప్రక్షాలనన్యాయమును జూడుము.

ప్రతి ప్రధానం గుణ ఆవర్తనీయః

ప్రధానవిషయమునకు విధింపఁబడిన విధి ననువర్తించుపట్ల అప్రధానవిషయము ననుసరించిన తక్కిన గుణములను

అనఁగా సంబాధ్యావయవములను మాటిమాటి కావిధిని జరుపుచు నావృత్తము జేయవలెను.

గ్రహైకత్వన్యాయమునకును దీనికిని జాల సంబంధము గలదు. ఎట్లన—

"గ్రహం సంమార్ష్టి" గ్రహమునకు మార్జనము చేయవలెను. అనిన ప్రధాన గ్రహమును అనుటతోడనే తత్సంబంధములవు తక్కిన అన్ని గ్రహములకు సంమార్జనము చేయువలయునని విధి కన్పించుచున్నది.

ప్రత్యక్షే కి మనుమానేన?

ప్రత్యక్షముగఁ గనఁబడుదానిపై నూహాపోహలతోఁ బని యేమి?

"ప్రత్యక్ష మనుమానా ద్బలీయః" అనుమానముకంటెఁ బ్రత్యక్షము బలీయము అని పరిభాష.

ఉదా:—హస్తి (తొండముగలది) కంటికి కగుపడచుండఁగా—ఏనుఁగునకు తొండ ముండునా? ఉండదా? అను వట్టి పిచ్చియూహాపోహాలు చేయువలసిన యవసరమేమి?

కాని కొన్ని కొన్ని చోట్ల ఈన్యాయ మనువర్తింపదు.

ఏలనన—అలాతచక్రము ఒకప్పుడు దృష్టమయినను అనుమానముచే నయ్యది లేదనియు నిర్ధారింపఁ బడుచున్నది.

ప్రత్యక్షే చ యాగవిధా వానుమానికవిధికల్పనానుపపన్నా

ప్రత్యక్షమైన యాగవిధియందు అనుమానసాధితమైన విధికల్పన మసంగతము.

"ప్రత్యక్షే కి మనుమానేన?" అనునదియు నియ్యదియు నొకటియే.

ప్రథమగ్రాసే మక్షికాపాతః

మొదటిముద్దలోనే ఈఁగ పడినట్లు.

పని ప్రారంభించఁగానే విఘ్నము కలుగుట అని న్యాయాశయము.

"వేసినదే ఒకఅడుగు; విఱిగినదే కాలు" అని తెనుఁగు సామెత.

ప్రదీపవత్

ఇంటిలో నొకచోటనున్న దీపము ఇల్లంతయు ప్రకాశింపఁ జేయును.

ప్రదీపన్యాయమును జూడుము.

ప్రదీపే ప్రదీపం ప్రజ్వాల్య తమోనాశాయ యతమానః

పెద్దదీపమునుండి మఱొకదీపమును వెలిగించి ఇంటిలోని చీఁకటి పోఁగొట్ట యత్నించువానివిధమున.

చేతనున్న సులభోపాయముచేతనే సాధ్యసిద్ధి కలుగుచుండ అశక్యమైన గురూపాయమున ప్రవర్తించువాని విషయమున నీ న్యాయము ప్రవర్తించును.

ప్రధానాఽప్రధానయోః ప్రధానే కార్యసంప్రత్యయః

ముఖ్యాఽముఖ్యములలో ముఖ్యమే ప్రధానము.

ప్రమాణవత్త్వా దాయాతః ప్రవాహః కేన వార్యతే?

సప్రమాణముగ ప్రవర్తించు ప్రవాహము ఎవనిచే నిరోధింపఁబడును?

శ్రుతిప్రమాణములతో సుబద్ధమై అవిచ్ఛిన్నముగ నెల్లరచే నంగీకరింపఁబడిన జగన్మిథ్యాత్వ మెవనిచేఁ గాదని త్రోసివేయఁబడఁగలదు?

ప్రమాణవ న్త్యదృష్టాని కల్ప్యాని సుబహూ న్యపి

అక్షిగోచరములు కాకపోయినను ప్రమాణవంతము లవునెడ నెన్నియైనను నిజముగ కల్పించుకొనవలయును.

అట్లే— అదృష్టశతభాగమే యైనను అప్రమాణమైనది కల్పించుకొనఁ జనదు.

శ్రుతిప్రమాణములు గల యంశము లన్నియు విశ్వసనీయములు; శ్రుతిప్రమాణదూరము లవిశ్వసనీయములు.

ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే

ఏదో యొక ప్రయోజనము చూచుకొనక మూర్ఖుఁడైనను దేనియందును ప్రవర్తింపఁడు.

స్వార్థము లేనిదే ప్రజాపతి సయితము సృష్టికార్యమునకుఁ గడంగఁడు. (ప్రజాపతిత్వప్రాప్తియే అం దాతనికిఁ గల ప్రయోజనము.)

చూడుము—న హి విధిశ తేనాఽపి తథా పురుషః ప్రవర్తతే యథా లోభేన.

ప్రసక్తం హి ప్రతిషిధ్యతే

ప్రసజ్యప్రతిషేధన్యాయము నియ్యదియు నొకటియే. ప్రసక్తమైనది అనఁగా—సందర్భవశమున నారోపింపఁబడినయంశము మఱల నిషేధింపఁబడును. అనఁగా—ఆరోపితప్రసంగము దూరము చేయఁబడును. ఎట్లన- రూపరహితమైన వాయువునందు రూపారోపణ మొనరించి మఱల నఙ్చే నయ్యది నిషేధింపఁబడుచున్నది.

ప్రసజ్యప్రతిషేధన్యాయము

ప్రసజ్య—ప్రసక్తిని సంపాదించి (విరూపమును) ఆరోపించి తిరిగి దానిని నిషేధించుట.

పై— ప్రసక్తం హి ప్రతిషిధ్యతే—న్యాయము చూడుము.

ఫలవత్సన్నిధా వఫలం తదంగమ్

ఫలవంతమైన క్రియకుముంగల తదంగమంతయు ఫలశూన్యమేయవును.

బంధనభ్రష్టో గృహకపోతః చిల్లాయా ముఖే పపాత

ఇంట నిర్బంధముగఁ బెంచఁబడుచు ఎట్లో బంధనమునుండి తప్పించుకొనిపోవుచున్న పెంపుడుపావురము పై కెగురగనే డేగనోటిలో పడె నఁట.

ఒకకష్టము తప్పించుకొనిన వెనువెంటన అంతకన్న దుస్సహమైన కష్టము ప్రాప్తించుటయని న్యాయాశయము.

బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయం చేతః

గట్టిగ శిక్షితులు (చదివింపఁబడినవారే) అయినవారి మనస్సుసయితము తనయందు నమ్మకము లేనిది అవును.

ఇరువురి వివాదమును విన నరుదెంచిన మహాపండితులు సయితము వారివాదప్రతివాదములను విని 'అంతియకాఁబోలు' అనుకుందురేగాని వారివాదములోని లోపముల నుద్ఘాటించి వెలిపుచ్చరు. (అంతకుమున్ను తా మెఱిఁగి యున్నదానికిఁగూడ కళంకము దెచ్చి పెట్టుకొందురు.)

బహూనా మనుగ్రహో న్యాయ్యః

పలువురి సాహాయ్యము చాల మేలు.

పలువురు కలిసి ఒకమాటతో నుండుట శ్రేయస్కరము.

"బహూనా మ ప్యసారాణాం మేలనం కార్యసాధకమ్,
తృణైః సంపాద్యతే రజ్జు స్తయా నాగోఽపి బధ్యతే."

దుర్బలులైనను పలువురు కలిసియున్న నెంతపనినైనను సులభముగ సాధింపవచ్చును. గడ్డిపోచలచే నేర్పడిన వెంటిచే నేనుఁగుసైతము కట్టివేయఁబడుచున్నది.

తృణరజ్జున్యాయమును జూడుము.

బహూనా మనుమరణం న్యాయ్యమ్

పదిమందితో కలిసి చచ్చుట యైనను న్యాయానపేతమే.

"నలుగురితోపాటు నారాయణ"

బహూనా మ ప్యసారాణాం సమవాయో హి దుర్జయః

దుర్బలులే యైనను పలువు రొకటిగా నున్న వారిని జయిం చుట దుర్ఘటము.

బాలస్య ప్రదీపకలికాక్రీడయైవ నగరదాహః

దీపపుత్తిలికతో నాడుకొను బాలుని ఆటయే పట్టణమును దహింపఁజేయ కారణ మవును. (అదిమాత్రమది వానికి ఆటగానే యుండును. కాని పట్టణపుగతి ?)

బుభుక్షితః కిం ద్వికరః ప్రభుంక్తే?

ఆఁకలి అయినది కదా అని ఆఁకలిగొన్నవాఁడు రెండు చేతులతోను తినునా ?

బుభుక్షితస్య కిం నిమన్త్రణాగ్రహ ఉత్కణ్ఠితస్య కేకారవశ్రవణమ్

ఆఁకలిగొనినవానికి పిలువ లేదనే పట్టుదల; ఉత్కంఠితుఁ డైనవానికి నెమిలికూఁతలను వినిపించుట అడ్డుపడునా ?

అధికృతతీర్థాధికారులవు తపస్విలకు రాజనిర్బంధ మెక్కడిది ?

భక్షితేపి లశునే న శాన్తో వ్యాధిః

ఆశపడి వెల్లుల్లి తినినను వ్యాధిమాత్రము తగ్గ లేదఁట. "కృతేఽపి కేశసంస్కారే భార్యాత్వం నైవ ముంచతి" అన్నట్లు.

భూతం భవ్యాయోపదిశ్యతే

ఇయ్యది మీమాంసకప్రతిపాదితన్యాయము.

ప్రారంభింపఁబడిన యాగాదిక్రియాకలాపము భావిఫల ప్రధానమై యుండును.

అనఁగా నిపు డాచరింపఁబడిన యజ్ఞయాగాదికర్మజాలము భావికాలమున ఫలించును.

భూతాయ భవ్యమ్

భావిఫలితమంతయు నాచరితభూతకర్మాదికమున నాధార పడియున్నది.

(ఉపనిషజ్జాల మంతయు భూతపరముగానే యున్నదని భాష్యకారాదులమతము.)

మణివిక్రయదృష్టాన్తః

ఒక మణివర్తకుఁడును, కిరాతుఁడును మణి నమ్మినట్లు. మణులవ్యాపారముచేయు వర్తకుఁడు మణులలోని మంచి చెడ్డలు, దానివిలువ బాగుగ నెఱింగినవాఁడు కావున మణిని తగు వెలకమ్మి యెక్కుడి లాభము నొందును. మణులసంగతిగో యెఱుఁగని అడవిజాతివాఁడు మణుల నమ్మవచ్చిన దానివిషయమే యెఱుఁగక కానివెల కమ్మి తక్కువలాభము నొందును.

అట్లే—విజ్ఞానోపేతుఁడైన విద్వాంసుఁ డొనర్చిన కర్మ జాలము విశేషఫలప్రదము; అవిద్వదాచరితకర్మజాలము స్వల్పఫలదము నగును.

మణ్డూకవసాక్తాక్షాణాం వంశే ప్యురగభ్రమః

కప్పక్రొవ్విత్తో తయారుచేయఁబడిన కాటుక పెట్టుకొనిన కన్నులుగలవారికి వెదుళ్లు పాములా అను భ్రమకలుగును. వెదురుకఱ్ఱకు పాముతో నించుక సాదృశ్యము గలదు. కాని, దానియందు సాక్షాద్వంశత్వము పిహితమై ఉరగత్వముకారణముగ నారోపింపఁబడదు. మండూకవసాంజనము వలన మాత్రము ఆ వంశత్వము పిహితమగుచున్నది. అంతమాత్రమున వంశత్వము నశింపదు. వసాంజనప్రభావమున నట్లు కంటికి కగపడును. కావున మండూకవసాంజనము కేవలము వంశత్వాపిధానమున నిమిత్తమాత్రమయి ఉరగత్వభ్రమను కల్పించుచున్నది.

అనుకూలవస్తువులయం దననుకూల వ్యవహారమును జనింపఁ జేయు సాధనములయందును, (సాధనసాధ్య విరూపవస్తుత్వ భ్రమయందు ఈన్యాయము ప్రవర్తించును.

మదశక్తివత్

మదశక్తివలె.

పృథివ్యాదిపంచభూతసంఘాతమునుండి దేహమును, దేహమునందలి సర్వాంగముల సారభూతమై మదశక్తియు కలుగును.

అల్లే— శరీరాకారపరిణతభూతసంఘమున చైతన్యమును, చైతన్యవిశిష్టమై విజ్ఞానము (ఆత్మ) నుండునని కొందఱ మతము.

**మధు పశ్యసి దుర్బుద్ధే ప్రపాతం నానుపశ్యసి**

మూఢుఁడా! తేనెనే చూచుచున్నావుగాని, పతనమును మాత్రము గమనించుట లేదు.

ఒకఁడు చెట్టుచివరకొమ్మలో నున్న తేనెను సంపాదింపవలయునను పేరాసతో ప్రాకుచుండెనేగాని, అచటికొమ్మ విఱిగి తాను పడుటనుమాత్రము గమనించుట లేదఁట.

అట్లే—తుచ్ఛకామసుఖ మనుభవించు నిచ్ఛచే చేయరాని పనులలో నడుగిడుటయేగాని మూఢులు దానివలన సంభవించు నరకమునుమాత్రము గుర్తించరు.

దీనినే "మధు పశ్యసి దుర్బుద్ధే ప్రపాతం కిం న పశ్యసి" అనియు నందురు.

**మధ్యేఽపవాదాః పూర్వాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్**

మధ్యనున్న అపవాదములు పూర్వవిధులను బాధించును గాని తరువాతి విధులను బాధింపనేఱవు.

**మరణా ద్వరం వ్యాధిః**

చావుకంటె వ్యాధి నయము.

మహతాపి ప్రయత్నేన తమిస్రాయాం పరామృశన్
కృష్ణశుక్లవివేకం హి న కశ్చి దధిగచ్ఛతి

పెద్దప్రయత్నముతో నొకవస్తువును కారుచీకటిలో పరీక్షించినను దానిస్వరూపమును అనఁగా—తెల్లనిదో, నల్లనిదో, మఱెట్టిదో ఎవఁడును తెలిసికొనఁనేఱఁడు.

మహతి దర్పణే మహన్ముఖం తదేవ కనీనికాయాం మణు

పెద్దముఖము పెద్దఅద్దమందు పెద్దదిగ కనఁబడును. అయ్యది యే కంటిపాపయందు అణుప్రమాణముగ కనఁబడును.

ఉదా — ఒకటియే వ్యంజకభేదమువలన ఉత్కృష్టముగను, నికృష్టముగను చూడఁబడును.

మహాన్ మహత్స్వేవ కరోతి విక్రమమ్

గొప్పవాఁడు గొప్పవానియందే తన ప్రభావము జూపును.

మహిషీస్నేహప్రతిబద్ధ భిక్షుదృష్టాన్తః

అతీతమహిషీస్నేహన్యాయమును జూడుము.

ఇందొకగాథ కలదు—పూర్వాశ్రమమున బఱ్ఱెపై నెక్కువ ప్రేమ గల యొక సన్న్యాసికి అనుక్షణము తనబఱ్ఱెయే స్ఫురణకు వచ్చుచుండెడిదఁట. గురూపదిష్టమైన మంత్రోపాసనమునకు కనులు మూసినంతనే ఆబఱ్ఱెయే స్ఫురణకు వచ్చి చిత్తము వికల మయ్యెడిది. అది గమనించి ఉపదేష్ట ఆబఱ్ఱెపైననే తత్త్వము నారోపించి (బఱ్ఱెరూపముగా తత్త్వమును భావింపఁజేయుచు) ఉపదేశించెను. సన్న్యాసియు బఱ్ఱెపై మనసునిలిపి క్రమక్రమముగ ఉపాసనావశమున మహిషీరూపమును పాఱద్రోలి ఆరోపితతత్త్వమునే మనమున దృఢముచేసి బ్రహ్మజ్ఞాని యయ్యెను.

కావున నెట్టిస్థితియందున్న దానికి అట్టివిధముననే వానిమనఃప్రవృత్తికనుకూలముగ తత్త్వోపదేశము గావించి ధన్యుం జేయనగును.

మానాధీనా మేయసిద్ధిః

మానమునుబట్టి మేయము సిద్ధించును.

లక్షణమునుబట్టి లక్ష్యము సిద్ధించును.

దీనినే — "ప్రమాణాధీనా ప్రమేయసిద్ధిః" అందురు.

మారణాయ గృహీతోఽఙ్గచ్ఛేదం స్వీకరోతి

చంపివేయుటకుఁ గొనిపోఁబడినవాఁడు చంపివేయఁ బడక యే దేని యొక అవయవమును ఖండించి వదలివేయుడు మనిన చావు తప్పి తిరిగి తనను బ్రతికినవానినిగా తలంచుచు అవశ్య మియ్యకొనును.

నరకయాతనులనుండి విడచి మనుష్యదుఃఖములం బడవైచిన నీకొనవాఁ డుండునా ?

"మరణా ద్వరం వ్యాధిః" అన్నట్లు.

అధికక్లేశ మనుభవించువానికి స్వల్పక్లేశానుభవము నకుఁ బ్రేరితుఁ డవుట ప్రమోదకారణమే యని న్యాయాశయము.

మార్జాలాభ్యఞ్జనమ్

పిల్లికి నూనెతో తల అంటినట్లు.

మాలతీగన్ధగుణవి ద్దగ్ధే న రమతే హ్యాలిః

మాలతీపుష్పపరిమళ మెఱింగిన తుమ్మెద జిల్లునకు సంతోషము నొందదు. (మనసైన చేయదు)

బ్రహ్మానంద మనుభవింప నేర్చిన జ్ఞాని తుచ్ఛవిషయానంద మపేక్షింపడు.

మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కించన

ము న్నొకపుడు శుకుఁడు జనకరాజు విదేహనామమున జీవన్ముక్తి సంపాదించినవాఁడనియు, బ్రహ్మజ్ఞాని యనియు, కర్మనిష్ఠుఁడై ఆత్మజ్ఞానియనియు, తండ్రివలన నెఱింగి జనకునిపాలికిం జని ఆయనతో వేదాంతవిచారణ చేయుచు కర్మపరుఁడై ఆత్మజ్ఞాని యగు టెట్లను విషయమున వాదించుచున్న సమయమున భటుఁ డొకఁడు పరుగెంచి జనకునితో—రాజా! పట్టణ మొకమూలనుండి తగులఁ బడుచున్నదని విన్నవించుకొనెను. అది విని రాజు చిఱు నవ్వు నవ్వుచు వికార మిసుమంతయు నొందక యిట్లనెను. "మిథిలాయాం ప్రదీప్తాయాం న మే కించన దహ్యతి—" అలాగా? పోనిమ్ము. మిథిలాపట్టణ మంతయు తగులఁ బెట్టినను యీఅగ్ని నా మనస్సును తగుల బెట్టఁగలదా? ఆమాటలు విని శుకుఁ డాయన గంభీరచిత్తత్వమున కెంతయు నచ్చెరువొందెను. బ్రహ్మనిష్ఠుల మనసు అనంతమై యుండును. వారికి ప్రపంచములో కావలసిన దెద్దియు లేదు. ఎట్టిస్థితి సంభవించినను వారు వికారము నొందరు. కర్మలు చేయుచుందురు; కర్మఫలలిప్తులు మాత్రము కారు.

ముణ్డితశిరో నక్షత్రాన్వేషణమ్

తల గొఱిగించుకొనినపిదప నక్షత్రములను చూచినట్లు. క్షౌర మయిన పిదప నక్షత్రము మంచి దయిన నేమి? కాకున్న నేమి? అపుడు నక్షత్రవిచారణ వ్యర్థము.

అవసరకాలమున చేయఁదగినపనిని వదలి కాలాన్తరమున తద్విషయము విచారించుట వ్యర్థమని న్యాయాశయము. "కృతే కార్యే కిం ముహూర్తప్రశ్నేన?; కృతక్షౌరస్య నక్షత్రపరీక్షా; న హి వివాహానన్తరం వరపరీక్షా క్రియతే" మున్నగువానిం జూడుము.

మునిర్మనుతే మూర్ఖో ముచ్యతే

ఒక ముని బ్రహ్మను మననము చేయఁగా నొక మూర్ఖుఁడు ముక్తుఁడైనాఁడట. (మునికర్తృక ధ్యానాదివిధిఫలమైన సాక్షాత్కారము మునికే సంభవింప వలయునుగాని మఱొక మూర్ఖునకు కలుగదు.)

"పృష్ఠతాడనా ద్దంతభంగః; కాచి న్నిషాదీ తనయం ప్రసూతే కశ్చి న్నిషాదస్తు కషాయపాయీ" అను వాని విధమున.

ముసలః కిసలాయితే

రోఁకలి చిగిర్చె నన్నట్లు.

(అసంభవ మని భావము.)

"గుంప్రాలికి కాళ్ళు వచ్చి గునగున నడచెన్" మాదిరి.

మూషికభక్షితబీజాదా వంకురాదిజననప్రార్థనా

ఎలుకలు తినిన విత్తనములలో నుండి అంకురములు మొలకెత్తుటకై చాల ప్రయత్నము చేసినట్లు.

"దగ్ధబీజాంకుర" న్యాయమును జూడుము.

మృతం దుణ్డుభ మాసాద్య కాకోఽపి గరుడాయతే

చచ్చి పడియున్న పామును బట్టి కాకి గూడ గరుడపక్షితో సమానమే అవును.

మౌన మర్థాఙ్గీకృతిః

చెప్పినదానికి మారుమాటాడక ఊరకుండుట పూర్వపక్షిప్రతిపాదితార్థము నంగీకరించుటయే.

"అనిషిద్ధ మనుమతం"ను జూడుము.

య ఏవ కరోతి స ఏవ భుంక్తే

"య ఏవ కర్మణః కర్తా స ఏవ తత్ఫలస్య భోక్తా"

ఎవఁడు కర్మము చేయునో వాఁడే తత్ఫలము ననుభవించును.

యః కారయతి స కరోత్యేవ

ఎవఁడు చేయించునో వాఁడు చేయునుకూడ.

ఎవఁడు అనుభవింపఁజేయునో వాఁడు అనుభవించును గూడ.

"జీవ స్తావ త్పిబ తీశ్వరస్తు పాయయతి । పాయయన్నపి పిబతీశ్వరః। పాచయితర్యపి పక్తృత్వప్రసిద్ధి దర్శనాత్ ॥"

య త్కారభస్య పృష్ఠే న మాతి త త్కణ్ఠే నిబధ్యతే

ఒంటెవీఁపుపై జాగా లేనియెడల (మిగతా సామానును) దానిమెడలో వ్రేలాడదీయుదురు.

భరించలేని క్లేశము లొకదానిపై నొకటి అవిచ్ఛిన్నముగ పైబడుసమయముల నీన్యాయ మవతరించును.

యత్కృతకం తదనిత్యమ్

స్వభావసిద్ధముగాక కృత్రిమముగ కల్పిత మైనదంతయు ననిత్యమే.

బ్రహ్మచే సృష్ట మైనదిగావుననే ప్రపంచమున కనిత్యత్వము ప్రాప్తించినది. సృష్ట్యాదులు లేక నిర్వికారమై స్వతఃసిద్ధముగ త్రికాలాబాధ్యమవు బ్రహ్మవస్తు వకృతకము కావున నిత్య మని పేర్కొనఁబడుచున్నది.

యదాకృతి స్తత్ర గుణాః

ఆకార మున్నతావుననే గుణములు నుండును.

స్వరూపము సుందరమై నేత్రానందకరముగా నున్న నద్దానిగుణములును ఆనందజనకములుగ నుండును.

యత్ర ధూమ స్తత్ర వహ్నిః

పొగ ఉన్నచోట అగ్నికూడ ఉండును.

ఉదా — వహ్నిమాన్ పర్వతః, ధూమవత్త్వాత్

ఎక్కడ పొగ ఉండునో అక్కడే అగ్ని ఉండును గాని మఱొకచో నుండదు.

చూడుము — అస్య వేశ్మస్థితా ద్ధూమా న్న వేశ్మా న్తర మగ్నివత్.

యత్రార్థాఽవగతి రేవ నాస్తి తత్ర సన్దేహస్య కా కథా ?

అసలు అర్థమే స్ఫురించనితావున సందేహావిషయమును గూర్చి చెప్పునదేమున్నది ?

యత్ప్రాయో యచ్చ యాదృక్చ తత్తాదృ గవగమ్యతే

సాధారణముగ నేది ఎట్లు కనుపించునో అది అట్లే తెలిసికొనఁబడును.

యథా దేవ స్తథా భక్తః

దేవుఁ డెట్టివాఁడో భక్తుఁ డట్టివాఁడే అవును.

యథా నామ తథా గుణః

పేరుకు తగినట్లే గుణముకూడా.

యథా పితా తథా పుత్త్రః

"ఆత్మా వై పుత్త్రనామాఽసి" కావున తండ్రివంటివాఁడే పుత్త్రుఁడు నవును.

యథా బీజ స్తథాఙ్కురః

విత్తనమువంటిదే అంకురము.

"న హి శ్యామాకబీజం పరికర్మసహస్రేణాఽపి కలమాంకురాయ కల్పతే" అను న్యాయమునుమాదిరి.

యథా భావ స్తథా దేవః

భావ మెట్లు ఉన్న దేవుఁడు నట్టిరూపముగలవాఁడే అవును.

యథా రాజా - తథా ప్రజా

రాజెట్లో ప్రజలు నట్లే.

భోజునికాలమున కవిత్వము నేర్వనివాఁడు కలికమున కైనను లేఁడఁట.

యదన్తరేణ యన్న సంభవతి తస్య తదర్థత్వం తదపేక్షకమ్

ఏది లేకున్న ఏకార్యము జరగదో ఆకార్యమున కది కారణమగును. ఆకార్యము దాని నపేక్షించియుండును.

ఉదా—అగ్నిహోత్రము—దహనక్రియ.

యదనిత్యం తత్కృతకమ్

ఏది అనిత్యమో అది కృతకము (కల్పితము) అగును. నిత్యమైనది అకృతకము—స్వభావసిద్ధమే.

"యత్కృతకం తదనిత్యమ్" చూడుము.

యదభిధిత్సితం తదభిధీయతాం, ఫలే వ్యక్తి ర్భవిష్యతి

చెప్పఁదలఁచుకొనిన దాతయు జెప్పివేయవచ్చును. అదంతయు ఫలితమున స్పష్టము కాకపోదు.

"మాగ్రంథమిట్టిది" యని యేమోమో పీఠికలు వ్రాసికొనిన వ్రాసికొననిండు; అదంతయు గ్రంథమును జదివి పరిశీలించిన స్పష్టముకాదా ?

యదశ్వేన హృతం పురా తత్పశ్చాద్గర్దభః ప్రాప్తుం కేనోపాయేన శక్నుయాత్ ?

ఎన్నఁడో ఒకగుఱ్ఱముచే నెత్తుకొనిపోఁబడినదాని నాపిమ్మట గాడిద ఏయుపాయముచే తాను పొందఁగలదు ? (పొందనేఱదని అర్థము.)

శ్రుతిశ్రవణముచే ఆశ్రుతియందు మిక్కిలి రూఢమైన మనస్సుగలవాని భావము ఆతరువాత స్మృతి వినిపించి ఆస్మృతివైపునకు మఱల్ప సాధ్యము కానేఱదు.

యద్గతమ్ తద్గతమ్

పోయినది పోయినదే. (మఱల రాదు.)

యద్గ్రహే యదపేక్షం చక్షుస్తదభావగ్రహేఽపి తదపేక్షతే

ఏది ఉన్నది అని తెలుసుకొనుటకు కన్ను కావలసివచ్చినదో, అది లేదు అని తెలుసుకొనుటకుఁగూడ కన్నే కావలసివచ్చును.

యద్యథా వర్తతే తస్య తథాత్వం భాతి మానతః

ఏది ఎట్లుండునో యూహచేఁగూడ దాని కట్టిధర్మమే భాసించును.

యద్యదా యత్కారణసమర్థం తత్తదా తత్కరోత్యేవ

ఏది యెప్పుడు ఏదిచేయ సమర్థమవునో అది అప్పుడద్దాని జేసియే తీరును.

ఏకాలమున కేది రానున్నదో అదప్పుడు రాకమానదు.

య ద్విశేషయోః కార్యకారణభావోఽసతి బాధకే తత్సామాన్యయో రపి

రెండువిశేషవస్తువులకుఁగల కార్యకారణసంబంధము అబాధకమై సమముగా నున్నయెడల ఆవిశేషవస్తువులను సంబంధించిన సామాన్యవస్తువులకు సయితము కార్యకారణ సంబంధ మబాధముగనే యుండును.

యవాః ప్రకీరా న భవన్తి శాలయః

యవలు చల్లిన వరిధాన్యము పండదు.

"న హి శ్యామాకబీజం పరికర్మసహస్రేణాఽపి కలమాంకురాయ కల్పతే" రీతిని.

యశ్చోభయోః సమో దోషో న తేనైక శ్చోద్యో భవతి

రెండువస్తువులకు సమానమైనదోష మున్నపుడు వానిలో నొకదానిచే ఆదోషము దూరముచేయఁబడ నేఱదు.

యస్య దండ స్తస్య మహిషీ

ఈ గేదె ఎవరిది అనిన ఈకఱ్ఱ ఎవరిదో వానిదిఅని చెప్పినట్లు.

అశ్వభృత్యన్యాయమును జూడుము.

యస్య నాస్తి పుత్రో న తస్య పుత్త్రస్య క్రీడనకాని క్రియన్తే

కొడుకులే లేనివాని కొడుకు ఆటలాడుకొనునా (ఆడుకొనఁడు.)

అంగమే లేని కర్మయందు అంగవిధియే ఉండదు.

అజాతపుత్త్రనామోత్కీర్తన, అసంజాతవిరోధిత్వ న్యాయములను జూడుము.

యస్యాజ్ఞానం భ్రమ స్తస్య భ్రాన్తః సమ్యక్చ వేత్తి సః

అజ్ఞానము కలవానికి భ్రమ కలుగును. భ్రాంతుడైన వాడు తిరిగి మనస్సును సమాధానపఱచుకొని యాథార్థ్యము నెఱింగికొనును.

యస్యాఽజ్ఞానం భ్రమ స్తస్య భ్రాన్తః సమ్య జ్న వేత్తి సః

అజ్ఞానము గలవానికి భ్రమ కలుగును. ఆభ్రమ కలిగిన పిమ్మట అజ్ఞానావృతుడు కావున నాతడు నేను భ్రమించితి ననియు, దీనియాథార్థ్య మిట్టిది అనియు బాగుగ తెలిసికొననేఱడు.

పై న్యాయమున కియ్యదియు, దీనికి పైన్యాయమును విరుద్ధములు.

యన్యోన్మూలనాయ యస్య ప్రసక్తి స్తత స్తస్య బలవత్త్వమ్

దేనిని నివారించుటకై యెయ్యది గ్రహింపఁబడునో అద్దానికంటె అయ్యది బలవత్తరము.

"నిషేధాశ్చ బలీయాంసః" (విధులకంటె) నిషేధములు బలీయములు కావున పైన్యాయమున నిషేధబలవత్త్వము పాదింపఁబడినది.

యాదృశః పురుషస్యాత్మా తాదృశం సంప్రభాషతే

మనస్సు ఎట్టిదో వాక్కులుకూడ అటువంటివే పలుకుదురు.

యాదృశం ముఖం తాదృశీ చపేటికా

ముఖమును బట్టియే చెంపకాయ

"..........మెత్తని చెప్పుతో కొట్టుము" అనిసామెత.

యాదృశీ భావనా తాదృశీ సిద్ధిః

ఎవని భావన (ఊహ) ఎట్లుండునో ఫలితముకూడ నట్టిదియే కలుగును.

యాదృశీ మాతా తాదృశీ పుత్రీ

తల్లి యెట్టిదో కూతురు నట్టిదే.

"ఆవు చేనిలో మేసిన దూడ గట్టున మేయునా?"

యాదృశీ శీతలా దేవీ తాదృశం ఖరవాహనమ్

శీతలాదేవికి తగినట్లే గాడిదవాహనముకూడ నియోగింపబడినది.

యాదృశో యక్ష స్తాదృశో బలిః

యక్షుఁ డెట్టివాఁడో అట్టిదేఁ బలియు.

"యక్షానుకూలో బలిః" అనిన్యాయము.

మనసార మాటాడని వారికి మనోదూరము లయిన సమాధానములే తగినవి.

మూర్ఖునికి మూర్ఖతయే ప్రతిక్రియ.

యా యస్యాభిమతా తాత సురూపా తస్య సా భవేత్

ఎవని కెవతె ఇష్టురాలై ఉండునో వాని కాపె చాలచక్కనిదిగా తోఁచును.

యావ చ్ఛిర స్తావ చ్ఛిరోవ్యథా

తల ఉన్నంత వఱకే తలనొప్పి. (తలలేకున్న తలనొప్పియే లేదు.)

ముక్కు ఉండినదే పడిశము.

యావ త్తైలం తావ ద్వ్యాఖ్యానమ్

చము రున్నంతవఱకే దీపము. వ్యుత్పత్తి ఉన్నవఱకే వ్యాఖ్య. తఱచిన కొలఁది క్రొత్తక్రొత్త యంశములు స్ఫురించుచునే యుండును.

యావ త్స్నానం తావ త్పుణ్యమ్

స్నానము చేసినంతదనుక తీర్థములు పుణ్యఫలము నిచ్చుచునే ఉండును.

యావద్వచనం వాచనికమ్

వాక్య మెంత యుండునో అంతయే అర్థము కావింపవలయును గాని విశేషములు అనుబంధములు కల్పించుట తగదు.

అనగా—ఎంత అర్థమును వచింపఁగల సామర్థ్య ముం డునో వాక్యమున కంతఅర్థమే గ్రహింపవలయునని భావము.

యేన నాప్రాప్తే యో విధి రారభ్యతే స తస్య బాధకో భవతి

దేనిచేత ప్రాప్తించుచుండఁగా ఏ మఱొకవిధి ఆరంభింపఁ బడునో అది దానికి బాధక మవును.

అనఁగా—ఒకవిధివాక్యముచే నొకవిధి ప్రవర్తించుచుండగా దాని కపవాదముగాఁ నచ్చో ప్రవర్తింపఁజేయుబడు మఱొకవిధివాక్యము మొదటిదానిని బాధించును.

రెండు నఞ్‌లు పదముయొక్క విధ్యర్థమును బోధించుచు దానికి మిక్కిలి బలము ( Force ) నిచ్చునుగాన అప్రతి హతముగ జరుగునపుడు అని " నాప్రాప్తే " అనుపద మునకర్థము నెఱుఁగునది.

దీనినే క్లుప్తీకరించి " యేన నాప్రాప్తిన్యాయము " అంసురు. ఉదాహరణమునకు—తక్రకౌండిన్యన్యాయమును—దీసికొనుఁడు.

"బ్రాహ్మణేభ్యో దధి దీయతామ్, తక్రం కౌండిన్యాయ" అను నపు డీవాక్యమున రెండు విధు లున్నవి—మొద టిది—బ్రాహ్మణులకు పెరుగు వడ్డింపుడు—అనునది. కౌండిన్యునకు మజ్జిగ వడ్డింపుడు—అనునది రెండవది. ఇందు మొదటివిధిచే పెరుగే కౌండిన్యునకుఁగూడ లభించు చున్నది. కాని, దానిని బాధించి వానికి మజ్జిగయే

పోయువలయునని వ్యవస్థ జేయుచు రెండవ వాక్యము ప్రారంభింపఁ బడుచున్నది. ఈ రెండు వాక్యములలో ఆనంతరికవిధికే బలము కావున కౌండిన్యునకు మజ్జిగయే పోయఁబడుచున్నవి.

రాజార్థాపయికం నిత్య ముష్ట్రో వహతి కుంకుమమ్

రాజుగారి కుపయోగింపఁబడు కుంకుమను ప్రతిరోజు (మోసుకొనిపోవుసమయమున) ఒంటె (ముందు) తాను వహించును.

రాత్రౌ దీపశిఖాకాంతి ర్న భానా వుదితేసతి

దీపపువెలుతురు రాత్రియే యుండునుగాని సూర్యోదయమైన నుండదు.

దీపపువెలుతురు రాత్రియే కావలయునుగాని సూర్యోదయమైన పిమ్మట ననవసరము.

రాధావేధోపమా

రాధా అనఁగా—చిత్రింపఁబడిన చాలచిన్న స్త్రీచిత్రము.

వేధ అనఁగా—అందలి చిత్రకారత్వము.

చాలచిన్న బొమ్మయందలి పనితనమును గమనించుట చాల కష్టసాధ్యము. అట్లే—

చాల సూక్ష్మమై దుర్లభమైన అంశమం దీన్యాయము ప్రవర్తించును.

ఉదా—"రాధావేధోపమం ధర్మసూక్ష్మమ్"

"దుష్ప్రాపం రాధావేధోపమం మానుష్యం"

రుధిరసంపర్కాత్ విషస్య శరీరే ప్రసర్పణమ్

విషము రక్తము నాధారము చేసికొని శరీరమునందు ప్రవేశించును.

అట్లే— ఏదోయొక ఛిద్రము నాధారము చేసుకొని దోషము చిత్తమునం బ్రవేశించును. కావున దోషమున కణుమాత్ర మేనియు నవకాశ మీరాదు.

రూఢి ర్యోగ మపహరతి

"......రూఢి ర్భవే ద్యోగాపహారిణీ" రూఢియోగమును బాధించును.

అనంగా—రూఢార్థము (ముఖ్యార్థము) యౌగికార్థమును (గౌణార్థమును) బాధించును.

చూడుము—గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః

రోహణాచలలాభే రత్నసంపదః సంపన్నాః

రోహణాచలము లభించిన రత్నసంపదలన్నియు లభించినట్లే.

అట్లే—"పరమేశ్వరతాలాభే సర్వాః సంపదః......సంపన్నా ఏవ" —పరమేశ్వరత్వము లభించిన సమస్తసంపదలు లభించినట్లే.

లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః

లక్షణమువలనను, ప్రమాణమువలనను వస్తుసిద్ధి కలుగును.

అనంగా—ఒకవస్తువును తెలిసికొనుటకు మొట్టమొదట

దానిలక్షణములను, ఆతరువాత ఆలక్షణములు ప్రత్యక్ష ములుగ ప్రమాణమును కావలసియుండును.

అట్లే—పృథివిని "గన్ధవతీ పృథివీ" అని గంధవత్త్వలక్షణమును, ఆగంధవత్త్వము మనకు ప్రత్యక్షముగ ననుభవములో నుండుటను, బట్టి మనము తెలిసికొనుచున్నాము.

పరమేశ్వరుని భక్తులు సర్గాది హేతుత్వరూపేశ్వరలక్షణము, శ్రుతిప్రమాణములవలన తెలిసికొనుచున్నారు.

లక్షణాశ్రయా లక్ష్యస్య వ్యవస్థా

లక్ష్యనిశ్చయము లక్షణము ననుసరించియుండును.

లాంగలం జీవనమ్

"నాఁగలి జీవనము" అన్నట్లు.

జీవనమునకు నాఁగలి నిమిత్తము అని అర్థము.

"ఆయు ర్ఘృతం; విషం మృత్యుః" ఇత్యాదులవలె.

వచనే కో దరిద్రః ?

మాటలో దరిద్రుఁ డెవఁడు ?

మాటలకు మాత్రము బీదతనము లేదని భావము.

"మాటలు కోటలు దాటును"

వధ్యతాం వధ్యతాం బాలః

ఇది విష్ణుపురాణమందలి వాక్యము.

ప్రహ్లాదునిపై చాల కినిసి సభలో హిరణ్యకశిపుఁడు తన భటులతో నిట్లనెను—

"వధ్యతాం వధ్యతాం బాలో నానేనార్థోఽస్తి జీవతా,
స్వపక్షహానికర్తృత్వా ద్యః కులాంగారతాం గతః."

స్వపక్షమునకు కీడు మూహించుచు కులమునకు ధూమకేతువు వలె జనించిన యీతఁడు బ్రతికియుండి యేమి ప్రయోజనము? తీసికొనిపోయి చంపివేయుఁడు.

కాని "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్" అను వాక్యమున కియ్యది విరుద్ధము కాదా? ప్రపంచములో నెచటనైన కనుపుసం గన్నవానిని తండ్రి సమయింపఁజేయునా? యనిన "త్యజే దేకం కులస్యార్థే" యను న్యాయమున నియ్యగి యుక్తమే యని సిద్ధాంతము చేయుచు విజ్ఞులు పై "వధ్యతాం వధ్యతాం బాలః" అను వాక్యమును న్యాయముగ ప్రయోగించియుండిరి.

వరం సాంశయికా న్నిష్కా దసాంశయికః కార్షాపణః

అనుమానమైన నవరసుకంటె అనుమానములేని రూపాయి శ్రేష్ఠము.

ఇది సంస్కృతలోకోక్తి. కాని న్యాయముగ వాడఁబడుచున్నది. దీనికి సరియగు సామెత ఆంగ్లమున నొండు గలదు.

"*A bird in the hand is worth two in the bush.*"

వర మద్య కపోతః శ్వో మయూరాత్

రేపో ఎల్లుండియో లభించు నెమలికంటె క్రొనాఁడు (లభించిన) పావురమే లెస్స.

వరాటికాన్వేషణే ప్రవృత్త శ్చింతామణిం లబ్ధవాన్

గవ్వకు వెతుకబూనినవానికి చింతామణి దొరకినట్లు.

వాచః కర్మాతిరిచ్యతే

వాక్కుకంటె క్రియ శ్రేష్ఠము.

అందువలననే సత్పురుషులు నోటితో అనక కార్యరూపమునఁ జూపుదురు.

విక్రీతగవీరక్షణమ్

అమ్మివేసిన ఆవును మరల తానే పోషించుట.

తనఆవునొకరి కమ్మివైచిన పిమ్మట కొనినవాఁడు క్రయధనమంతయు నీయనియెడల విక్రేత ఆఆవును వారికి స్వాధీనము చేయక తన దొడ్డియందే యుంచి మామూలుగ తన ఆవుమాదిరిగనే పెంచుకొనుచున్నను అది వివాదస్థానమగును. ఎందువలననన అది అమ్మివేయఁబడినఆవు అని పేరు పొందును. వాఁడు డబ్బు యిచ్చెనా? లేదా ? అని విచారించువా రుండరు. నీవు అమ్మితివా ? లేదా ? అనియే ప్రశ్నింతురు.

విక్రీతే కరిణి కి మంకుశాయ వివాదః

ఏనుఁగును అమ్ముకొనిన తరువాత అంకుశము కొఱకు తగాదా యెందులకు ?

విపులకదలీఫలలిప్సయా జిహ్వాచ్ఛేదనమ్

చాల అరటిపండ్లయందలిలిప్సచే నాలుక తెగకోసికొనుట.

పరమేశ్వరాభేదతృష్ణచే విష్ణువుయొక్క గుణోత్కర్ష ఎండమావులతో సమానమైన దని నుడువుట - విపులకదలీఫలలిప్సయా జిహ్వాచ్ఛేదనమును పోలియున్నది. ఇట్టి విష్ణువిద్వేషణమువలన అంధతమసనారకప్రవేశము సంభవించును.

విలూననాసికస్యాఽఽదర్శదర్శనమ్

(కోపముచే నోడ లెఱుఁగక) ముక్కు కోసుకొనినవానికి అద్దము చూపుట.

పొడమినకినుక నేర్పుగా నుపశమింపఁజేయుచు దానివలన సంభవించు ననర్థములను గమనింపఁజేయుచు సన్మార్గము నుపదేశించుట — విలూననాసికస్యాఽఽదర్శదర్శనమును బోలును. (మాఱువలుకుట కినిసినవానికి మఱింత కోపోద్దీపన కారణ మగును గాన యుక్తిచే దానిని నివారించుట మేలు.)

విషకుంభం పయోముఖమ్

మూతిదగ్గఱ చుట్టు మాత్రము పాలచే పూయఁబడి ఉన్న విషపుకుండ.

పైకి మంచిగా కనఁబడుట; లోపలమాత్రము విషము.

"పరోక్షే కార్యహన్తారం ప్రత్యక్షే ప్రియవాదినమ్
వర్జయే త్తాదృశం మిత్రం విషకుంభం పయోముఖమ్"

విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్

విషవృక్షన్యాయమును జూడుము.

విషమోపి విగాహ్యతే నయః కృతతీర్థః పయసా మివాశయః

రేవు చేయఁబడిన జలాశయము వలె నెంత విషమ మైనను దారిచేయఁబడి శాస్త్రము సులభప్రవేశమున కర్హ మవును.

విషం మృత్యుః

విషము మృత్యువు. (అనిన మృత్యువునకు విషము నిమిత్తము అని భావము.)

"ఆయు ర్ఘృతమ్; లాంగలం జీవనమ్" మున్నగునవి చూడుము

విషస్య విష మౌషధమ్

విషమునకు విషమే మందు.

"అస్త్ర మస్త్రేణ శామ్యతి; వజ్రం వజ్రేణ భిద్యతే" మున్నగువానివలె.

దీనినే "విషం విషేణ శామ్యతి" అందురు.

వృద్ధి మిష్టవతో మూల మపి తే నష్టమ్

అభివృద్ధి నపేక్షించు నీకు మొదలే నాశనమైనది. భక్ష్యము లున్నవను నాశతో పాములబుట్టకు రంధ్రము వేసి దూరిన ఎలుకకు భక్ష్యములు దొరుకకపోగా లోపల నున్న పామువలన మరణము సంభవించునట్లు.

"చర్మతంతో మహిషీం హన్తి" అన్నట్లు.

వృద్ధి మిష్టవతో మూల మపి నష్టమ్

పైదానికిని, దీనికిని "తే" మాత్రమే భేదము.

"లేనిదానికి ఆశపడఁగా ఉన్నదికూడా ఊడ్చిందఁట" అని తెనుఁగుసామెత.

ఎక్కువ వడ్డీకి ఆశపడఁగా అసలునకే భంగము వాటిల్లి నట్లు.

వృశ్చికభియా పలాయమానః ఆశీవిషముఖే నిపతితః

తేలున్న దను భయముచే పరువెత్తుచు నొకఁడు పోయి, పోయి కొండచిలువనోటిలో పడినాఁడఁట.

"ఏకా మసిద్ధిం పరిహరతో ద్వితీయాపద్యతే" అనుదానిం జూడుడు.

వృషభకలహే వత్సపాదభఙ్గః

ఆవులు, ఆవులు పోట్లాడి లేఁగలకాళ్ళు విఱుగ ద్రొక్కి నట్లు.

"మగఁడు, పెండ్లాము పోట్లాడి దేవతార్చన బ్రాహ్మణునిపైఁ బడినట్లు" అని తెనుఁగుసామెత.

వ్యాపకవ్యావృత్త్యా వ్యాప్యవ్యావృత్తిః

వ్యాపకము పోయినపుడు వ్యాప్యము నయితము పోవును. మేఘము పోయిన నీలాదిత్వాదులును పోవునట్లు.

"వ్యాపకాభావే వ్యాప్యం నాస్తి" అనియు దీనిని వాడు చుందురు.

శత్రో రపి గుణా వాచ్యా వాచ్యా దోషా గురో రపి

శత్రువునైనను వాని మంచిగుణములను చెప్పకొనవలెను. గురువిషయమైనను (సంకోచింపక) దోషములను చెప్పవలెను.

శాన్తే కర్మణి వేతాలోదయః

కర్మ పూర్తి అయినపిమ్మట వేతాలుఁ డుదయించినట్లు.

వచ్చిన అనర్థమునకు ప్రతీకార మొనరించి దాని నివర్తింప జేయఁ దగిన శాంతికర్మ చేయ నారంభించి ముగించిన వెనువెంటనే భయంకరమైన ఆకారముతో వేతాలుఁ డొకఁడు బయలుదేరినట్లు. దానివలన నారబ్ధకర్మమునకు వ్యాఘాతము, స్వాభీష్టాపూర్తి సంభవించుచున్నవి.

ఉదా—జీవేశ్వరాభేదమును సాధింపఁ బ్రయత్నించి వాదము చేయువాఁడు భేదశ్రుతి నుదాహరణముగ గైకొనినట్లు. (దానివలన వానివాదమంతయు ధ్వంసమై పోవుట యేగాక భేదత్వసిద్ధిరూపానర్థము సయితము పొడముచున్నది.)

శాబ్ద్యాకాంక్షా శబ్దేనైవ పూర్యతే

క్రియాసంబంధమైన ఆకాం శబ్దముచేతనే పూరింపఁ బడును.

శామ్యే త్ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః

దుర్మార్గుఁడు ప్రత్యపకారముచేతనే లొంగునుగాని ఉపకారముచే లొంగఁడు.

శాల్యాదివిషయస్య ముసలాదేః కారణస్య శ్యామాకేఽభిహతి ర్భవతి

బియ్యము దీయుటకై కారణములైన ముసలాదులచే శ్యామాకాదులు దంపఁబడును.

కరణము యద్విషయమై యుండునో తద్విషయమై క్రియ యుండవలయు నను నియమము లేదు — ఎట్లన — శాల్యాదివిషయస్య ముసలాదేః కారణస్య శ్యామాకేఽభిహతి ర్భవతి.

శాస్త్రఫలం ప్రయోక్తరి

శాస్త్రఫలము ప్రయోక్త కనువర్తించును.

అనఁగా — శాస్త్రములయందు నుడువఁబడిన యజ్ఞయాగాది క్రియాఫలము తదాచరణ నిరతుఁడవు వానికిఁ జెందును గాని — ముని ర్మనుతే మూర్ఖో ముచ్యతే — అనునట్లు యితరునకుఁ జెందదు.

అంతియగాక యీన్యాయమునే బలపఱచుచు — అన్యుఁడన్యకర్మప్రజనితఫలభాక్కు వనెడల శాస్త్రమునకు వ్యాకులతయు సంభవించు — నని విజ్ఞులచే నుడువఁబడియున్నది.

శిబికోద్వాహ్యచ్ఛన్నరవత్

పల్లకీ మోసికొనిపోవు మనుష్యుల వలె.

పల్లకీ మోయు వారు ఒకేమాదిరి స్థితితో నందఱు కలిసి మోసికొనిపోదురు. వారిలో ఎవఁడు తనపనిమానినను

శిబికావహనము సరిగ నెఱవేఱదు.

అట్లే—పదము లన్నియుఁ గలిసి వాక్యార్థమును బోధించును. మోయు వారు సరిగ కలియకపోయిన పల్లకి నిష్ప్రయోజనమైనట్లే పదములు కలియక అసందర్భములైన వాక్యార్థము నయిత మసంగతమే యయి దాని అర్థమే చెడును.

శిరశ్ఛేదేఽపి శతం న దదాతి వింశతి పఞ్చకంతు ప్రయచ్ఛతీతి శాకటికన్యాయః

ఒకబండిలాఁగువాఁడు తల దీసినను నూఱు రూపాయ లీయను, అయిదు ఇరవైలు ఇత్తు నని వాదించెనఁట.

ఉదా—ప్రపంచమునకు మిథ్యాత్వమును నుడువను; అసత్త్వమును (అభావత్వమును) చెప్పెదను అన్నట్లు. పర్యాయపదమునే గ్రహించి మూర్ఖత నవలంబించుచు హాస్యాస్పదుఁ డవుట అని న్యాయాశయము.

శాకటికన్యాయము జూడుము.

శిలాఘనమధ్యస్థప్రదీపసహస్రప్రథనవత్

రత్నశిలామధ్యమున నుంచఁబడిన యొక పెద్దదీపము (అాతి పలకలలో ప్రతిఫలించి) కొన్నివేలదీపములుగ భాసించు నట్లు.

విజ్ఞానము అవభాసకాన్తర నిరపేక్షమై తానె అట్లు లవభాసించును.

శీర్షే సర్పో దేశాన్తరే వైద్యః

తలమీఁద పాము; దేశాంతరమందు వైద్యుఁడు.

నెత్తిమీఁద వర్షకాలపు మేఘాడంబరము; దూరదేశమున భార్య. ఇఁక నా స్థితి నెత్తిమీఁద పాము; హిమవత్పర్వతముపై పామువిషమును నివారించు మూలికలు అనునటులున్నది. అని యొక విరహవ్యథాతప్తుఁడు తన వ్యథ వెలిబుచ్చెను.

శ్వఃకార్య మద్య కుర్వీత

రేపటిపని నిన్నాళనే పూర్తి చేసుకొనుట క్షేమకరము.

నేఁటిపని సయితము సోమరితనముచే రేపటిపైఁ బెట్టక రేపటిదిసయితము మీనాఁడే చక్కఁబెట్టుకొనువాఁడు సేమము నొందును.

అనఁగా—అవ్యగ్రతతో గార్యములందుఁ బ్రవర్తించుట క్షేమకరమని న్యాయాశయము.

ఒక ఉపాధ్యాయుఁడు పిల్లలకు "శ్వఃకార్య మద్య కుర్వీత—రేపటిపనిని నేఁడే చేయుఁడు" అని బోధించగా, నొక పిల్లవాఁడు లేచి— అయ్యా! రేపు నేను చచ్చిపోవుదును అనెను. వెంటనే పంతులు—అట్లయిన నేఁడే ఆపనిని చేయుము. అది చాల మంచిది—అనెనఁట.

శ్వలీఢ క్షీవ పాయసమ్

శ్వలీఢపాయసన్యాయమును జూడుము.

శ్వా కర్ణేవా పుచ్ఛే వా ఛిన్నే శ్వైవ భవతి నాశ్వో న గర్దభః

చెవులుగాని, తోకగాని, కోసివేయఁబడినను కుక్క కుక్కయే అవునుగాని గుఱ్ఱమో, గాడిదో, కానేఱదు.

"ఏకదేశవికృత మనన్యవత్" అని చెప్పఁబడుటచేత అది గుఱ్ఱముగాక కుక్కయే అవును.

ఛిన్నపుచ్ఛశ్వదృష్టాన్తమును, న హి గో ర్గదుని జాతే విషాణే వా భగ్నే గోత్వం తిరోధీయత్తే; న హి కేవల భోజీ దేవదత్తోఽన్యైః సహ పంక్త్యాం భుంజానోఽన్యత్వం ప్రపద్యతే" మున్నగువానిం జూడుము.

సందిగ్ధం సప్రయోజనంచ విచార మర్హతి

"సందిగ్ధే న్యాయః ప్రవర్తతే" చూడుము.

సందిగ్ధస్య వాక్యశేషా న్నిర్ణయః

సందిగ్ధార్థము మిగిలిన వాక్యమునుండి నిర్ణయింపవలెను. దీనినే మఱొకరకముగ — సందిగ్ధేషు వాక్యశేషాత్ — అనియు నందురు.

సకృత్ప్రవృత్తాయాః కి మవగుంఠనేన?

ఒకమాఱు ప్రవర్తించినదానినే మఱలమఱల చర్వితచర్వణము చేసుకొననేల?

ఒకమాఱునుడువఁబడిన దానినే మఱల జెప్పనవసరము.

"వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ"

మేఘసందేశము

ఇంక—తిర్యగ్దంతప్రహారీతు గజః పరిణతో మతః—అను నిఘంటువువలన పరిణతశబ్దముచేతనే వప్రక్రీడారతగజార్థ సిద్ధి కలుగుచున్నను మఱల "వప్రక్రీడాపరిణతగజ" అని మూలమున నుడువఁబడినది. అట్లు నుడువుటలోఁ గల ప్రయోజన మెయ్యదియో?

అట్లే—అరుణైకహాయనీ—యు నెఱుంగునది. (అరుణైక హాయనీన్యాయము.)

సముదాయే వాక్యపరిసమాప్తిః

మొత్తముసముదాయమును గూర్చి చెప్పఁబడిన విధి వాక్యము ఆసముదాయమున కంతకును వర్తించును.

ఉదా — గర్గశతదండనన్యాయము.

నూఱుగురు గర్గులను దండింపవలయు ననిన క్రమముగ నూఱుగురను దండింపవలయుననియే ఆవాక్యాశయము గాని వారిలో కొందఱిని దండించి కొందఱిని విడిచిపెట్ట వలయు నని గాదు.

సమ్భవ త్యేకవాక్యత్వే వాక్యభేదశ్చ నేష్యతే

ఒకవాక్యము ఒకేవాక్యముగా నుండుటకు తగియుండఁగా దానిని వేఱుచేయుట తగదు.

అనఁగా—ఒకవాక్యమున కేకవాక్యత్వము సిద్ధించు చుండఁగా భిన్నవాక్యత్వమును దాని కాపాదింపఁజేయు టభిమతముగాదు.

"వక్తృభేదేఽప్యేకవాక్యతా సాకాంక్షత్వాత్పూర్వోత్తరవాక్యయో రేకార్థత్వం వాక్యైకవాక్యసంభవే తద్భేదస్యాయోగా దిత్యర్థః"

(ఆనందగిరి) బ్రహ్మసూత్రభాష్యమ్

సమ్భవే వ్యభిచారే చ స్యా ద్విశేషణ మర్థవత్

సంభవము, వ్యభిచారము నున్నపుడే విశేషణ మర్థవంత మవును.

సంభవమన విశేషణప్రతిపాదితార్థమును లక్ష్యమునఁ బ్రవర్తించుట. అసంభవమన విశేషణప్రతిపాదితార్థము లక్ష్యమునఁ బ్రవర్తింపకుండుట.

కావున అసంభవమున్నపుడే ప్రయుక్తవిశేషణము సార్థకమవును.

ఉదా—ఆయింటిలోని మంచిపిల్లవానిని బిలువుము—అనిన కొందఱు చెడ్డపిల్లవాండ్రుకూడ నుండిన ప్రయోగింపఁబడిన "మంచి" యను విశేషణము సార్థకమవును. అట్లుగాక అందఱు మంచివారలే అయిన "మంచి"కి అర్థమే యుండదు.

"నీల ముత్పలమ్" అనల్ల కలువ అనినపుడు నీలత్వము ఉత్పలసామాన్య ధర్మము కాకపోవుటచే "నల్లని కలువ" యని తక్కిన చాలరంగులుగల కలువలలో వ్యవస్థ చేసి నుడువఁబడినది. కలువ లన్నియు నీలములుగ నున్నపుడు

నల్లనికలువ అని ప్రయోగించవలసిన అవసరమేమి? అట్లు ప్రయోగించిన దాని కర్థమేముండును ?

అదియే ఆనందగిరి యిట్లు నుడువుచున్నాఁడు—

"నీల ముత్పల మిత్యత్ర విశేషణవిశేష్యయోః సంభవే విశేషణం వినా విశేష్యస్య వ్యభిచారే ప్రయుక్తే నీల మితి విశేషణ మర్థవ ద్దృష్టమ్."

సర్వం కార్యం సకారణమ్

ప్రతియొక కార్యము సకారణముగ నుండును.

కారణము లేనిదే కార్యము కలుగదు.

సర్వం ఖలస్య చరితం మశకః కరోతి

దుష్టుని పని అంతయు దోమ చేయును.

దుర్జనమశకన్యాయమును జూడుము.

సర్వం జ్ఞానం ధర్మి ణ్యభ్రాన్తం, ప్రకారే తు వ్యత్యయః

సమానధర్మములు గల ధర్మియందు అవేధర్మములతో గలుగుజ్ఞానము అభ్రాంతజ్ఞానము అనఁగా భ్రమరహితమైన జ్ఞానమే అవును. ప్రకారే—అనఁగా—విధర్మియందు ధర్మిధర్మప్రవృత్తమైన జ్ఞానము భ్రాంతజ్ఞానము—భ్రమచేఁ గలిగిన జ్ఞాన మవును.

రజతమందు రజతజ్ఞానము అభ్రాంతజ్ఞానము; రజతేతర మయిన శుక్తియందు రజతజ్ఞానము భ్రాంతజ్ఞానము.

సర్వం బలవతః పథ్యమ్

బలవద్వస్తువునకు సర్వము సరిపడును.

బలవంతునకెద్దియైనఁ జెల్లును. బలహీనునకది ప్రత్యవాయ కారణ మవును.

పెద్ద పెద్ద మఱ్ఱిచెట్లు మున్నగువానిని విఱుచుట, తినుట మహాగజములకే చెల్లుబాటవును గాని అల్పజంతువులకుఁ దత్ప్రయత్నమే వినాశకారణ మవును.

సర్వనాశే సముత్పన్నే అర్ధం త్యజతి పండితః

సర్వనాశము సంభవించినపుడు పండితుఁడైన వాఁడు సగము విడచివేయును. (తక్కిన సగముతో తనకార్యము సాధించుకొనును.)

అర్ధనాశే సముత్పన్నే సర్వం త్యజతి దుర్మతిః—అవివేకి అయినవాఁడు సగమునకు నాశనము సంభవించినపుడు పూర్తిగ నంతయు వదలివైచును.

సర్వశాఖాప్రత్యయ మేకం కర్మ

వేదములందలి అన్ని శాఖలు నంగీకరించునది ఒక (యాగాది) కర్మమే.

సర్వశాఖాప్రత్యయన్యాయమును జూడుము.

సర్వం పదం హస్తిపదే నిమగ్నమ్

హస్తిపదన్యాయమును జూడుము.

క. భూమిన్ "సర్వం హస్తిప
దే మగ్న" మ్మనెడుమాట్కిఁ దెలియఁగఁ దన్మా
యామగ్నపు శివవిధిర
క్షోమరమాయావిధంబు నవనీనాథా!"

విష్ణుమాయానాటకము ఆ. 1. ప. 44
(చింతలపూడి యెల్లనార్యుఁడు).

సామాన్యవిధి రస్పష్టః

సర్వసామాన్యముగ నుడువఁబడిన విధి (General rule) అస్పష్టముగ నుండును.

"న హి సామాన్యవాచీ శబ్దో విశేషా నభివదతి" అను దానిం జూడుము.

సోపానత్కే పాదే ద్వితీయా ముపానహ మశక్యత్వా న్నోపాదత్తే

చెప్పులు తొడిగి యున్న కాలున మఱొకచెప్పును తొడుగు టశక్యము గాన అట్లు తొడుగుకొనరు.

"న హి సోపానత్కే పాదే పున రపి సోపానహ ముపాదత్తే" అనుదానిం జూడుము.

స్వభావో దురతిక్రమః

స్వభావమును దాఁటుట చాలకష్టము.

"యః స్వభావో హి యస్య స్యా త్తస్యాసౌ దురతిక్రమః
శ్వాయది క్రియతే రాజా తత్కింనాశ్నాత్యుపానహమ్?"

"క. కనకపుసింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టము గట్టిన
వెనుకటి గుణ మేల మాను వినురా సుమతీ!"

స్వాంగం స్వవ్యవధాయకం న భవతి

తనదేహము తన కంతర్ధిని గలిగింపనేఱదు.
(అనఁగా ఎవరిశరీరము వారికి త్రోవ కడ్డము రాదు.)

స్వాంగులిజ్వాలయా పరం దిధక్షుః స పరం దహేద్వానవా, స్వాంగులిదాహ మనుభవతి

తనవ్రేలికొనపై నగ్నిహోత్రము నిడుకొని విరోధిని దహింప బ్రయత్నించువాఁడు—విరోధిని దహింపఁగలుగునో, దహింపలేఁడో, ఆమాట నటుండనిండు—తనవ్రేలు కాలి పోవుట మాత్ర మవశ్య మనుభవించును.

త్రికాలములయందును అసాధకమైన దసాధన మవునని వాదించు ప్రతిపక్షియొక్క స్వవాక్యముచేతను ప్రతిషేధ వాక్యముయొక్క అసాధకత్వము అభ్యుపగత మగుచున్నది.

హసద్భిః క్రియతే కర్మ రుదద్భి రనుభూయతే

నవ్వుతూ మహాసంతోషము పొందుతూ ఉన్నవారలచే చేయఁబడుకర్మ ఏడ్చుచూఉన్నవారలచే అనుభవింపఁ బడును.

"పిల్లికి చెలగాటం; ఎలుకకు ప్రాణసంకటం" అన్నట్లు.

హోతారమపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః

ముట్టుకొనఁబడునెడల అగ్నిహోత్రము తనలో హోమము చేయువానిని గూడ దహించును.

క్షతే ప్రహారా నిపతం త్యభీక్ష్ణమ్

దెబ్బతగిలిన చోటుననే ఎక్కువగ దెబ్బలు తగులుచు ఉండును.

క్షతే మక్షికాపాతః

పుండుమీఁద ఈఁగ వ్రాలినట్లు.

అట్లు వ్రాలిన ఈఁగ తొలిచి తొలిచి పుండును పెద్దది చేయుచు త్రొలినను పోక వేధించును.

క్షీరం విహాయారోచకగ్రస్తః సౌవీరరుచి మనుభవతి

నోరు చవిచెడిన రోగి పాలు త్రాగ నిచ్ఛలేక మాని, పుల్లరేగుపండ్ల రుచిని మాత్ర మనుభవించును.

"సుఖాభివ్యక్తియే ముక్తి" అను పక్షమును త్యజించి "దుఃఖనివృత్తియే ముక్తి" యని స్వీకరించుటపై "క్షీరం విహాయారోచకగ్రస్తః సౌవీరరుచి మనుభవతి" అను న్యాయమును బోలియున్నది.

క్షీరనీరన్యాయము

పాలు నీరు కలిసినట్లు.

పాలు, నీళ్ళు కలయిక అవ్యక్తమై వేఱుపఱుపరాక ఏకరూప మవును.

ఈకలయిక (సంసృష్టి)మూఁడురకములు—వ్యక్త, అవ్యక్త వ్యక్తావ్యక్త—అని.

రెండువస్తువుల స్వరూపము స్పష్టముగ వ్యక్తమవునది—వ్యక్తసంసృష్టి. ఇది తిలతండులన్యాయమున కుదాహరణము.

వస్తుస్వరూప మెఱుఁగరాక ఒకేరూపమున భాసించునది—అవ్యక్తసంసృష్టి. దీనిని నీరక్షీర, క్షీరనీర న్యాయములు సూచించును.

వస్తుస్వరూపము వ్యక్తము, అవ్యక్తము నవుచుండునది—వ్యక్తావ్యక్తసంసృష్టి.

దీనిని నరసింహన్యాయము తెలియజేయును.

ఇంకఁ బ్రకృత క్షీరనీరన్యాయమున కుదాహరణముం జూడుడు—

తే. తలపు లొక్కటి గాఁగ నగ్గలపువలపు
చెలిమికలిమిని దొలఁకక కలసి మెలసి
భువిని క్షీరోదకన్యాయమునను వెలయు
దంపతులు చేసినట్టిదే తపము తపము.

తారా. 2-135.

---

లక్ష్మి పవర్ ప్రెస్, తెనాలి. 11/1939 A.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | సవరణ |
| --- | --- | --- | --- |
| 11 | 13 | కజ్జలజలజ | కజ్జలజల |
| 13 | 20 | సూకర | దంతి |
| 19 | 20 | గర్ధభ | గర్దభ |
| 20 | 1 | గర్ధభ | గర్దభ |
| 25 | 18 | బొమ్మలేని | బొమ్మలోని |
| 30 | 17 | బహుమాన...ధన్యుఁడయ్యెను | మణులసమర్పించుకొనునా ? |
| 48 | 1 | వానుఁడు | వాఁడును |
| 66 | 10 | ఎగిరిన......గూడను | (అక్కఱలేదు) |
| 71 | 21 | కాశీఖండము | పాండురంగమాహాత్మ్యము |
| 79 | 11 | మహామత్స్యతర | మహామత్స్యతీర |
| 105 | 5 | లొహాగ్ని | లోహాగ్ని |
| 115 | 14 | పర్ణిభక్షణము | పర్ణభక్షణము |
| 118 | 19 | శుభఫతితములు | శుభఫలితములు |
| 142 | 9 | యుదాహారము | యుదాహరణము |
| ,, | 13 | ముత్యములలో | ముత్యపుచిప్పలో |
| 149 | 8 | కోడలు | అత్త |
| ,, | 9 | కొండటీన్యాయ......... ......యందురు | శ్వశ్రూనిర్గచ్ఛోక్తిన్యాయము నియ్యదియు నొకటియే. |
| 150 | 12 | ఆప్రయోజకుల | అప్రయోజకుల |
| 156 | 5 | నుంచి | మంచి |
| 173 | 11 | కష్టపాధ్యము | కష్టసాధ్యము |
| ,, | 15 | నవనరము | నవసరము |
| 180 | 17 | ప్రవర్తిందును | ప్రవర్తించును |
| 181 | 16 | చమురు......మారిపోవును. | చమురున్నంతవఱకే దీపము |
| 191 | 1 | ఆగ్న్యాయనయన | అగ్న్యాయనయన |

| పుట | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 193 | 11 | నూహాపోహాలు | నూహాపోహాలు |
| ,, | 21 | వ్యాక | వాక్య |
| 202 | 15 | అకాశ | ఆకాశ |
| 216 | 19 | అగిపోవు | ఆగిపోవు |
| 217 | 15 | ప్రణీయత్తే | ప్రణీయస్తే |
| 232 | 6 | తదంతాపక్షిగ | తదంతాపకర్ష |
| 251 | 13 | స్పృశ్యతే | స్పృశ్యతే |
| 267 | 11 | దేయో కస్యచిత్ | దేయో న కస్యచిత్ |
| ,, | 13 | మీఁగూడడు | మీఁగూడదు |
| ,, | 15 | అఖ్యాతానా | ఆఖ్యాతానా |
| ,, | 16 | ,, | ,, |
| 272 | 12 | గడంచి | గడించి |
| 288 | 5 | మున్నగుబానిం | మున్నగువానిం |
| 305 | 16 | కన్వోద్వాహః | కన్యోద్వాహః |
| 309 | 3 | వ్వాపారా | వ్యాపారా |
| 312 | 18 | స్వాత్ | స్యాత్ |
| 319 | 16 | మస్తరేణ | మస్తరేణ |
| 321 | 3 | డుత్కృష్ఠ | డుత్కృష్ట |
| 329 | 4 | ప్రవదీప | ప్రదీప |
| 335 | 20 | ముణ్డిడిత | ముణ్డిత |
| 338 | 6 | కనిత్వత్వము | కనిత్యత్వము |
| 343 | 4 | వస్తువులను | వస్తువులకు |
| 347 | 2 | చువ్నది | చున్నది |
| ,, | 17 | పనితనముమ | పనితనమును |
| 355 | 2 | శ్రశువు | శత్రువు |
| ,, | 11 | వ్యాఘుతము | వ్యాఘాతము |
| ,, | 17 | ఆకాం | ఆకాంక్ష |
| ,, | 19 | శ్రామ్యే | శామ్యే |

# లక్ష్మీగ్రంథమండలి, తెనాలి.

## నియమములు

మా గ్రంథమండలిలో సమర్థులగు పండితులచే రచింపఁబడిన పౌరాణిక, ఆర్థిక, రాజకీయ సంబంధములగు గ్రంథములు — రెండువందల పుటలకు పైగనుండునవి — సంవత్సరమునకు నాలుగు వంతున ప్రకటింపఁబడును.

అవకాశమునుబట్టి అనుబంధములుగాఁ గొన్ని చిన్న చిన్న పుస్తకములుగూడ — అందఱకు నుపయోగపడునవి — ప్రకటించుచుందుము. ఈచిన్నపుస్తకములు, భక్తి, జ్ఞాన, వైరాగ్యములు ప్రబోధించునవిగా నుండగలవు. ఈయవి రచించుటలో విదుషీమణుల కెక్కువ ప్రాధాన్య మీయఁబడును.

ఈగ్రంథమండలిలో జేరువారు "మహారాజపోషకులు, పోషకులు, అభిమానులు, చందాదారులు" అని నాలుగు తెగలుగ వ్యవహరింపఁబడుదురు.

**మహారాజపోషకులు:**

ఒకేసారి రు 50-0-0 (ఏబది రూపాయి) లొసంగువారు మహారాజ పోషకులగుదురు. గ్రంథమండలి యున్నంతకాలము, గ్రంథమండలిలో నచ్చగు ప్రతిపుస్తకము నందును వీరిపేరులు వేయుచు పుస్తకము లుచితముగాఁ బంపెదము. ప్రతిపుస్తకము వీరికి క్యాలికో బైండుచేసి ఈయఁబడును.

**పోషకులు:**

పోషకులుగాఁ జేరువా రొకేసారి రూ 25-0-0 (ఇరువదియైదు రూప్యము) లీయవలయును. వీరికిని మహారాజ

పోషకులకున్న సౌకర్యములే ఉండును. కాని క్యాలికో బైండు పుస్తకములుగాక మామూలు బైండుపుస్తకము లొసంగెదము. పోష్టుఖర్చులు వారే భరించుకొనవలయును.

**అ భి మా ను లు:**

అభిమానులుగాఁ జేరువారు ముందుగా, రు 6-0-0 లు (ఆరురూపాయలు) లీయవలయును. పేరులు పై వారివలెనే ప్రతి పుస్తకములోను ప్రకటింపబడును. మండలిలో వచ్చుగు ప్రతి పుస్తకము వీరు తీసుకొనవలయునను నియమము లేదు. కాని వలయుపొత్తము చందాదారులకిచ్చు రీతిగా నిచ్చెదము. ఆపుస్తకములు క్యాలికో బైండు చేసినవిగా నుండును.

**చ ం దా దా రు లు:**

చందాదారులుగాఁ జేరువారు ముందుగా ప్రవేశరుసుము రు 0-8-0 (ఎనిమిదణాలు) చెల్లించవలయును. సంవత్సరము చందా ప్రవేశరుసుముతోసహా రూ 5-0-0 (అయిదు రూపాయ) లుండును. ప్రతిపుస్తకము వీరు తీసుకొనవలయును. ప్రకటన పూర్తికాగానే పుస్తకములు 'వీ. పీ.' గా బంపెదము. ఇతరులకువలెగాక వీరికి 25% తగ్గించి ఈయఁబడును.

ప్రతి సంవత్సరాంతమున ప్రకటించు పుస్తకములలో వీరి పేరులన్నియు ముద్రింపబడును. అనుబంధములుగాఁ బ్రకటించునవి తీసుకొనవలయునను నియమము లేదు. వలయు పొత్తము తగ్గింపుధర కీయఁబడును.

లక్ష్మీగ్రంథమండలి,
తె నా లి.

వివరములకు,
పి. యల్. నారాయణ.

## మా గ్రంథమండలిలో ప్రకటితములు

కవిసార్వభౌమ: శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

మహాభారతరహస్యవిమర్శనము 0—4—0

రచయితలు: కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి. ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

లక్ష్మీనరసింహస్తవము 0—0—6

(ఉత్పలమాలికలు. నకారప్రాసతో అన్ని పద్యములకు ఒకేమాదిరి మకుటము)

రామలింగేశ్వరస్తవః 0—1—0

(సులభశైలిలో పారాయణకనుకూలములగు చిన్నచిన్న సంస్కృతశ్లోకములు నూటఎనిమిది.)

పుష్పబాణవిలాసము 0—2—0

(అవతారిక, నాయిక, నాయకుడు, శృంగారము, ప్రతిపద్యమున విపులీకరింపబడినవి).

# ఈ వ్యాఖ్యాతల మఱికొన్ని గ్రంథములు

## అచ్చయినవి

ప్రణయ గీతాలు
పుష్పమాల (ఖండకావ్యము)
బాష్పకణములు (దేశనాయక స్మృతి)
ఆత్మత్యాగి (ప్రస్తుతము అచ్చులో లేదు)
కవుఁగిలి (ద్విపద, ఒక ప్రేమకథ)
శ్రీమద్భాగవత మాహాత్మ్యము (౮ ఆశ్వాసములు)
దయానందతిమిరభాస్కరము (ప్ర. భా. సత్యార్థప్రకాశ ఖండనము)
రాధామాధవశతకము
ఆంధ్రప్రతిభ (ప్రథమ భాగము)
బాలభాగవతము (ద్వితీయ స్కంధము. వైశాఖపురాణము)

## అచ్చు కానున్నవి

శ్రీ విద్యాశంకర విజయము
మదనకలావిలాసము
దయానంద తిమిరభాస్కరము (2, 3, 4 భాగములు)
దయానంద మిథ్యార్థ ప్రకాశము
గణేశ పురాణము
భద్రావత్యభ్యుదయము (హాస్యప్రబంధము)
ఆంధ్రప్రతిభ (ద్వితీయ భాగము)
పురాణములు
భారతీయుల అధోగతి
రామకృష్ణ శతకము
నీతిశాస్త్రము
భావదర్పణము
ఛందమాల

